# పంచక్రోశీ యాత్ర

**మే 20 నుండి 26, 2017 వరకు (6 రాత్రులు / 7 రోజులు)**

పంచక్రోశీ యాత్ర చేసినట్లయితే ఒక యుగంలో చేసుకున్న పాపాలన్నీ బస్మీపటలమై పోతాయి

## ఉజ్జయిని పర్యటన

కాశీక్షేత్రంలో మన్వంతరం వరకు నివసిస్తే వచ్చే పుణ్యఫలం - వైశాఖమాసంలో ఉజ్జయిని పంచక్రోశీ యాత్ర చేస్తే సులభంగా వస్తుందని స్కందపురాణం చెబుతుంది

ఛార్జీలు తల ఒక్కంటికి : రూ. **11,500/-***







రైలు టికెట్లు అదనం *షరతులు వర్తిస్తాయి

## జ్యోతిర్లింగ దర్శనం (3 రాత్రులు / 4 రోజులు)

**ఖాండ్వా - ఓంకారేశ్వర్ (1 రాత్రి) మహేశ్వర్ - ఉజ్జయిని (2 రాత్రులు)**

ఛార్జీలు తల ఒక్కంటికి : రూ. **6,300/-***

హైదరాబాద్ నుండి అజ్మీర్ ఎక్స్‌ప్రెస్ ద్వారా బయలుదేరును

ఎ/సి వసతి, ఎ/సి రవాణా, అల్పాహారము & రాత్రి భోజనము



**MADHYA PRADESH TOURISM**

e-mail:hyderabad@mptourism.com

www.mptourism.com

Balayogi Paryatak Bhavan, Opp. Greenlands Guest House, Begumpet, Hyderabad-16. Ph: 040-23407785.

Mobile : **98660 69000, 99510 80605**






ముఖచిత్రం: రతీమన్మథులు
చిత్రకారుడు: సురేష్ కడలి


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**
*నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





## తగ్గుముఖం

**మా**హిష్మతీనగరంలో నేరాలు అన్నీ ఇన్నీ కావు. రోజురోజుకీ పెరిగిపోసాగాయి. వాటిని అరికట్టేందుకు రాజుగారు ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించలేదు. విసిగిపోయిన రాజు ఈ నేరాలను అరికట్టేవారే లేరా? ఉంటే బాగుణ్ణు! వారికి ఊహించనంతసొమ్ము చెల్లిస్తాను అన్నాడు. అప్పుడు ఒక బీదబ్రాహ్మడు రాజును సమీపించాడు. చెప్పాడిలా.

అయ్యా! ఈ నగరంలో నేరాలు నేను అరికడతాను. ముందుగా మీరో పని చెయ్యాలి.

చెప్పండి ఏం చెయ్యమంటారు? అడిగాడు రాజు.

రాజ్యంలో ఉన్న కారాగారాలన్నీ కూల్చేయండి. ఒకే ఒక్క కారాగారం, అందులో ఒకేఒక్క నేరస్థుడు పట్టేలా నిర్మించండి చాలు చెప్పాడు బ్రాహ్మడు.

సరేనన్నాడు రాజు. బ్రాహ్మడు చెప్పినట్టుగానే రాజ్యంలోని కారాగారాలన్నీ కూల్చేశాడు. ఒకేఒక నేరస్థుడు పట్టేలా సరికొత్త కారాగారం నిర్మించాడు. మర్నాడే ఎవరో ఏదో నేరం చేశారు. నేరస్థుణ్ణి బ్రాహ్మణుని ముందు నిలబెట్టారు.

వీణ్ణి ఏం చెయ్యమంటారు? అడిగారు సైనికులు.

కారాగారంలో బంధించండి చెప్పాడు బ్రాహ్మడు. బంధించారతన్ని. ఆ మర్నాడు మరొకరు మరో నేరం చేశారు. అతన్ని కూడా బ్రాహ్మణుని ముందు ప్రవేశపెట్టారు సైనికులు.

ఇప్పుడు వీణ్ణేం చెయ్యమంటారు? అడిగారు.

కారాగారంలో బంధించండి చెప్పాడు బ్రాహ్మడు.

అందులో ఒకే ఒక్కడు ఉండగలడు. ఈ నేరస్థుణ్ణి అందులో పెట్టాలంటే పాతనేరస్థుణ్ణి ఏం చెయ్యాలి? అడిగారు.

చంపేయండి చెప్పాడు బ్రాహ్మడు. వాణ్ణి చంపి, వీణ్ణి ఆ కారాగారంలో బంధించండి అన్నాడు.

ఆనాటి నుంచి ఆ రాజ్యంలో నేరాలు తగ్గుముఖం పట్టాయి.

## కోలుకున్న భార్య

**భా**ర్య ఐసియులో ఉంది. ఆమెను చూస్తూ భర్త ఏకధారగా ఏడుస్తున్నాడు. అతన్ని ఓదారుస్తూ అన్నాడిలా డాక్టర్.

మా శాయశక్తులా మేం కృషి చేశాం. అయినా ఫలితం లేదు. బాడీ రియాక్ట్ కావడం లేదు. కోమాలో ఉందామె. ఇక ఆ భగవంతుడే చూడాలి.

అంత మాటనకండి డాక్టర్! నా భార్య నాకు కావాలి. పాపం! ముప్పయి ఏళ్ళకే తన బతుకు ముగిసిపోతుందంటే బాధగా ఉంది అన్నాడు భర్త.

అంతే! చిత్రాతిచిత్రంగా ఈ ఇసిజి పని చేయసాగింది. భార్యలో చలనం కలిగింది. చేయి కదిలింది. భారంగా కళ్ళిప్పి అన్నదిలా భార్య.

ఏంవండీ! మీకెన్నిసార్లు చెప్పాను, నా వయసు ముప్పయి కాదండీ! ఇరవై తొమ్మిదే!

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి
బాధనయినా మరపిస్తుంది.

# నవ్య

సంపుటి: 14 సంచిక: 5

5-4-2017



మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

## మొదటి పేజి

# దానకర్ణుడు

ఇంటిపేరు దానగుంట. పేరు కరుణేశ్వరరావు. పూర్తి పేరు దానగుంట కరుణేశ్వరరావు. అయితే ఆయన్ని అంతా 'దానకర్ణుడు' అని పిలుస్తారు. దానికి కారణం ఉంది. కరుణకి అప్పుడు పన్నెండేళ్ళు. ఏడోతరగతి పరీక్షాఫలితాలు తెలిశాయి. కరుణతోపాటు వాడి స్నేహితుడు రమణమూర్తి కూడా పాసయ్యాడు. పాసయినందుకు వాణ్ణి అభినందిస్తూ తన చేతివాచీ బహుమతిగా ఇచ్చేశాడు కరుణ. అచ్చంగా తీసేసుకో అన్నాడు. ఇంటికి వచ్చాడు. ఏడవతరగతి పాసైనందుకు కొడుకుని అభినందిస్తూ పొద్దున వాచీ కొన్నది తల్లి. పెట్టుకుని సరదాగా తిరిగి రమ్మంది. తిరిగి వచ్చాడు కొడుకు. అయితే వాడి చేతికి వాచీ లేదిప్పుడు. ఏమైంది? ఆందోళన చెందింది. కరుణని అడిగింది. రమణమూర్తికి బహుమతిగా ఇచ్చానన్నాడు కరుణ. వాడేం చేశాడని అడిగితే ఏడోతరగతి పాసయ్యాడన్నాడు. నువ్వెంత? నీ వయసెంత? నువ్వు బహుమతులు ఇవ్వడం ఏమిటిరా? అని నెత్తి కొట్టుకుంది తల్లి. వెళ్ళి అడిగి తీసుకునిరా అని అరిచింది. వెళ్ళనన్నాడు కరుణ. అడిగి తీసుకురానన్నాడు. ఇచ్చిన తర్వాత అడిగి తీసుకోవడం తప్పు అన్నాడు. నేను అడిగి తెస్తానని తల్లి బయల్దేరబోతే తలకొట్టుకు చస్తానని బెదిరించాడు కరుణ. బెదిరించడమే కాదు, రక్తం వచ్చేట్టుగా గోడకి తలకొట్టుకున్నాడు కూడా. దాంతో ఆమె ఆగిపోయింది. అది మొదలు తన వయసుకీ, తాహతుకీ మించి కానుకలు ఇస్తూనే వచ్చాడు కరుణ. కానుకలే కాదు, అవసరానికి ఏది అడిగితే అది, తన దగ్గర ఉంటే చాలు కరుణిస్తాడు. ఇవ్వడం కోసం అతను అప్పులపాలయిన రోజులు కూడా ఉన్నాయి. అందుకే అతన్ని 'దానకర్ణుడు' అంటారంతా.

పెళ్ళి అయింది. ఇద్దరు పిల్లల తండ్రి అయ్యాడు కరుణ. ఓ రోజు ఎండనపడి ఇంటికి వచ్చాడు. వస్తూనే భార్యను దగ్గరగా పిలిచి, మెళ్ళో మంగళసూత్రాలు తీసివ్వు అనడిగాడు. పసుపుకొమ్ము కట్టుకుని, మంగళసూత్రాలు తీసిచ్చిందా వెర్రిబాగుల్ది. ఇవ్వడమే ఆలస్యం, వీధిలో నిల్చున్న సీతమ్మను పిలిచి, ఆమెకు మంగళసూత్రాలిచ్చాడు కరుణ. సూత్రాలు కావాలన్నావుగా తీసుకో, ఇది నా కానుకనుకో! వెళ్ళి పిల్ల పెళ్ళి చెయ్యి. సూత్రాలకోసం పెళ్ళి వాయిదా వెయ్యడం పద్ధతి కాదన్నాడు. అప్పటికి విషయం అర్థమై, కళ్ళు తిరిగి పడిపోయింది భార్య. అయినా బాధపడలేదు, కంగారుపడలేదు కరుణ. ఇది మామూలే అన్నట్టుగా పిల్లలిద్దరినీ దగ్గరగా తీసుకుని కూర్చున్నాడు. కాసేపటికి తేరుకున్న భార్యను కూడా దగ్గరకు తీసుకుని, మన దగ్గర ఉన్నదే అడుగుతారు. అడిగితే లేదనకూడదు. ఒకవేళ లేనిది అడిగినా ప్రయత్నించి చూడాలి. అంతేగాని లేదనడం పాపం అన్నాడు.



పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. పెళ్ళిళ్ళయ్యాయి. తాతయ్యాడు కరుణ. తాత అయినా ఆయన బుద్ధిలో మార్పు లేదు. మార్పులేని బుద్ధి కారణంగా పిల్లలకీ, భార్యకీ చెడ్డయ్యాడు కరుణ. ఇంత వయసు వచ్చినా, మాస్టరుగిరీ చేసినా సొంత ఇల్లు లేదు. అలాగే ఆయనింట టీవీ కూడా లేదు. పెద్దటీవి, ఫ్లాట్ టీవి మొన్నటివరకూ ఇంట్లో ఉండేది. పెద్దాడు కొనిచ్చాడు. మొన్ననే ఫ్రెండ్ అడిగితే ఇచ్చేశాడతనికి. ఇచ్చేసి, టీవి ఉంటే ఏంటో ఇద్దరం ఎవరికెవరం అన్నట్టుగా ఉండేవాళ్ళం. లేకపోవడమే బాగుందోయ్! ఎంచక్కా ఒకరికి ఒకరం అన్నట్టుగా ఉంటున్నాం అన్నాడు భార్యతో. మీరు మారరంది భార్య. రెండు చేతులూ పెద్దగా శబ్దం వచ్చేట్టుగా జోడించి నమస్కరించింది.

పండక్కి కొడుకులూ, కోడళ్ళూ, మనవలూ వచ్చారు. అందరికీ టీవి కావాలి. లేదది. ఉండాలికదా, కొనిచ్చాను కదా అని పెద్దాడంటే... మీ నాన్న సంగతి నీకు తెలిసిందేకదా! ఎవరికో ఇచ్చేశారంది తల్లి. అంతే! పెద్దాడు తోకతొక్కిన పామయ్యాడు. తండ్రి మీద రెచ్చిపోయాడు. ఇలా ప్రతివారికీ అడిగింది కానుకగా ఇవ్వడం గొప్పో పుణ్యమో అనుకుంటున్నారేమో... కాదు, ఇదో జబ్బు. దీన్ని 'డోరోమేనియా' అంటారు. మిమ్మల్ని డాక్టర్‌కి చూపించాలి. లేకపోతే కష్టం అన్నాడు. పెద్దగొడవ చేశాడు. ఆడవాళ్ళూ, పిల్లలూ ఆ గొడవకి అదరిపోయారు. కొడుకు అంత ఎత్తున లేస్తున్నా కరుణ ఏమీ అనలేదతన్ని. కళ్ళల్లో నీరు కుక్కుకుని మౌనం వహించాడు. పొద్దున భోంచెయ్యలేదు కరుణ. రాత్రి కూడా చెయ్యలేదు. దాంతో అంతా బాధపడ్డారు. పండగపూట పెద్దాయన్ని పస్తు పెట్టామన్నారు. పెద్దాడికి జాలేసింది. కంచంలో పప్పూ అన్నం కలిపి, తండ్రి దగ్గరగా వెళ్ళాడు. ముద్దలు చేసి, వద్దు వద్దన్నా తండ్రికి తినిపించసాగాడు. మీకేం కావాలో చెప్పండి, ఇస్తాను. వాటిని మీ ఇష్టం వచ్చినవాళ్ళకి ఇచ్చుకోండి, కాదనను అన్నాడు. దీన్నేం అంటార్రా? అడిగాడు కరుణ. డోరోమేనియా అని నవ్వాడు కొడుకు. తండ్రిని దగ్గరగా తీసుకున్నాడు.

నవ్య

# తీన్ మార్














## సరదాగా....

### ప్రేమగా

నందిత్ గుడికెళ్ళాడు. అక్కడ కాసేపు మంటపంలో స్వామీజీ చెబుతున్న ప్రవచనం విని ఇంటికి తిరిగొచ్చాడు. రావడం రావడం గబగబా కిచెన్‌లోకి వెళ్ళి భార్య చెంప పగిలి పోయేటట్టు ఫెళ్ళున ఒక్క లెంపకాయ వేశాడు.

అదిరిపడి ఏడుస్తూ వెనక్కి తిరిగిన భార్యతో, "మనం ఎవరినయితే గాఢంగా, ఎక్కువగా ప్రేమిస్తామో వాళ్ళనే కొట్టబుద్ధే స్తుందంట తెలుసా! స్వామీజీ చెప్పారు" అన్నాడు.

వెంటనే అతడి భార్య నందిత్ రెండు చెంపలూ వాయించి, మొట్టికాయలు వేసి, వంగబెట్టి నాలుగు గుద్దులు వేసేసి ఉతికి ఆరేసింది. "అసలు నా గురించి మీరేమనుకుం టున్నారు? నేనేమన్నా మిమ్మల్ని తక్కువ ప్రేమిస్తున్నానని మీ ఉద్దేశమా! నాకూ మీరంటే చాలా చాలా ఎక్కువెక్కువ ప్రేమ" అంది.

### ఒక ప్రశ్న?

నెహ్రూ టీమ్, గాంధీ టీమ్, పటేల్ టీమ్... పోటాపోటీగా పాయింట్లు స్కోర్ చేసి, 'చిచ్చరపిడుగులు' ప్రోగ్రామ్‌లో ఫైనల్స్‌కు చేరుకున్నాయి. జరుగుతున్నది లైవ్ ప్రోగ్రామ్. ఒక్కో టీమ్‌లో ముగ్గురు చొప్పున ఉన్నారు పిల్లలు. అందరూ పదకొండు, పన్నెండేళ్ళవాళ్లే! యాంకర్ ప్రశ్నల మీద ప్రశ్నలు ఒకదాని తరువాత ఒకటి సంధిస్తు న్నాడు. పిల్లలు బజర్ నొక్కుతూ, తమకు తెలిసిన సమాధానాలు చెబుతున్నారు. ఒక సారి ఒక టీమ్‌ది పైచేయి అయితే, ఇంకో సారి ఇంకో టీమ్‌ది పైచేయిగా నిలుస్తోంది. ఆఖరి రౌండ్‌లో ఆఖరి ప్రశ్నకి చేరుకునేసరికి మూడు టీమ్‌లూ సమాన పాయింట్లతో ఉన్నాయి. ఆ ఆఖరి ప్రశ్నకు సరయిన సమా ధానం చెప్పిన టీమే విజేతగా నిలుస్తుంది. దీంతో అందరిలోనూ ఉత్కంఠ నెలకొంది. చివరి ప్రశ్న కోసం అందరూ ఎదురు చూస్తు న్నారు. యాంకర్ ప్రశ్న అడగనే అడిగాడు. "నంబర్ 2ని చూడగానే మనం దాన్ని 10 అని ఎప్పుడు పిలుస్తాం?" నెహ్రూ టీమ్ వెంటనే బజర్ ప్రెస్ చేసి సరైన సమాధానం చెప్పి, విజేతగా నిలిచింది. ఇంతకీ వాళ్ళు చెప్పిన సమాధానం ఏమిటి? మరి మీరూ చెప్పగలరేమో చూడండి.

**సమాధానం**

క్లాక్‌లో! గడియారంలో నిమిషాల ముల్లు 2 మీదకొచ్చినప్పుడు, దాన్ని 10గా చెబుతాము.

చైత్రమాసం ప్రకృతిలో వసంతం వెల్లివిరుస్తుంది. చెట్లు చిగురిస్తాయి. పచ్చని ఆకులు నేత్రపర్వం చేస్తాయి. కోకిలలు వీనుల విందుగా కూస్తాయి. ప్రకృతిలో కొత్తదనం పరచుకుంటుంది . అంతటా నవవికాసం ఆవిష్కృతమవుతుంది.. మానవజీవితంలో నిత్య వసంతానికి అది ఓ సంకేతమే ! మనిషి గుణసంపద, యోగ్యతలకు చెట్టు చిగురు సంకేతమైతే, కాయలు వ్యక్తి ఎదుగుదలకు, పండ్లు అను భూతులకు , కోకిల కూతలు మంగళధ్వనులకు సంకేతాలు. కనుక మానవ జీవనం ప్రతి నిత్యం వసంతమే!

# నవ్య ఉగాదికి స్వాగతం

చైత్రమాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమే హని
శుక్లపక్షే సమగ్రంతు తథా సూర్యోదయే సతి
వత్సరాదౌ వసంతా రపి రాజ్యే తద్దైవచ
ప్రవర్తయామాస తదా కాల సగణనామపి
గ్రహన్నాగే నృతూన్మాసానేవత్సరాన్వత్యరాధిపాన్.

బ్రహ్మకల్పం ప్రారంభమైన మొదటి ఉగాది ప్రభవ. మొదటి ఋతువు వసంతం. మొదటి నెల చైత్రం. మొదటి తిథి పాడ్యమి. మొదటి వారం ఆది వారం. ఆ వేళ సృష్టి ప్రారంభమైందనీ, ప్రభవించిందనీ అర్థం. అందుకే తెలుగు సంవత్సరాలలో మొదటిది ప్రభవ. చివరిది క్షయ. నాశనమైందని. అంటే ఈ బ్రహ్మకల్పం అంతమయ్యే సంవత్సరం అన్నమాట. అందువల్ల చైత్రమాసం శుక్లపక్షంలో సూర్యోదయవేళకు పాడ్యమి తిథి ఉన్న రోజును ఉగాదిగా నిర్ణయిస్తారు. నిర్ణయ సింధుకారుడు కూడా అదే చెప్పాడు.

ఉగస్య ఆదిః ఉగాదిః అంటారు. ఉగ అంటే నక్షత్ర గమనం. దీనికి ప్రారంభమే ఉగాది అని అర్థం. బ్రహ్మకు పగలు అంటే మనుషుల లెక్కల ప్రకారం 432,00,00,000 సంవత్సరాలు. రాత్రికూడా అంతే. అంటే బ్రహ్మకు ఒకరోజు 864,00,00,000 సంవత్సరాలన్నమాట. ఇలాంటివి 360 రోజులు పూర్తి చేస్తే ఆయనకు ఒక సంవత్సరం. అంటే మూడు లక్షల 11 వేల 40 కోట్ల సంవత్సరాలన్న మాట. ఇలా వందేళ్ళు బ్రహ్మ ఆయుర్దాయం.

ఇప్పటివరకు ఆరుగురు బ్రహ్మలు సృష్టికార్యాలు ముగించారు. ఏడవ బ్రహ్మ ఇప్పుడు ద్వితీయ పరార్థంలో ఉన్నాడు. ఉగాదినాడే బ్రహ్మ సృష్టిని ప్రారంభించాడని అంటారు. మహావిష్ణువు మత్స్యావతారము ధరించి సోమకుడిని సంహరించి, వేదాలు రక్షించి బ్రహ్మకు అప్పగించిన రోజు కూడా ఇదే నని ప్రతీతి. యుగం అంటే జంట అనే అర్థం కూడా ఉంది. ఉత్తరాయణం, దక్షిణాయణం అనే జంట ఆయనాలతో కూడిన యుగ ప్రారంభానికి ఇది తొలి రోజు కనుక దీనిని ఉగాది అన్నారు. సృష్టి ఆరంభంలో చైత్రశుద్ధ పాడ్యమినాడు (ఉగాది) లంకానగరంలో తొలి సూర్యోదయం జరిగిందని, భాస్కరాచార్యుడు సిద్ధాంత శిరోమణి'లో ప్రస్తావించాడు. విక్రమాదిత్యుడు, శాలివాహనుడు పట్టాభిషిక్తులైన రోజుకూడా ఉగాదే. వరాహమిహిరుడు పంచాంగాన్ని జాతికి అంకితం చేసిందీ ఉగాది నాడే.

భారతీయతకు మూలం వేదం. వేదంలో చెప్పబడ్డ మధు, మాధవ మాసములు జ్యోతిషశాస్త్రం ప్రకారం చైత్ర, వైశాఖ మాసాలుగా నిర్ధారించారు. చిత్తా నక్షత్రంతో సంబంధమున్నది చైత్రమాసం. జగత్కళ్యాణదాయకం అయిన శ్రీరామ పట్టాభిషేకానికి వసంత సమయమే సముచితమని భావించి వశిష్ఠాది మహర్షులు శ్రీ రామావతారానికి ప్రేరణగా నిలిచారు. ద్వాపరయుగం ముగిసిన తరువాత విధాత కలియుగాన్ని ఈరోజే ప్రారంభించాడన్నది పురాణ కథనం. మహాభారత కాలంనుంచీ ఉగాది పర్వాన్ని నిర్వహించుకోవడం ఆనవాయితీగా వస్తోంది. ఇన్ని విశేషాలున్న పర్వదినం కాబట్టే ఉగాది మనకు పండుగ రోజు అయింది.

### కాలాన్ని ఆరాధించడం

మన హిందూ సంప్రదాయంలో పండుగలు ఒక ప్రత్యేక దైవారాధనతో జరుపుకోవడం మన ఆచారం. కానీ ఉగాది ఏ దైవారాధనకూ సంబంధించినది కాదు. కాలాన్ని ఆరాధించే పండుగ. ఇందులోనూ అంతర్లీనంగా దైవచింతన ఉంది. "కాలః కాలయతా మహం" అన్నాడు శ్రీకృష్ణుడు. కంటికి కనిపించని ఆ కాల స్వరూపం నేనే అంటాడు గీతాచార్యుడు. అందుకే ఉగాది రోజు విష్ణు సంకీర్తనం, విష్ణు సహస్రనామ పారాయణం చేయడం శుభప్రదం. ఈరోజున బ్రహ్మ సృష్టి చేశాడు కనుక బ్రహ్మను కూడా పూజించాలి.

'తైలాభ్యంగం, సంకల్పాదవు, నూతనవత్సర నామకీర్త నాద్యారంభం...

ప్రతిగృహం ధ్వజారోహణం, నింబపత్రాశనం, వత్సరాది ఫలశ్రవణం.'

తైలాభ్యంగనం, నూతన సంవత్సర సంకల్పం, దేవుని నామకీర్తనం, ధ్వజారోహణం (పూర్ణకుంభ



దానం), ఉగాదిపచ్చడి తినడం, పంచాంగ శ్రవణం ఇవి ఉగాదిరోజు తప్పనిసరిగా చేయాల్సిన పనులు.

ఉగాది పండుగనాడు వేకువ జామునే నిద్రలేచి అభ్యంగనం చేసి నూతన వస్త్రాలు ధరించి , ఇంటికి మామిడాకుల తోరణాలతో అలంకరించి, ఇష్టదేవతారాధన పూర్తి చేయాలి. అనంతరం బంధుమిత్రులతో కలిసి, మృష్టాన్న భోజనాలు చేయడం సంప్రదాయం. ఉగాది నూతనత్వానికి మారుపేరు కనుక ఈరోజున కొత్త నిర్ణయాలు తీసుకోవడం, ఆయా కార్యాలకు శుభారంభం చేయడం ఉగాది ప్రత్యేకత.

### ధర్మకుంభదానం

ఉగాదినాడు ప్రతీ గృహమందు ధ్వజారోహణం చేయాలి. ఒక నూతన కలశాన్ని వేపాకులతో అలంకరించి, అందు పంచపల్లవములు అనగా మామిడి, అశోక, నేరేడు, మోదుగ, వేపచిగుళ్ళు వేసి ఆ కలశాన్ని శుద్ధ జలంతో నింపి, ఆ జలములో సుగంధచందనాదులు, పుష్పాక్షతలు వేసి ఆ కలశానికి నూతన వస్త్రం చుట్టి, పసుపు, కుంకుమ, చందనం దారాలతో అలంకరించి కలశం పైన ఒక కొబ్బరిబొండాన్ని ఉంచి, ఇష్టదేవతను ఆవాహన చేసి, పుణ్యమంత్రాలతో, షోడశోపచారాలతో అర్చించి, ఉగాది పచ్చడిని నివేదన చేసి, ఆ కలశాన్ని కులగురువుకుగానీ, పురోహితుడికిగానీ దానమిచ్చి వారిని నూతన వస్త్రాలతో, దక్షిణలతో సత్కరించి, వారి ఆశీస్సులు పొందాలి. దీనినే 'ధర్మకుంభదానం' అంటారు.

### ఉగాది పచ్చడి

మానవ జీవితం అనేక రుచుల కలయిక. అన్నిరుచులూ కలిస్తేనే మనిషి శరీరం సమగ్ర వికాసాన్ని అందుకుంటుంది. మనస్సు విశ్వతోముఖంగా విరాజిల్లుతుంది. అందుకే ఉగాదినాడు ఆరు రుచుల పచ్చడిని ప్రసాదంగా ఆరగిస్తారు. మధురానుభూతుల తీపి, కష్టాల చేదు, సమస్యలతో మింగుడుపడని కారం, బాధల ఉప్పు, కడగండ్ల పులుపు, అపజయాల వగరు మానవ జీవితంలో సహజ రుచులే. వీటిని సమన్వయం చేసుకుని అన్నిటినీ సమపాళ్ళలో రంగరించుకొని ప్రయాణించడమే జీవనం. ఆశలు చిగురుల వంటివి. అవి ఎప్పుడూ వికసిస్తూ ఉండాలని కోరుకోవడమే జీవన వసంతం. ఎల్లప్పుడూ మంగళధ్వనులే వినాలనే తపనకు ప్రతిరూపమే కోకిలకూత. ఇలా ఉగాది పండుగ మనిషి బ్రతుకులో కీలకంగానూ, మూలకంగానూ ఆవిర్భవించింది. నూతన సంవత్సరంనాడు ఎవరైతే నింబ కుసుమ భక్షణం చేస్తారో వారికి సంవత్సరమంతా ఆయురారోగ్యాలు, ఐశ్వర్యాలు, అదృష్టం వరిస్తుందని శాస్త్ర వచనం

**శతాయు వజ్రదేహాయ సర్వసంపత్ కరాయచ**
**సర్వారిష్ట వినాశాయ నింబకం దళబకణం**

అనే శ్లోకం చెప్పుకుంటూ పవిత్రమైన ఉగాది పచ్చడి స్వీకరించాలి. ఈ సమయంలో ప్రకృతి అప్పుడే చలికాలం నుంచి ఎండాకాలంలోకి మారుతుంది కాబట్టి వాతావరణ మార్పులకి కఫ దోషాలు ఇతర ఆరోగ్య సమస్యలు రాకుండా ఈ పచ్చడి ఎంతో ఉపయోగపడుతుంది. ఉగాదిరోజు నుంచి శ్రీరామ నవమిరోజు వరకు ఈ పచ్చడి తీసుకుంటే ఆరోగ్యానికి ఎంతో మంచిదని పెద్దలు చెపుతున్నారు.

### పంచాంగ శ్రవణం ఎందుకు?

అభ్యంగన స్నానం చేసి పచ్చడి తిన్న తర్వాత ఉగాదినాడు ఆచరించే మరొక కార్యక్రమం పంచాంగ శ్రవణం. పంచాంగం అంటే ఐదు అంగములతో కూడుకున్నది. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణము. ఇవి, మనకు దీర్ఘాయుర్దాయాన్నివ్వడానికి, ఎటువంటి అకాల మృత్యువు దాపురించకుండా ఉండటానికి, ఈ ఐదింటిని ప్రతిరోజు ప్రతివారు చూడాలని అంటారు. అందువల్లనే ఉగాదినాడు సాయంత్ర వేళలో ఈ ఐదింటి సమన్వయమైన పంచాంగం వినడం ఆనవాయితీ. ఉత్తర ముఖంగా కూర్చుని పంచాంగం వినాలని శాస్త్రం చెబుతుంది. పంచాంగ శ్రవణం ఎంతటి భాగ్యం ప్రసాదిస్తుందో తెలుపుతోంది ఈ ప్రాచీన శ్లోకం.

**'శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్న దోషాపహం**
**గంగాస్నాన విశేష పుణ్యఫలదం గోదాన తుల్యం నృణామ్**
**ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం**
**నానాకర్మ సుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్'**

"ఓ మానవులారా! పంచాంగం సిరిసంపదలను ప్రసాదిస్తుంది. సకల మంగళాలనూ ప్రసాదిస్తుంది. ఎన్నో గుణాలను అందిస్తుంది. శత్రువులను దూరం చేస్తుంది. పీడకలలు రాకుండా చేస్తుంది. దోషాలను తగ్గిస్తుంది. గంగాది పుణ్య నదులలో స్నానమాచరించిన ఫలితం ప్రాప్తిస్తుంది. గోదాన పుణ్యం ప్రసాదిస్తుంది. ఆయుష్షును పెంచుతుంది. ఉత్తమ జీవన మార్గాన్ని సూచిస్తుంది. అనేక శుభాలు అందిస్తుంది. చక్కని సంతానాన్ని అందిస్తుంది. ప్రతి పనిలోనూ విజయం చేకూర్చడం ద్వారా అనేక ఫలితాలను అందిస్తుంది. కనుక పంచాంగాన్ని వినడం, చదవడం మనిషికి సముచితం. పంచాంగాన్ని తప్పక వినండి" అనేదే ఈ శ్లోక భావం. అందుకే ఈ రోజు పంచాగ శ్రవణంలో చెప్పే గోచార ఫలితాలు తప్పక తెలుసుకుంటారు. సంవత్సర ఫలితాలన్నిటినీ వింటారు. పంచాంగ శ్రవణ సమయంలో నవగ్రహాలను స్మరించడం ద్వారా ఆయా గ్రహాల కటాక్షం లభిస్తుంది.

**– బ్రహ్మశ్రీ అవధూత శర్మ**





## నవరాత్రులు

ఉగాది నుంచి తొమ్మిది రోజులుపాటు నవరాత్రులు జరుగుతాయి. వీటిని వసంత నవరాత్రులు, రామ నవరాత్రులు అంటారు. ఆరు ఋతువులతో పాటు మూడు గుణాలు కలిపి నవరాత్రులంటారు. ఈ నవరాత్రులలో శ్రీరాముడిని, అమ్మవారిని పూజిస్తారు. తొమ్మిదిరోజుల వరకు శ్రీరామార్చన, రామాయణ పారాయణం చేసి నవమి రోజున శ్రీరామ కల్యాణం జరుపుతారు. అదేవిధంగా రుతు సంధిషు వ్యాధిర్జాయతే.. అని ఆయుర్వేద గ్రంథాలు చెబుతున్నాయి. ముఖ్యంగా వసంత, శరత్ ఋతువులు యమ దంష్ట్రలని దేవీ భాగవతం వంటి పురాణాలు చెప్తున్నాయి. అందుకే శారీరక, మానసిక ఆరోగ్యాల కోసం ఆహార, విహార నియమాలు ఏర్పాటు చేశారు. శిశిరం వెళ్లి వసంతం వచ్చే సమయంలో ప్రకృతిలో చాలా మార్పులు వస్తాయి. వాటికి అనుగుణంగా ఉగాది నుంచి వసంత నవరాత్రి ఉత్సవాలు అందుకే జరుపుకుంటారు.

## చలివేంద్రం ప్రారంభం

ఉగాది రోజు ఉదయాన్నే తలస్నానం. దేవతారాధన, ఉగాది పచ్చడి స్వీకరించడం, పంచాగ శ్రవణంతో పాటు మనకు వీలైతే చేయవలసిన మహత్కార్యం మరోటి ఉంది. అదే ప్రపాదానం. అంటే చలివేంద్రం ఏర్పాటు చేయడం. ఇంటిముందుగానీ, వీధిలో గానీ చలివేంద్రం స్థాపించి బాటసారులకు చల్లని నీరు అందిస్తే ఎంతో గొప్ప పుణ్యం లభిస్తుంది. శుచిగా ఉన్న చోట, అలికి ముగ్గుపెట్టి కొత్త కుండలలో నీరు నింపి గణపతిని, ఇతర దేవతలను స్మరించి, కొబ్బరికాయ కొట్టి చలివేంద్రం ప్రారంభించాలి. ఈరోజున పితృదేవతలకు తర్పణలు కూడా ఇవ్వవచ్చు. ఇవి ఉగాది పండుగనాడు ధర్మశాస్త్రం చెప్పిన ఆచారాలు.










# మీ లావాదేవీలు V-NET ద్వారా బలోపేతం చేయండి.






మీ మొబైల్ నుండే బ్యాంకింగ్
ఎప్పుడైనా, ఎక్కడైనా

# V- మొబైల్

మీ మొబైల్ నుండే బ్యాంకింగ్ ఎప్పుడైనా, ఎక్కడైనా

బిల్లు చెల్లింపు • ఎయిర్‌లైన్/మూవీ టికెటింగ్
• ఇమిడియేట్ ఫండ్ ట్రాన్స్‌ఫర్
• మొబైల్ రీచార్జ్ • బ్యాలెన్స్ ఎంక్వైరీ
• మినీ స్టేట్‌మెంట్

• మొబైల్ బ్యాంకింగ్ కొరకు నేడే నమోదు చేసుకోండి.

• ప్రతి రోజూ 3,000+కు పైగా ఖాతాదారులు రిజిస్టర్ అవుతున్నారు

## మీ సొంత ఇంటి స్వప్నాన్ని సాకారం చేసుకోండి

విజయ గృహ రుణ ఖాతాదారులకు 100% రుణం

విశిష్టతలు:

- కొనుగోలు / నిర్మాణం/ పునర్ నిర్మాణం/ఫ్లాట్
- ఇతర బ్యాంకులు/గృహ నిర్మాణ ఆర్థిక సంస్థల నుంచి గృహ రుణాల టేకోవర్
- స్థలం కొనుగోలుకు/ అందులో గృహ నిర్మాణం
- దరఖాస్తుదారు సగటు స్థూల ఆదాయంపై 75నెలల వరకు రుణం
- రుణం తిరిగి చెల్లింపు : అప్పుదారు వయసు 75 సంవత్సరాల వరకు లేదా 30 ఏళ్ల వరకు ఏది తక్కువైతే



## సులభ రుణంతో యజమానిగా గర్వపడండి! విజయ బ్యాంక్ కారు రుణం




- కొత్త లేదా ఉపయోగించిన కారు కొనుగోలు
- 21 సం॥ నుంచి 70 సం॥ల వరకు వృత్తి నిపుణులు, జీతాలు పొందేవారు మరియు పింఛన్‌దారులకు ఉపయుక్తం
- కొత్త వాహనం ధరలో 85% మరియు పాత వాహనం మార్కెట్ విలువలో 70%
- పోటీతో కూడిన వడ్డీరేటు
- కొత్త వాహనాలకు 15%, పాత వాహనాల విలువలో 30% మార్జిన్ చెల్లించాలి.
- 84 నెలల వరకు రుణం తిరిగి చెల్లింపు

షరతులు వర్తిస్తాయి.

**విజయ బ్యాంక్ మరియు**
మీరు 24x7 అనుసంధానమై ఉండండి...
మాకు హలో చెప్పండి.

మా బ్యాంకు ఏటీఎంల్లో ఏ బ్యాంకు వినియోగదారుడైనా నిర్వహించే ప్రతి లావాదేవీకు విజయ బ్యాంకు 0.50 పైసలను సామాజిక కార్యక్రమాలకు విరాళంగా అందిస్తుంది.

మీ సమీపంలోని శాఖను నేడే సంప్రదించండి.





Toll Free No.1800 425 5885 | Growth by Technology ,Driven by Customers | www.vijayabank.com

# కథల పోటీ ఫలితాలు

నవ్యవీక్లి–ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్తంగా నిర్వహించిన కథల పోటీకి 927 కథలు వచ్చాయి. వర్ధమాన రచయితలతో పాటు లబ్ధప్రతిష్ఠులైన రచయితలు కూడా ఈ పోటీలో ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ కథలన్నిటినీ నవ్య సంపాదకవర్గంతో పాటు ముగ్గురు ప్రముఖ రచయితలు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి చదివారు. బహుమతికథలను ఎంపిక చేశారు. బహుమతి కథలతో పాటు సాధారణ ప్రచురణకు 109 కథలు ఎంపిక చేశారు. ఈ కథలన్నీ వీలువెంబడి నవ్యవీక్లిలో ప్రచురిస్తాం. ఈ కథల ప్రచురణ విషయమై ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు. పోటీలో విజేతలైన రచయితలకు అభినందనలు. పోటీలో పాల్గొన్న వారందరికీ ధన్యవాదాలు.

–సంపాదకుడు

## ప్రథమ బహుమతి రూ.10,000/– పొందిన కథ

ఎథిక్స్ – డా.నక్కా విజయరామరాజు

## ద్వితీయ బహుమతి రూ.8,000/– పొందిన కథ

టూ గ్రేటర్ దాన్ వన్ – పెద్దింటి అశోక్‌కుమార్

## తృతీయ బహుమతి రూ.7,000/– పొందిన కథ

వెన్నెలత్రోవ – కన్నెగంటి అనసూయ

## విశేష బహుమతి రూ. 5,000 పొందిన కథలు

1. పయనించే ఓ చిలుకా – శ్రీధర
2. హర్షఋతువు – సింహప్రసాద్
3. బందరిల్లు – 'మానస'
4. మనిషి–పశువు – సరసి
5. నిర్గుణుడు – డా. యండమూరి సత్యకమలేంద్రనాథ్
6. ఎవరు దేవుడు – జియో లక్ష్మణ్
7. పెళ్ళి – రావులపాటి వెంకట రామారావు

# సాధారణ ప్రచురణ కథలు

1. గీటురాళ్ళు – సింహప్రసాద్
2. కాటు – సింహప్రసాద్
3. కొమ్ములు జాగ్రత్త – సింహప్రసాద్
4. అనుబంధం – మణి వడ్లమాని
5. సింబల్ ఆఫ్ ఎథిక్ – దూసి శ్రీరామమూర్తి
6. అంతిమ సంస్కారం – శ్రీకంఠస్ఫూర్తి
7. ఇష్టం – మెట్టు మురళీధర్
8. నిజానికీ అబద్ధానికీ మధ్య– శీలా సుభద్రాదేవి
9. తైలబంధం – భమిడి వెంకటేశ్వర్లు
10. దొరుకునా ఇటువంటి సేవ– పోట్లూరు సుబ్రహ్మణ్యం
11. శునక సాహసం – పోట్లూరు సుబ్రహ్మణ్యం
12. శివుడు – గంధం యాజ్ఞవల్క్యశర్మ
13. కావలసిన వాడు – ప్రఫుల్లచంద్ర
14. పిచ్చిదేవుడు – ప్రఫుల్లచంద్ర
15. అంతర్మథనం – మల్లాది మంజుల
16. అసలే ఆదివారం – మల్లాది మంజుల
17. ఆసరా – సర్వజిత్
18. ప్రైవసీ – సర్వజిత్
19. సందుగుపెట్టె – వి.వి.అనురాధ
20. ఎన్‌కౌంటర్ – శరత్‌చంద్ర
21. శిఖరం – శరత్‌చంద్ర
22. ముద్దు – ఇందూ రమణ
23. అర్జునుడు – అంగర వెంకట శివప్రసాదరావు
24. ఆమె కథ – అంగర వెంకట శివప్రసాదరావు
25. సమాంతరాలు – తటవర్తి నాగేశ్వరి
26. ఋణానుబంధం – తటవర్తి నాగేశ్వరి
27. మరణం బతికింది – వేంపల్లి సికిందర్
28. నిదురించనితోట – వడలి రాధాకృష్ణ
29. చీకటి చిక్కబడింది – వడలి రాధాకృష్ణ
30. అదృష్టం – వాలి హిరణ్మయీదేవి
31. చీమకుట్టింది – వాలి హిరణ్మయీదేవి
32. ఈ జీవన తరంగాలలో – వాలి హిరణ్మయీదేవి
33. ఓ సీత కథ – వి.వి. సుబ్బలక్ష్మి కృష్ణకుమారి
34. అంటరానివాడు – ఆదోని బాషా
35. ఓ ఆత్మకథ – ఎలక్ట్రాన్
36. ప్రయాణం – వి.సి.ఎస్.ఎస్.వి.శ్రీనివాసు
37. పొలంగట్టు – అలపర్తి రామకృష్ణ
38. దేశభక్తుడు – పెయ్యేటి శ్రీదేవి
39. వాలే పొద్దులో వర్ణాలు – జాస్తి రమాదేవి
40. న అహం కర్తా – రాంపల్లి పద్మజారాణి
41. ఖాళీ ఇల్లు లేదు – డా. అయ్యగారి సీతారత్నం
42. అడవి తల్లి – సి.ఉమాదేవి
43. పరిమళించిన మానవత్వం– కె.జె.ఎస్.రామారెడ్డి
44. అరుగు – పోలాప్రగడ జనార్దన రావు (జెన్ని)
45. చెట్టు–వేరు – శ్రీమతి పి.వి.శేషారత్నం
46. పోరాటం – శ్రీమతి పి.వి.శేషారత్నం
47. భూగృహం – జియో లక్ష్మణ్
48. జీవనరాగం – ఇంద్రగంటి నరసింహమూర్తి
49. సిరి 'తా' వచ్చిన – విద్యాధర్ మునిపల్లె
50. జెండా – ఎం. వెంకటేశ్వరరావు
51. సరస్వతీ నమస్తుభ్యమ్ – ఎం. వెంకటేశ్వరరావు
52. రుణబాంధవ్యాలు – ఎ.వి.రెడ్డి శాస్త్రి
53. నిశ్చితార్థం – విరించి
54. అడ్డదారి – గంటి రమాదేవి
55. మట్టిలో మట్టయి పోవాలని – టి.ఎస్.ఎ.కృష్ణమూర్తి
56. బాపు బొమ్మ – మంత్రవాది మహేశ్వర్
57. ఇక్కడ నవ్వితేనే కన్నీళ్ళు – ఎం.సుగుణరావు
58. కాలం మారిన ఋతువులు– ఎస్.ఘటికాచలరావు
59. భూమి గుండ్రంగా లేదు– గంటి భానుమతి
60. మరణ గౌరవం – డా. సి.భవానీదేవి
61. నేను తాతయ్య – అభిమన్యు
62.. అద్దాల జైలు – పి.వి.డి.ఎస్.ప్రకాష్
63. బిచ్చగాడు – చొప్పదండి సుధాకర్
64. పారిపోకు పారిపోకు – శ్రీ ఉదయిని
65. జీవితం జీవించడానికే – డా. తంగిరాల మీరా సుబ్రహ్మణ్యం
66. ససెప్టబుల్ – సన్నిహిత్
67. దాడి – గోగినేని మణి
68. ఇరుకు – గొల్లపూడి బాల సుబ్రహ్మణ్యం
69. నేనెందుకు చచ్చిపోవాలి నాన్నా – శీరం నారాయణస్వామి
70. నిర్లక్ష్యం – వి.రాజారామమోహనరావు
71. గవాక్షం – తులసి బాలకృష్ణ
72. అసామాన్యుడు – అనామకుడు
73. అమ్మకావాలి – సోమవఝుల నాగేంద్రప్రసాద్
74. వాత్సల్యం – సోమవఝుల నాగేంద్రప్రసాద్
75. నిమజ్జనం – సోమవఝుల నాగేంద్రప్రసాద్
76. పరిహసించకు చెల్లెలా...! – చెన్నూరి సుదర్శన్
77. ఆ రాత్రి – బొడ్డేడ బలరామస్వామి
78. రివర్స్‌గేర్ – శైలజామిత్ర
79. పాశం – కె.వాసవదత్త రమణ
80. స్నేహబంధమూ– ఎంత మధురమూ – గొల్లపూడి రాజ్యలక్ష్మి
81. ముఖాముఖి – గొల్లపూడి రాజ్యలక్ష్మి
82. వెలుగు చుక్కాని – యలమర్తి అనురాధ
83. డామిట్ కథ అడ్డం తిరిగింది– రాచపూటి రమేష్
84. మలుపు – నిశాపతి
85. పసిడిబాటలు – కె.కె.రఘునందన
86. గోదావరి నవ్వింది – దాట్ల దేవదానం రాజు
87. అంతిమతీర్పు – తుల్లి రాజగోపాల్
88. పునర్జన్మ – ఎల్.ఆర్.స్వామి
89. పెద్ద(ల) కష్టం కాదు – పెనుమాక నాగేశ్వరరావు
90. నాన్నకి ముద్దు – గోనె రమాదేవి
91. నా కంటి నీటి ముత్యమా– సమ్మెట ఉమాదేవి
92. ఆడమనసు – పి.ఎస్.నారాయణ
93. వేలిముద్ర – రసరాజు
94. వెండిపట్టీలు – డి.వి.రమణి
95. అనురాగపు స్పర్శ – షేక్ అహమద్‌బాష
96. తృణప్రాయం – షేక్ అహమద్‌బాష
97. అంత్యక్రియలు – ఇంద్రగంటి జానకీబాల
98. ఈ దేశానికి మేమేమిచ్చాం– మల్లాది రవిశంకర్
99. ఎఱ్రబస్సూ–ఎయిరో ప్లేనూ– జి.ఎస్.లక్ష్మి
100. ధర్మాచరణ – డా. శ్రీమతి కొఠారి వాణీచలపతిరావు
101. ఇది జీవితం – డా. శ్రీమతి కొఠారి వాణీచలపతిరావు
102. కాలంతో కదలాలి – డి.కామేశ్వరి
103. ధర్మశాసనం – వి.యస్.పి.తెన్నేటి
104. మళ్ళీపెళ్ళి – వాణిశ్రీ
105 ఆడపిల్ల – వాణిశ్రీ
106. శేషం – సి.యమున
107. ఫొటో – ఈతకోట సుబ్బారావు
108. డొనేషన్ – శింగరాజు శ్రీనివాసరావు
109. ఇల్లు అమ్మబడును – డా. జడా సుబ్బారావు

ఉగాది ప్రత్యేకం




తెలుగుభాషకి జై... అంటూ దుర్ముఖి నామ
సంవత్సరం వెళ్ళిపోయింది.
వసంతాన్ని వెంటేసుకుని 'హేవళంబి' ఉగాది వచ్చింది.
ఆనందంతో పులకరించిపోయింది కోయిల.
అంతలోనే ఏ భాషలో కూయాలా.. అని ఆలో
చనలో పడింది.
తెలుగులో కూయి.. అన్నాను నేను
మందలింపుగా
నువ్వా నాకు చెప్పేది. అన్నట్లు నీచంగా చూసింది...
తెలుగు కనబడకూడదు... తెలుగు వినబడ
కూడదు అంటాయి

## కూయనన్న కోయిల



మీ కార్పొరేట్ (ఇంగ్లీషు)
చదువులు
అయినా
పట్టనట్టుంటాయి
ప్రభుత్వాలు.
ఆంగ్లమే ముద్దు
అంటాయి పేరెంట్
గంగిరెద్దులు
రెండో క్లాసు వరకూ
తెలుగుచాలంటాడు
ఒకడు.
ఇంటరువరకు ఉంటే
ఇరుక్కుపోతారు అంటాడు
ఒక మూర్ఖుడు
శ్వాసించాల్సిన 'అమ్మ' భాషకి ఇన్ని కొలతలా?
'ఏ మొఖం పెట్టుకొని నన్ను తెలుగులో కూయమని
అడుగుతున్నావు.. అని కడిగి పారేసింది.
తెలుగు భాషకోసం సభలూ... సమావేశాలూ
అట్టహాసంగా
పెడుతున్నాంగా... అన్నాను నేను
నన్నాయి నొక్కులు నొక్కుతూ...
చాచికొట్టినట్టు సమాధానం చెప్తూ.
సభలు పెట్టి ఏం సాధించారు.
సభలూ సమావేశాలతో భాష బతకదు...
నిజంగా భాష మీద ప్రేమ ఉంటే నిజాయితీతో
నిబద్ధతతో ప్రశ్నించాలి.
ఈ దుస్థితికి కారణం ఎవరైనా నిలదీయాలి.
నిగ్గుతేల్చి భాషను బతికించుకోవాలి.
మన హక్కు సాధించుకోవాలి.
ఆ మంచి రోజు వచ్చేవరకూ నేను ఇంగ్లీషులోనే
కూస్తాను అని.
'Kuhoo... Kuhoo'.. అని ఇంగ్లీషులో కూస్తూ
ఎగిరి పోయింది.
సిగ్గుతో చచ్చి, తెలుగుభాష ఉగాదికోసం ఆశగా
ఎదురుచూస్తూ నిలబడిపోయాను నేను.

–నడిమింటి నరసింగరావు
సెల్: 81258 73139

# శ్రీ హేవళంబినామ సంవత్సర రాశిఫలాలు

(పుట్టిన నక్షత్రం ఆధారంగా)



## మేషం

**(అశ్విని, భరణి కృత్తిక 1 పాదం)**

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో మేషరాశి వారు వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పెద్దలు, ప్రముఖులతో పరిచయాలు ఏర్పడ



*ఆదాయం: 8* *రాజపూజ్యం: 4*
*వ్యయం: 14* *అవమానం: 3*

తాయి. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. శత్రువులపై విజయం సాధిస్తారు. ఆరోగ్యం మెరుగుపడుతుంది. స్టాక్ మార్కెట్ లావాదేవీలు అనుకూలిస్తాయి. ఆస్తులు పెంపొందించుకుంటారు. గురువు వక్రగమనంలో ఉన్న ఏప్రిల్, జూన్ మాసాల మధ్య ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. పట్టుదలతో కృషి చేసినప్పుడే ఉన్నత చదువుల్లో లక్ష్యాలు సాధించగలుగుతారు.

ఈ ఏడాది 6, 7 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా వ్యవసాయం, పరిశ్రమల రంగాల వారికి అనుకూలం. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాల్లో కొన్ని ఆటంకాలు ఎదురైనా మొత్తం మీద పురోగతి కనిపిస్తుంది. ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలతో చేసే ప్రయత్నాలు జయప్రదం అవుతాయి. హోటల్, ఆహార ఉత్పత్తులు, ఔషధాలు, ఆస్పత్రులు, కేటరింగ్, నిత్యావసరాల రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. సెప్టెంబర్ ద్వితీయార్థం నుంచి ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. ఉమ్మడి వ్యాపారం లాభిస్తుంది. కుటుంబ సమస్యలు పరిష్కారమవుతాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు ప్రత్యర్థుల నుంచి, వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. స్నేహ, బాంధవ్యాల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలి.

ఈ ఏడాది 8, 9 స్థానాల్లో శని సంచారం జరుగుతుంది. ఫలితంగా ప్రమోషన్లు అందుకుంటారు. ఆస్తులు పెంపొందించుకుంటారు. ఇల్లు కొనుగోలు కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రమోషన్లు అందుకుంటారు. సమాజంలో పేరు ప్రతిష్ఠలు సాధిస్తారు. శని వక్రగమనంలో ఉండే ఏప్రిల్ 7-ఆగస్టు 26 తేదీల మధ్య స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. ఆరోగ్యం మందగిస్తుంది. క్రయవిక్రయాల్లో నిదానం అవసరం. కొత్త వ్యాపారాల ప్రారంభానికి తగిన సమయం కాదు. ఎవరినైనా నమ్మి డబ్బు ఇస్తే అది తిరిగి వచ్చే అవకాశాలు తక్కువ. పైచదువులకు ఆటంకాలు ఏర్పడే అవకాశం ఉంది.

5, 4 స్థానాల్లో రాహు సంచారం కారణంగా శ్రీ హేవళంబి సంవత్సరంలో ప్రేమలు బెడిసికొట్టే అవకాశం ఉంది. కుటుంబ వ్యవహారాలు మన స్తాపం కలిగిస్తాయి. విద్యార్థులకు చదువుల పట్ల శ్రద్ధ లోపిస్తుంది. అనవసర విషయాల్లో జోక్యం చేసుకుని మాటపడతారు. సంతతి విషయంలో ఆందోళనకు గురవుతారు. 11, 10 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉద్యోగంలో ప్రోత్సాహకరం. వ్యాపార రంగంలోని వారికి ఆర్థికంగా అనుకూలం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కాస్త ఫలితం కోసం ఎంతో శ్రమించాల్సి వస్తుంది. పైఅధికారులతో వ్యవహారాల్లో మౌనం మంచిది.

**దత్తాత్రేయస్వామి ఆరాధనతో చిక్కులు తొలగుతాయి.**

## వృషభం

**(కృత్తిక 2,3,4; రోహిణి మృగశిర 1,2 పాదాలు)**

వృషభ రాశి వారికి శ్రీ హేవళంబినామ సంవత్సరంలో అన్ని విషయాల్లో ఆనందప్రదంగా ఉంటుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. పెట్టుబడులపై మంచి ప్రతిఫలం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి కనిపిస్తుంది. వివాహయత్నాలు ఫలిస్తాయి. ఇల్లు లేదా స్థలం కొను



*ఆదాయం: 2* *రాజపూజ్యం: 7*
*వ్యయం: 8* *అవమానం: 6*

గోలు చేస్తారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. విద్యార్థులు విజయం సాధిస్తారు. ఏప్రిల్ -జూన్ మాసాల మధ్య ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఎదురవుతాయి.

5-6 స్థానాల్లో గురుసంచారం కారణంగా ఈ ఏడాది సంతానం విషయంలో శుభపరిణామాలు సంభవం. స్నేహ సంబంధాలు పెంపొందుతాయి. ఉన్నత విద్యాయత్నాలు ఫలిస్తాయి. వాయిదా పడుతున్న పనులు పూర్తి చేస్తారు. ఆర్థిక విష

యాల్లో పట్టుదలతో వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. మీ సృజనాత్మకతకు తగిన అవకాశాలు లభిస్తాయి. శాస్త్ర, విజ్ఞాన రంగాల వారికి ప్రోత్సాహకరం. పిల్లల విద్య, వృత్తి, వివాహం విషయాలలో అభివృద్ధి కనిపిస్తుంది. సంవత్సరం ప్రారంభం నుంచి జూన్ వరకు గురువు వక్రగమనంలో ఉన్నందున పెద్దలతో పరిచయాలు ఏర్పడతాయి. ఆరోగ్యం, విద్య పట్ల అధిక శ్రద్ధ చూపాలి. సెప్టెంబర్ 13 నుంచి గురువు తులారాశిలో ప్రవేశిస్తాడు. ఫలితంగా ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో వికాసం కనిపిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ప్రమోషన్లు అందుకుంటారు.

ఈ సంవత్సరం శని 7, 8 స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. అనవసర ఖర్చులు పెరుగుతాయి. శని వక్రించిన ఏప్రిల్, ఆగస్టు మాసాల మధ్య వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఎదురయ్యే అవకాశం ఉంది. శత్రుబాధలు, రుణ బాధలు అధికం. ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. ఆర్థిక సంస్థలు, బీమా, మ్యూచ్యువల్ ఫండ్స్‌లో పనిచేసే వారు ఆశించిన ఫలితాలు రాక ఇబ్బందులు ఎదుర్కొంటారు. వాహనాలు నడిపేవారు జాగ్రత్త వహించాలి.

శ్రీ హేవళంబి సంవత్సరంలో 4, 3 స్థానాల్లో రాహుసంచారం కారణంగా కుటుంబపరమైన సమస్యలు ఎదుర్కొంటారు. ఆటంకాలను అధిగమించి స్థిరాస్తి కొనుగోలు చేస్తారు. బదిలీలకు అవకాశం ఉంది. ఇంట్లో శుభకార్యం జరుగుతుంది. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి.

10, 9 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉద్యోగంలో చికాకులు, ఒత్తిడి తప్పకపోవచ్చు. ఖర్చులు అంచనాలు మించుతాయి. స్నేహసంబంధాల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. షేర్ల లావాదేవీల్లో నష్టం తప్పకపోవచ్చు. ఉన్నత చదువుల్లో పట్టుదలతో శ్రమించి ఫలితం సాధిస్తారు.

**ఈశ్వరుడి ఆరాధన శుభప్రదం.**

## మిథునం

**(మృగశిర 3,4; ఆరుద్ర; పునర్వసు 1,2,3 పాదాలు)**

మిథున రాశి వారు హేవళంబినామ సంవత్సరంలో స్థల సేకరణ, గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల్లో పురోగతి సాధిస్తారు. కుటుంబంలో పండుగ వాతావరణం నెలకొంటుంది. ఉద్యోగంలో పురోగతి సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఉన్నత విద్యాభ్యాసానికి అనుకూలం. వాహనం కొనుగోలు చేస్తారు. ఏప్రిల్–జూన్ మాసాల మధ్య ఖర్చులు అధికంగా ఉంటాయి. ఆస్తుల క్రయవిక్రయాల్లో చిక్కులు ఎదురవుతాయి. కుటుంబ సభ్యుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది.

ఈ ఏడాది 4, 5 స్థానాల్లో శుభప్రదుడైన గురువు సంచరిస్తాడు. ఫలితంగా విలువైన వస్తువులు, ఆభరణాలు, స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు. ఇంట్లో వేడుకలు, వివాహాది శుభకార్యాలు జరుగుతాయి. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. స్థల సేకరణ, గృహ నిర్మాణానికి అనుకూలం. గురువు వక్రగమనంలో ఉండే ఉగాది నుంచి జూన్ వరకు రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో ప్రతికూలత కనిపిస్తుంది. కుటుంబ సభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. న్యాయపరమైన సమస్యలు తలెత్తే అవకాశం ఉంది. సెప్టెంబర్ నుంచి సంవత్సరాంతం వరకు గురువు పంచమంలో సంచారం చేయడం వల్ల విద్యార్థులకు శుభప్రదం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. విద్య, వైజ్ఞానిక రంగాల వారికి విశేష ప్రోత్సాహం లభిస్తుంది. శత్రువులు కూడా మిత్రులుగా మారతారు. స్నేహబాంధవ్యాలు విస్తరిస్తాయి.



*ఆదాయం: 5* *రాజపూజ్యం: 3*
*వ్యయం: 5* *అవమానం: 6*

శని ఈ సంవత్సరమంతా 6, 7 స్థానాల్లో సంచారం చేస్తాడు. ఫలితంగా వృత్తి, వ్యాపారాల్లో పురోగతి సాధిస్తారు. శ్రమకు తగిన ప్రతిఫలం అందుకుంటారు. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. వ్యాపార విస్తరణకు అవకాశం ఉంది. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. అదనపు బాధ్యతలు భుజానికి ఎత్తుకోవాల్సి వస్తుంది. పట్టుదలతో పనిచేసి లక్ష్యాలు సాధిస్తారు. శని వక్రించిన ఏప్రిల్ 7–ఆగస్టు 26 మధ్య ప్రత్యర్థుల నుంచి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. వైవాహిక జీవితంలో మనస్పర్థలు తలెత్తే అవకాశం ఉంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 3, 2 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఉద్యోగంలో మార్పులు, చేర్పులకు ఆస్కారం ఉంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. బదిలీ కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వయసులో చిన్నవారితో పరిచయాలు ఏర్పడతాయి. చెడుస్నేహాలకు దూరంగా ఉండాలి. భారీ పెట్టుబడులకు ఈ ఏడాది దూరంగా ఉండటం శ్రేయస్కరం.

9, 8 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉన్నత చదువుల కోసం పట్టుదలతో ప్రయత్నించి సత్ఫలితాలు సాధిస్తారు. వ్యాపార రంగంలో అంచనాలు తలకిందులవుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో చిక్కులు ఎదురవుతాయి. ఆస్తిపాస్తుల విషయాల్లో వివాదాలకు ఆస్కారం ఉంది. ఉద్యోగ, వ్యాపారాల్లో ఒత్తిడికి లోనవుతారు.

**ఆంజనేయస్వామి ఆరాధనతో సత్ఫలితాలొస్తాయి.**

## కర్కాటకం

**(పునర్వసు 4; పుష్యమి, ఆశ్లేష)**

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఈ రాశి వారికి కాంట్రాక్టులు, ఒప్పందాలు లాభిస్తాయి. ఉన్నత చదువుల కోసం విదేశాలకు వెళ్ళేందుకు అనుకూలం. వృత్తిపరంగా స్థానచలనానికి అవకాశం. న్యాయ, రాజకీయ, ప్రచురణ, మార్కెటింగ్, రవాణా, కన్సల్టెన్సీ, ఏజెన్సీలు, విద్యారంగంలోని వారికి ప్రోత్సాహకరం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సొంత ఇల్లు సమకూర్చు కుంటారు. ఉగాది నుంచి జూన్ వరకు విద్యార్థుల్లో అశ్రద్ధ పెరుగుతుంది. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. విద్య, రాజకీయ రంగాల వారు అప్రమత్తంగా ఉండాలి.

ఈ ఏడాది గురుగ్రహం సెప్టెంబర్ 12 వరకు కన్యలో ఆ తరువాత తులారాశిలో సంచరిస్తుంది. ఫలితంగా సోదరీసోదరులు, బంధువుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. దూరప్రయాణాలకు అనుకూలం. ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి. బదిలీలకు అనుకూలం. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. గురువు వక్రించిన ఫిబ్రవరి 7 నుంచి జూన్ 19 వరకు వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగ యత్నాలు ఫలించకపోవచ్చు. కుటుంబ విషయాల్లో చిక్కులు ఎదురవుతాయి. సెప్టెంబర్ తరువాత స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. ఉద్యోగులకు ప్రశంసలు లభిస్తాయి. ఉమ్మడి వ్యాపారాలు ప్రారంభిస్తారు. వారసత్వ వ్యవహారాలు పరిష్కారం అవుతాయి.



*ఆదాయం: 14* *రాజపూజ్యం: 6*
*వ్యయం: 2* *అవమానం: 6*

ఈ ఏడాది 5, 6 స్థానాల్లో శని సంచారం కార

ణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు అధికం. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోయే ప్రమాదం ఉంది. వ్యాపారంలో నష్టాలు చవిచూస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. పని ఒత్తిడి అధికం అవుతుంది.

ఉద్యోగులకు చిక్కులు ఎదురైనా కష్టపడి పని చేసి గుర్తింపు తెచ్చుకుంటారు. భారీ వ్యాపారానికి, కొత్త ప్రాజెక్టులకు అనుకూల సమయం కాదు. రావలసిన డబ్బు సకాలంలో అందక ఇబ్బందిపడ తారు. శని వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ ఆగస్టు మాసాల మధ్య వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహ కరంగా ఉంటుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వైద్యం, కేటరింగ్, రిటైల్, హోటల్ రంగాల వారికి శుభప్రదం. క్రీడాకారులకు అనుకూలం. వివాహ యత్నాలు నెమ్మదిగా నెరవేరతాయి.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 2, 1 స్థానాల్లో రాహు సంచారం ఫలితంగా అనవసర ఖర్చులు అధికం. మాట ఇచ్చి నిలబెట్టుకోలేకపో తారు. రుణబాధలు అధికం. మానసిక ఆందోళన లకు లోనవుతారు. ఆరోగ్యం మందగిస్తుంది. డబ్బు చేతిలో నిలవదు.

8, 7 స్థానాల్లో కేతు సంచారం కారణంగా వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఎదుర్కొం టారు. ఆరోగ్యం మందగిస్తుంది. మానసిక ఆందో ళన అధికం. డ్రైవింగ్‌లో నిదానం పాటించాలి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి.

**శ్రీ వేంకటేశ్వరస్వామి ఆరాధన శుభాలనిస్తుంది.**

## సింహం

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)**

సింహరాశి వారికి శ్రీ హేవళంబిలో ఆర్థిక పరి స్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగంలో బదిలీలు, ప్రమోషన్లకు అవకాశం ఉంది. ఆస్తి వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. సంతానం విషయంలో పురోగతి కనిపిస్తుంది. పెట్టుబడులు లాభిస్తాయి. వ్యాపారంలో అభివృద్ధి కనిపిస్తుంది. ఆరోగ్యం మెరుగవుతుంది. ఏప్రిల్–జూన్ మాసాల మధ్య తొందరపాటు నిర్ణయాలవల్ల ఆర్థికంగా నష్టపోయే అవకాశం ఉంది.

2, 3 స్థానాల్లో గురుగ్రహ సంచారం కారణంగా ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. స్థిర, చరాస్తులు, విలువైన వస్తువులు సమకూర్చుకుం టారు. ప్రముఖులతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు. సోదరీసోదరుల విషయాల్లో శుభపరి ణామాలు సంభవం. అనుబంధాలు బలపడతాయి. వృత్తి వ్యాపారాలలో లాభాలకు, ఉద్యోగంలో పురో గతికి అవకాశం ఉంది.

ప్రస్తుతం చేస్తున్న వ్యాపారంలో చిన్నపాటి మార్పులు చేయడం వల్ల లాభాలు ఆర్జిస్తారు. కుటుంబ వ్యవహారాలు ఆనందం కలిగిస్తాయి. వేగంగా నిర్ణయాలు తీసుకుంటారు. సంవత్సరం ప్రారంభం నుంచి జూన్ 10 వరకు గురువు వక్రిం చిన కారణంగా ఆర్థిక విషయాల్లో తొందరపాటు



*ఆదాయం: 2* *రాజపూజ్యం: 2*
*వ్యయం: 14* *అవమానం: 2*

తగదు. సెప్టెంబర్ 13 నుంచి సోదరులు, సన్నిహి తులతో సదవగాహన ఏర్పడుతుంది. చేపట్టిన పనులు పూర్తవుతాయి. విద్యాసంస్థలు, కన్సల్టెన్సీ, ఏజెన్సీల వారికి శుభప్రదం. ఉద్యోగం చేస్తూ చదువు కునేందుకు అనుకూలం.

4–5 స్థానాల్లో శని సంచారం కారణంగా ఆస్తి వ్యవహారాలు పరిష్కారం అవుతాయి. ప్రేమాను బంధాలు బలపడతాయి. ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు నెమ్మదిగా ఫలిస్తాయి. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. ప్రతి పనిలో ఆలస్యం, ఆటంకాలు ఎదురవుతాయి. శని వక్రించిన ఏప్రిల్ 7, ఆగస్టు 26 తేదీల మధ్య ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. స్నేహ బాంధవ్యాలు, ప్రేమ వ్యవహారాలు ఫలిస్తాయి. స్నేహాల వల్ల చదువుల పట్ల కొంత అశ్రద్ధ చూపే అవకాశం ఉంది. ప్రేమ వ్యవహారాల్లో చిక్కులు, ఆటంకాలెదురైనా ఓరిమితో అందరినీ ఒప్పించేం దుకు యత్నిస్తారు.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 1, 12 స్థానాల్లో రాహు సంచారం కారణంగా మనసు ఆందోళనగా ఉంటుంది. ప్రతి చిన్న విషయానికి కంగారు పడతారు. ఉన్నత విద్య, విదేశీ వ్యవహా రాలకు అనుకూలంగా ఉంటుంది. విలాస ఖర్చులు అధికం. విద్యలో కొన్ని ఆటంకాలు ఎదురైనా చివ రకు సత్ఫలితాలు సాధిస్తారు.

7, 6 స్థానాల్లో కేతు సంచారం కారణంగా వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి. కుటుంబ సభ్యుల్లో ఒకరి ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. అపార్థాలు, కోపావేశాల కార ణంగా సంబంధాలు దెబ్బతింటాయి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి.

**సూర్యభగవానుడి ఆరాధన శుభఫలితాలనిస్తుంది.**

## కన్య

**(ఉత్తర 2,3,4; హస్త; చిత్త 1,2 పాదాలు)**

కన్యారాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్స రంలో అన్ని విషయాల్లో పురోగతి సాధిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠ పెరుగుతుంది. వ్యాపారాన్ని విస్త రిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. పెద్దల పరి చయాలు లాభిస్తాయి. గృహ నిర్మాణం, స్థలసేక రణకు అనుకూలం. వివాహ, ఉన్నత విద్యా యత్నాలు ఫలిస్తాయి. వైద్య, రాజకీయ, సినీ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఏప్రిల్ జూన్ మాసాల మధ్య అశాంతికి లోనవుతారు. చేపట్టిన పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.

ఏడాది ప్రారంభం నుంచి గురువు మీ చంద్ర రాశిలో సంచరిస్తాడు. ఫలితంగా సృజనాత్మక ప్రతి భతో వినూత్నమైన ప్రాజెక్టులు చేపడతారు. ప్రమోషన్లకు అవకాశం ఉంది. ఉద్యోగ ప్రయ త్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. శ్రీవారు, శ్రీమతి సహకారంతో లక్ష్యాలు సాధి స్తారు. బాంధవ్యాలు బలపడతాయి. కొత్త భాగ స్వామ్యాలు లాభిస్తాయి. శత్రువులు కూడా మిత్రు లుగా మారతారు. సంతతి విషయంలో శుభపరి ణామాలు సంభవం. విద్య, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి పురోగతి కనిపిస్తుంది. కుటుంబం విస్తరిస్తుంది. వ్యాపా



*ఆదాయం: 5* *రాజపూజ్యం: 5*
*వ్యయం: 5* *అవమానం: 2*

రంలో లాభాలకు అవకాశం ఉంది. ఉన్నత విద్య, విదేశీ గమన యత్నాలు ఫలిస్తాయి. ఇంట్లో ఒక శుభకార్యం జరుగుతుంది. సంవత్సరం ప్రారంభం నుంచి ఫిబ్రవరి 7 నుంచి జూన్ 10 వరకు గురువు వక్రించిన కారణంగా అశాంతికి లోనవు తారు. అలర్జీలు బాధిస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సెప్టెంబర్ 13 నుంచి ఆర్థికంగా ప్రోత్సాహ కరం. ఆస్తిపాస్తులు పెంపొందించుకుంటారు.

శని 3, 4 స్థానాల్లో సంచారం ఫలితంగా పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. బదిలీలు, సీట్ల మార్పిడి వల్ల అసౌకర్యానికి లోనవుతారు. దానివల్ల ఆందోళన పెరిగినా నెమ్మదిగా పరిస్థి తులు సర్దుకుంటాయి. కుటుంబ విషయాల్లో చికా కులు అధికం. సంతానం విషయాలు ఆందోళన




In this new work culture, traveling in a polluted ambiance is every day need. The work load is slowly affecting our healthy lifestyle by changing food traditions and eating habits. You can try everything you can to try to stop bad things happening to you, but eventually things will happen, so the best prevention is **CARE** for Health check-ups.

## CHECK IN HAPPINESS

### Why Health Check-ups are important?

Our health system can be in crisis precisely because we systematically neglect wellness and prevention. As it is said, Treatment without prevention is simply unsustainable, 65% of health problems can be prevented easily if diagnosed well in time. And prevention efforts naturally begin with health check-ups.

One of the best aspects of health CARE reform is comprehensive health check-ups, customized packages, state-of-the-art facilities, world class specialists, highly trained and experienced support staff and greater flexibility & convenience... everything for your care.

**it's about time we make the well-being of Hyderabad.**

## HEALTHY YOU... HAPPY YOU...

- **Master Health Check- up** - ₹ **6000**
- **Executive Health Check- up** - ₹ **7750**
- **Premium Health Check-up** - ₹ **9500**
- **Essential Heart Check-up** - ₹ **2600**
- **Smart Sugar Health Check-up** - ₹ **575**
- **Smart Thyroid Health Check-up** - ₹ **1100**
- **Premium Diabetic Assessment** - ₹ **5450**
- **Executive Health Check-up with Stress Mibi** - ₹ **15200**
- **Prostate Check** - ₹ **1500**
- **Anemia Profile** - ₹ **3000**
- **CARE Smart Health Check-up** - ₹ **3500**
- **Smart Lung Health Check-up** - ₹ **1500**
- **Smart Kidney Health Check-up** - ₹ **1100**
- **Gastro Check-up** - ₹ **2000**
- **Senior Citizen Health Check-up** ♂ male - ₹ **5200**
- **Senior Citizen Health Check-up** ♀ female ₹ **5200**
- **Smart Liver Health Check-up** - ₹ **4000**
- **Child Fever Check-up** - ₹ **2000**
- **Child Health Check-up** - ₹ **2400**
- **Gynecology Check-up** - ₹ **950**
- **Women Wellness Check- up** - ₹ **1750**
- **Complete Bone Health Check-up** - ₹ **4900**
- **Comprehensive Liver Health Check- up** - ₹ **8500**
- **Comprehensive Kidney Health Check- up** - ₹ **3000**

For appointments
**1800 108 6666**

CARE Outpatient Centre, Road no - 10,
Banjara Hills, Hyderabad - 500 034.
feedbackcopc@carehospitals.com,
www.carehospitals.com

For information, Call
**7331105040, 9873951173**

CARE OUTPATIENT CENTRE
India's Largest Integrated Outpatient Centre

కలిగిస్తాయి. విద్యార్థులకు చదువుల పట్ల అశ్రద్ధ పెరుగుతుంది. విలాసాలకు వెచ్చిస్తారు. శని వక్ర గమనంలో ఉన్న ఏప్రిల్-ఆగస్టు మాసాల మధ్య ఆస్తి సమస్యలు పరిష్కారమవుతాయి. బదిలీ యత్నాలు ఫలిస్తాయి. కుటుంబంలో ఆహ్లాదకర వాతావరణం నెలకొంటుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఇంట్లో, కార్యాలయంలో బాధ్యతలు అధికం అవుతాయి.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 12, 11 స్థానాల్లో రాహుగ్రహ సంచారం కారణంగా అనవసర ఖర్చులు పెరుగుతాయి. మనసంతా చికాకుగా ఉంటుంది. క్రీడాకారులకు అనుకూలంగా ఉంటుంది. స్పెక్యులేషన్లు, ఆర్థిక లావాదేవీల్లో జాగ్రత్త వహించాలి.

6, 5 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు, షేర్లు, భాగస్వామ్యాల్లో చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఉన్నత చదువుల కోసం చేసే యత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి.

**సుబ్రహ్మణ్యస్వామి ఆరాధన వల్ల లాభం కలుగుతుంది.**

## తుల

**(చిత్త 3,4; స్వాతి; విశాఖ 1,2,3 పాదాలు)**

తులారాశి వారు హేవళంబినామ సంవత్సరంలో ప్రమోషన్లు అందుకుంటారు. గృహ నిర్మాణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో భాగంగా విదేశీయానం చేస్తారు. వాహనాలు, స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. ఉన్నత విద్యాభ్యాస ప్రయత్నాలు ఫలిస్తాయి. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. రాజకీయ, సినీ, బోధన, న్యాయ, రక్షణ,



*ఆదాయం: 2* *రాజపూజ్యం: 1*
*వ్యయం: 8* *అవమానం: 5*

మైనింగ్ రంగాల వారికి శుభప్రదం. ఉగాది నుంచి జూన్ వరకు ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ప్రేమ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. విద్యార్థులు లక్ష్య సాధన కోసం అధికంగా శ్రమించాలి.

గురువు 12, 1 స్థానాల్లో సంచారం చేస్తున్న ఫలితంగా విలాసాలకు, దూరప్రయాణాలకు ఎక్కువ సమయం కేటాయిస్తారు. రాజకీయ నేతలు ఉన్నత పదవులు అందుకుంటారు. సినీరంగానికి చెందిన వారు మంచి ప్రాజెక్టులు చేపడతారు. స్నేహ బాంధవ్యాలు పెంపొందుతాయి. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. విశ్వాసంతో అనుకున్న పనులు నిరాటంకంగా పూర్తిచేయగలుగుతారు. సంతతి విషయంలో శుభపరిణామాలు సంభవం. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ఆర్థిక విషయాల్లో అనవసర ఖర్చులు అధికం. ఆదాయం పెరిగినా డబ్బు మాత్రం చేతిలో నిలవదు. ఇల్లు, ఉద్యోగంలో మార్పులు, చేర్పులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థికవిషయాల్లో నిదానంగా కానీ పనులు జరగవు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. పుణ్యకార్యాలు, తీర్థయాత్రలకు ఖర్చు చేస్తారు.

2, 3 స్థానాల్లో శని సంచారం ఫలితంగా ఆర్థిక విషయాల్లో నిదానం పాటించండి. పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సోదరీసోదరులు, సన్నిహితుల బాధ్యతలు మోయాల్సి రావచ్చు. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. కుటుంబపరమైన గొడవలు తలెత్తుతాయి. చదువుల పట్ల శ్రద్ధ లోపిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో ఒత్తిళ్లు ఎదురైనా చివరకు సానుకూల ఫలితాలు సాధిస్తారు. శని వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు పట్టుదలతో కృషి చేసి చదువుల్లో రాణిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి అనుకూల సమాచారం అందుకుంటారు. కుటుంబం, ఆస్తులు, ఆరోగ్య విషయాల్లో మెరుగైన వాతావరణం కనిపిస్తుంది.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 11, 10 స్థానాల్లో రాహు సంచారం ఫలితంగా ఉద్యోగ ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి. పట్టుదలతో ప్రయత్నించి చివరకు విజయం సాధిస్తారు. ఒత్తిళ్లు ఎదుర్కొంటారు. విలాసాలకు ఖర్చులు అధికం. ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.

5, 4 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు తలెత్తే అవకాశం ఉంది. తొందరపాటుతనం వల్ల ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఆస్తులు, ఆర్థిక విషయాల్లో ఇబ్బందులు పడతారు. ఆరోగ్యం మందగిస్తుంది. గృహ నిర్మాణం కోసం చేసే ప్రయత్నాలు నెమ్మదిగా ఫలిస్తాయి.

**శ్రీరామచంద్రుడి ఆరాధన శుభఫలితాలను ఇస్తుంది.**

## వృశ్చికం

**(విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ)**

వృశ్చిక రాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఆర్థిక విషయాల్లో అభివృద్ధి సాధిస్తారు. వృత్తి, ఉద్యోగాల్లో పురోగతి కనిపిస్తుంది. జీవితం ఆనందదాయకంగా ఉంటుంది. కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. అందులో విజయం సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు లాభిస్తాయి. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వినోద, విలాసాలకు సమయం వెచ్చిస్తారు. దంపతుల మధ్య సదవగాహన నెలకొంటుంది. ఏప్రిల్-జూన్ మాసాల మధ్య ఆర్థిక వ్యవహారాల్లో నిరుత్సాహంగా ఉంటుంది. మనశ్శాంతి లోపిస్తుంది. విద్యార్థులకు చదువు పట్ల శ్రద్ధ లోపిస్తుంది.

గురువు ఈ ఏడాది లాభ, వ్యయ స్థానాల్లో సంచరిస్తున్నాడు. ఫలితంగా ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి సాధిస్తారు. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి. విద్య, వైజ్ఞానిక, ప్రచురణలు, ప్రకటనలు, బోధన, న్యాయ, సినీ, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహం లభిస్తుంది. విదేశీ గమనానికి, విదేశాలలో చదువులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. టెక్స్‌టైల్స్, చలనచిత్రాలు, మత్స్య, రవాణా, టైల్స్, ఫొటోగ్రఫీ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యో



*ఆదాయం: 8* *రాజపూజ్యం: 4*
*వ్యయం: 14* *అవమానం: 5*

గంలో స్థిరత్వం సాధిస్తారు. ఉగాది నుంచి జూన్ వరకు పెద్దల ఆరోగ్యం మందగిస్తుంది. ఖర్చులు పెరుగుతాయి.

1, 2 స్థానాల్లో శని సంచారం వల్ల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. అన్ని పనుల్లో అటంకాలు ఎదురవుతాయి. మనసు చంచలంగా ఉంటుంది. ఏ విషయంలోనూ ఒక నిర్ణయానికి రాలేకపోతారు. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోతారు. స్నేహ, బాంధవ్యాల పట్ల అశ్రద్ధ చూపే అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో వివాదాలు తలెత్తే అవకాశం ఉంది. మంచికి పోతే చెడు ఎదురవుతుంది. రుణబాధలు అధికం. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. దీర్ఘకాలిక దృష్టితో చేసే పెట్టుబడులు కొంతవరకు లాభిస్తాయి. వేరేవారి ఆర్థిక విషయాల్లో తలదూర్చి చిక్కుల్లో పడతారు. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ఆలస్యాలను, వైఫల్యాలను లెక్కచేయకుండా ప్రయత్నాలు కొన

సాగించి లక్ష్యాలు సాధిస్తారు. స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 10, 9 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఉద్యోగ, వ్యాపారాల్లో చికాకులు అధికం. బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. ఉద్యోగం మారేందుకు ప్రయత్నిస్తారు. తొందరపాటు నిర్ణయాలకు ఇది సమయం కాదని గ్రహించాలి. అనుభవం ఉన్న వారి సహకారంతో ఒక నిర్ణయానికి వస్తారు.

4, 3 స్థానాల్లో కేతు సంచారం కారణంగా కుటుంబ వ్యవహారాలు కొంత అశాంతి కలిగిస్తాయి. ఆరోగ్యం మందగిస్తుంది. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. అనవసర ఖర్చులు పెరుగుతాయి. సోదరీసోదరులు, బంధుమిత్రులతో సఖ్యత లోపిస్తుంది.

**లక్ష్మీదేవి ఆరాధన వల్ల శుభఫలితాలు కలుగుతాయి.**

## ధనుస్సు

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)**

ఈ రాశిలో పుట్టినవారు హేవళంబిలో వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. ప్రమోషన్లు, ఉన్నత పదవులకు అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో పురోగతి సాధిస్తారు. రాజకీయ, ప్రభుత్వ, సహకార రంగాలకు చెందిన వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వైవాహిక జీవితం ఉల్లాసంగా



*ఆదాయం: 11* *రాజపూజ్యం: 7*
*వ్యయం: 5* *అవమానం: 1*

ఉంటుంది. గృహనిర్మాణ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు ప్రోత్సాహకరం. ఏప్రిల్, జూన్ మాసాల మధ్య పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. బాధ్యతలు అధికం అవుతాయి.

గురువు ఈ ఏడాది 10, 11 స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో పురోగతి కనిపిస్తుంది. అదనపు ఆదాయం కోసం చేసే యత్నాలు ఫలిస్తాయి. వ్యాపార రంగంలోని వారికి ఊహించని విధంగా లాభాలు వస్తాయి. అధికారం, హోదా, గౌరవ ప్రతిష్ఠలు పెరుగుతాయి. తల్లిదండ్రుల విషయంలో శుభపరిణామాలు కనిపిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు లభిస్తాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు బదిలీలు, మార్పులు చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి వ్యాపారాల్లో చికాకులు అధికం. తొందరపాటు నిర్ణయాలు తగవు. సెప్టెంబర్ 13 నుంచి లాభస్థానంలో గురు సంచారం వల్ల ఆర్థిక పరిస్థితి మెరుగుపడుతుంది. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి.

12, 1 స్థానాల్లో శని సంచారం ఫలితంగా ప్రేమలు ఫలిస్తాయి. బంధుమిత్రుల పరిధి విస్తరిస్తుంది. పెద్దల సహకారం, సలహాలు తీసుకుని ముందడుగు వేయాలి. ఆరోగ్యం మందగిస్తుంది. శిరోవేదన, నరాలు, కండరాలకు సంబంధించిన సమస్యలు ఎదుర్కొంటారు. కుటుంబ సభ్యులతో ఎడబాటు తప్పకపోవచ్చు. పోలీసు, రక్షణ రంగాల వారికి చిక్కులు ఎదురవుతాయి. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు శని వక్రించి ఉన్న కారణంగా క్రమశిక్షణతో వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. పట్టుదలతో చేపట్టిన పనులు పూర్తిచేస్తారు. రియల్ ఎస్టేట్ వ్యాపారులు ఓరిమితో మంచి ఫలితాలు సాధిస్తారు.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 9, 8 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఆరోగ్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాలు తగవు. డబ్బు విషయంలో మోసపోయే అవకాశం ఉంది. క్రయవిక్రయాలకు ఏ మాత్రం అనుకూల సమయం కాదు. కీలక నిర్ణయాలను వాయిదా వేయడం మంచిది.

3, 2 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉద్యోగ, వ్యాపారాల్లో మార్పులు, చేర్పులు ఇబ్బంది కలిగిస్తాయి. అనవసర ఖర్చులు అధికం. సంతానం విషయంలో సమస్యలు ఎదురవుతాయి. విద్యార్థులు పరధ్యానం కారణంగా నష్టపోతారు. మనసు చికాకుగా ఉంటుంది.

**గణపతి ఆరాధన వల్ల సత్ఫలితాలు సాధిస్తారు.**

## మకరం

**(ఉత్తరాషాఢ 2,3,4;**
**శ్రవణం; ధనిష్ఠ 1,2 పాదాలు)**

మకరరాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఆర్థికంగా అభివృద్ధి సాధిస్తారు. విదేశీ గమన ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిలో పురోగతి కనిపిస్తుంది. వ్యాపారాన్ని అభివృద్ధి చేస్తారు. సేవా కార్యక్రమాల్లో పాల్గొంటారు. ఉన్నత పదవులు అందుకుంటారు. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్–జూన్ మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిళ్ళకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

9, 10 స్థానాల్లో గురు సంచారం వల్ల ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రమోషన్లు సాధిస్తారు. వ్యాపార విస్తరణకు తగిన సమయం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహకరం. సంతాన ప్రాప్తికి అనుకూలం. కళ, సాంస్కృతిక, బోధన, ఉన్నత విద్య, విదేశీ వ్యవహార రంగాల వారికి ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి కనిపిస్తుంది. రాజకీయ రంగంలోని వారికి



*ఆదాయం: 14* *రాజపూజ్యం: 3*
*వ్యయం: 14* *అవమానం: 1*

ఉన్నత పదవులు లభిస్తాయి. వాహనాలు కొనుగోలు చేస్తారు. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఉగాది నుంచి జూన్ 11 వరకు గురువు వక్రించిన కారణంగా వృత్తి వ్యాపారాల్లో శ్రమాధిక్యం. బదిలీలు అసౌకర్యం కలిగిస్తాయి. మీ పురోగతి చూసి అసూయపడే వారు పెరుగుతారు. పెట్టుబడుల్లో జాగ్రత్త వహించాలి.

11, 12 స్థానాల్లో శని సంచారం కారణంగా వ్యాపారంలో లాభాలు ఆశించిన స్థాయిలో ఉండకపోవచ్చు. విలాసాలకు ఖర్చులు అధికం. రుణ బాధలు ఎక్కువగా ఉంటాయి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కళలు, సినిమాలు, వినోదం, పర్యాటక రంగాల వారు ఆశించిన ఫలితాలు అందక నిరుత్సాహపడతారు. రహస్య కార్యకలాపాల కారణంగా అప్రతిష్ఠకు గురవుతారు. కుటుంబ బాధ్యతలు, వృత్తిపరమైన పనులతో ఒత్తిడికి లోనవుతారు. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు భాగస్వామి సహకారం లభిస్తుంది. క్రమశిక్షణతో, ఓరిమితో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 8, 7 స్థానాల్లో రాహు సంచారం కారణంగా పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. ఆర్థిక విషయాల్లో ఇతరులకు సాయం చేసే విషయంలో ఒకటి రెండుసార్లు ఆలోచించాలి. వివాహ సంబంధాల్లో

ఒడిదుడుకులు ఎదురవుతాయి. ప్రేమానుబంధాలు బెడిసికొట్టే అవకాశం ఉంది. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు.

2, 1 స్థానాల్లో కేతు సంచారం కారణంగా అనవసర ఖర్చులు అధికం. చికాకులు కారణంగా ఏ విషయం మీదా దృష్టి కేంద్రీకరించలేకపోతారు.

**దుర్గామాత ఆరాధన శుభప్రదం.**

## కుంభం

**(ధనిష్ఠ 3,4; శతభిషం; పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)**

కుంభరాశి వారు హేవళంబినామ సంవత్సరంలో ఆర్థికంగా పురోభివృద్ధి సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో సత్ఫలితాలు అందుకుంటారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారాలకు తగిన సమయం. విద్యార్థులు, క్రీడా రంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. స్థలమార్పిడికి, ప్రమోషన్లకు అవకాశం ఉంది. రాజకీయ, కళ, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. ఏప్రిల్-జూన్ మాసాల మధ్య ఆర్థిక విషయాల కారణంగా ఆందోళన అధికం అవుతుంది. వృత్తిపరమైన ఒత్తిళ్ళకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.



*ఆదాయం: 14* *రాజపూజ్యం: 6*
*వ్యయం: 14* *అవమానం: 1*

8, 9 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా ఈ ఏడాది స్థిరచరాస్తులు సమకూర్చుకోగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో శుభ పరిణామాలు సంభవం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యోగులు ఆర్థికంగా అభివృద్ధి సాధిస్తారు. ఉన్నత చదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వైద్యరంగంలోని వారికి చక్కటి పురోగతి కనిపిస్తుంది. శత్రువులతో విభేదాలు సమసిపోతాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఎదురవుతాయి. కొత్త పెట్టుబడులకు దూరంగా ఉండాలి. ఆర్థిక సాయం చేస్తే సమయానికి డబ్బు తిరిగి రాదు. న్యాయపరమైన ఇబ్బందులు ఎదుర్కొంటారు.

ఈ ఏడాది 10, 11 స్థానాల్లో శని సంచారం ఫలితంగా రియల్ ఎస్టేట్ రంగంలోని వారి పరిస్థితి మెరుగుపడుతుంది. స్వయంకృషి, కార్యదీక్ష, ఓరిమి, ఏకాగ్రత, నిదానం, పట్టుదలతో అవరోధాలను అధిగమించి లక్ష్యాలు సాధిస్తారు. నూనెలు, ఇనుము, భూములు, ఖనిజాల వ్యాపారులకు ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాల్లో అదనపు బాధ్యతలు మోయాల్సి రావచ్చు. కొత్త వ్యాపారాలు ప్రారంభించాలనే ఆలోచనలకు కార్యరూపం ఇస్తారు. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ఒత్తిళ్ల అధికమౌతాయి. ఆలస్యాలు, ఆటంకాలు, న్యూనత, వైఫల్యాల వల్ల అసంతృప్తి, అశాంతికి లోనవుతారు. వాహనాలు నడిపే సమయంలో ఏకాగ్రత అవసరం. స్టాక్‌మార్కెట్ పెట్టుబడుల్లో నష్టం సంభవం. చెడు స్నేహాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. పెట్టుబడుల విషయంలో తొందరపాటు తగదు.

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో 7, 6 స్థానాల్లో రాహు సంచారం కారణంగా స్నేహబాంధవ్యాల్లో సమస్యలు తలెత్తే అవకావం ఉంది. వైవాహిక జీవితంలో సమస్యలు తలెత్తుతాయి. ఆరోగ్యంపట్ల శ్రద్ధ చూపించాలి. రుణబాధలు అధికం.

12, 1 స్థానాల్లో కేతు సంచారం ఫలితంగా అనవసర ఖర్చులు అధికం. ఆరోగ్యం మందగిస్తుంది. తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోయే అవకాశం ఉంది.

**శ్రీకృష్ణుడి ఆరాధన శుభప్రదం.**

## మీనం

**(పూర్వాభాద్ర 4; ఉత్తరాభాద్ర, రేవతి)**

ఈ రాశి వారికి శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఆర్థిక విషయాల్లో అభివృద్ధి కనిపిస్తుంది. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. సంకల్పం ఫలిస్తుంది. ఆస్తులు పెంపొందించుకుంటారు. వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పై చదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. ఏప్రిల్-జూన్ మాసాల మధ్య ఆందోళనలు పెరుగుతాయి. వృత్తిపరమైన ఒత్తిళ్ళు, న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

సెప్టెంబర్ 13 వరకు 7వ స్థానంలో గురుగ్రహ సంచారం ఫలితంగా శ్రీవారు, శ్రీమతి విషయాలలో పురోగతి కనిపిస్తుంది. స్నేహితులు, బంధువులు, అభిమానులు మీ లక్ష్యసాధనలో సహకరిస్తారు. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. ఉమ్మడి వ్యాపారం లాభిస్తుంది. విద్యార్థులకు శుభప్రదం. విదేశీ ప్రయాణాలు చేస్తారు. ఆస్తులు పెంపొందించుకుంటారు. ప్రకటనలు, ఏజెన్సీ రంగాల వారికి ప్రోత్సాహకరం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడా రంగంలోని వారికి శుభప్రదం. రాజకీయ, కళా, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉగాది నుంచి జూన్ 11 వరకు భాగస్వామి ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహించాలి. శస్త్ర చికిత్స అవసరం కావచ్చు. రుణదాతల ఒత్తిడి పెరుగుతుంది. యుక్తితో నెమ్మదిగా పనులు పూర్తి చేస్తారు. పెద్దల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది.

ఈ ఏడాది శని 9, 10 స్థానాల్లో సంచరిస్తున్న ఫలితంగా ఉన్నత చదువులు, విదేశీ ప్రయాణాల్లో చిక్కులు తలెత్తే అవకాశం ఉంది. వృత్తి, వ్యాపారాల్లో ప్రమోషన్లు అందుకుంటారు. బదిలీలకు ఆస్కారం ఉంది. స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. అదనపు బాధ్యతలు చేపట్టాల్సి రావడం వల్ల ఒత్తిడి అధికంగా ఉంటుంది. మీ ప్రతిష్ఠకు భంగం కలిగే పరిణామాలు చోటుచేసుకుంటాయి. పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ప్రభుత్వ రంగంలోని వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. సన్నిహితులు, బంధువుల భాగస్వామ్యంతో కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధించి మంచి పేరు తెచ్చుకుంటారు.



*ఆదాయం: 11* *రాజపూజ్యం: 2*
*వ్యయం: 5* *అవమానం: 4*

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 6, 5 స్థానాల్లో రాహు సంచారం వల్ల రుణ బాధలు అధికం. ఆర్థిక విషయాల్లో ఒత్తిడికి లోనవుతారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. సర్జరీ చేయించుకోవాల్సి రావచ్చు. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.

12, 11 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఇంటి కోసం ఖర్చులు అధికం. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. క్రయవిక్రయాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. ఇచ్చిన మాట నిలుపుకోలేకపోతారు.

**పార్వతీదేవి ఆరాధన శుభఫలితాలనిస్తుంది.**




**కొద్దిరోజులు గడిచాయి. ఒకనాడు కృష్ణుడు ఇలా ఆలోచించసాగాడు.**

**అక్రూరుడు, స్వఫల్గుని కుమారుడైనంత మాత్రాన దుర్భిక్షాదిపీడలు తొలగిపోయాయన్నది నమ్మశక్యంగా లేదు. అందులో కొంత నిజం ఉండొచ్చు. అంతా నిజం ఉండే అవకాశం అయితే లేదు. ఇంతటి దారుణాపదలను తొలగించే శక్తి ఒక్క శ్యమంతకానికే ఉన్నది. అందులో అనుమానం లేదు. అంటే...శ్యమంతకం అక్రూరుని వద్ద ఉన్నదా?**

# వరాహ నారసింహ అవతారాలు

తన ఆలోచనకి తానే జలదరించాడు కృష్ణుడు. తర్వాత మళ్ళీ ఆలోచించసాగాడిలా.

శ్యమంతకం అక్రూరుని వద్దే ఉన్నది. ఉన్నది కాబట్టే అతను ద్వారకకు రాగానే ఉత్పాతాలన్నీ తొలగిపోయాయి. పైగా అక్రూరుడు ప్రతి రోజూ ఒక యజ్ఞం నిర్వహిస్తున్నాడు. యజ్ఞంతోపాటు భూరి దక్షిణలు ఇస్తున్నాడు. ఇంతటి వ్యయానికి అక్రూరునికి అంతటి డబ్బెక్కడిది?

ఆలోచన విరమించాడు కృష్ణుడు. పథక రచన చేశాడు. ఆ ప్రకారంగా అక్రూరుణ్ణి యాదవబాంధవులందరూ ఉన్న నిండుసభకి ఆహ్వానించాడు. వచ్చిన అక్రూరుణ్ణి ఉచితాసనం మీద కూర్చోబెట్టాడు. ముందుగా ఆ కబురూ ఈ కబురూ చెప్పి తర్వాత అసలు విషయాన్ని వ్యక్తం చేశాడిలా.

అక్రూరా! సాటిలేని శ్యమంతకాన్ని శతధన్వుడు నీకు ఇచ్చాడన్న సంగతి నాకు తెలుసు. ఈ సంగతి మూడోకంటికి తెలియనీయక నువ్వు జాగ్రత్త పడుతున్నావు. ఇందులో నీ తప్పు ఎంత మాత్రం లేదు. అయితే ఆ మణి నీ దగ్గర ఉన్నదన్న సంగతి మా అన్న బలరామదేవునికి స్పష్టం కావాలన్నదే నా అభిలాష.

చేతులు జోడించి నమస్కరించాడు అక్రూరుడు.

శ్యమంతకం నీ దగ్గర ఉన్న కారణంగానే నువ్వు రోజుకో యజ్ఞం చేస్తూ, దానధర్మాలు చేయగలుగుతున్నావు, అవునా? కాదా? అడిగాడు కృష్ణుడు. అవునన్నట్టుగా తలూపాడు అక్రూరుడు.

మణికోసం నేను ఎంతటి దారుణానికైనా పూనుకుంటానని మా అన్న గారికి అనుమానం. ఆ అనుమానంతోనే నన్నాయన కొన్నాళ్ళు దూరం పెట్టారు. బంధాల్లోనూ, అనుబంధాల్లోనూ అపోహలు ఉండరాదు. మణి నీదగ్గర ఉన్నదన్నది అన్న గారికి తెలియాలి. దయచేసి ఆ మణిని ఓసారి చూపించు అడిగాడు కృష్ణుడు.

తప్పకుండా అన్నాడు అక్రూరుడు.

కృష్ణా! శ్యమంతకాన్ని శతధన్వుడు నాకు ఇచ్చిన మాట వాస్తవం. దానిని కాపాడడానికి నేను పడుతున్న బాధలు అన్నీ ఇన్నీ కావు. ఒకానొక దశలో ఆ మణిని నీకు అప్పగించాలనుకున్నాను. కాని, అడగకుండా ఇస్తే అనుమానాలు పొడచూపుతాయని ఆగాను. అయితే మణి నా దగ్గర ఉన్నదన్న సంగతి నువ్వు తెలుసుకుని, నన్ను పిలవకుండా పోవన్నది కూడా ఆలోచించాను. ఆ క్షణం కోసమే నిరీక్షించాను. ఇన్నాళ్ళకు నా నిరీక్షణ ఫలించింది. నీ అనుగ్రహం లభించింది. ఇదిగో శ్యమంతకం. స్వీకరించు అన్నాడు అక్రూరుడు. తన ఉత్తరీయం కొంగుముడి విప్పాడు. అందులో ఉన్న చిన్న పేటిక తీశాడు. ఆ పేటిక నుండి శ్యమంతకాన్ని తీశాడు. సభాసదులందరికీ చూపించాడు.

మిట్టమధ్యాహ్నం సూర్యుడిలా వెలుగులీనుతున్న శ్యమంతకాన్ని చూసి సభ్యులందరూ కళ్ళు మూసుకున్నారు. బలరాముడు దానిని చూసి, ఆహా! ఇది కదా సంపద అంటే...అనుకున్నాడు. తమకు చెందితే బాగుణ్ణనుకున్నాడు. సత్యభామ కూడా ఆ మణిని అల్లంత దూరం నుంచి చూసింది. తనది అనుకున్నది. తనకి అందజేస్తే సంతోషిస్తాననుకున్నది. అందరి భావనలూ గమనించాడు కృష్ణుడు.

**శ్యమంతకమణి కథను ఆసాంతం విన్న జనమేజయుడు దేవదేవుడైన శ్రీకృష్ణుడి పుణ్యకార్యాలన్నిటినీ వివరించమని వైశంపాయనుని కోరాడు. విష్ణుదేవుని మహిమలు చెప్పడం ద్వారా తానూ కృతార్ధుణ్ణవుతానని ఆనందించిన వైశంపాయనుడు బ్రహ్మ జన్మవృత్తాంతంతో ప్రారంభించి వరాహ, నారసింహావతారాల ఆవిర్భావ నేపథ్యాలనూ వివరించాడు. ఆ కథా క్రమం ఏమిటో మీరూ చదవండి.**

సన్నగా నవ్వాడు. అక్రూరునితో అన్నాడిలా.

అక్రూరా! అన్నదమ్ములమధ్య ఏర్పడిన అపోహ తొలగించేందుకే నిన్ను శ్యమంతకాన్ని చూపించమన్నాను కాని, నాకు సమర్పించమని కాదు. నిజానికి ఈ మణి అటు మా అన్నగారికి కానీ, లేదంటే ఇటు మా సత్యకుగానీ చెందాలి. అయితే బ్రహ్మచర్యవ్రతం సహా సకలకాలశౌచవ్రతం పాటించగలవారికి మాత్రమే ఈ మణి తన మహిమను చూపించగలదని నాకు తెలుసు. నాతోపాటుగా మా వారెవ్వరూ అంతటి కఠినవ్రతాలను పాటించడం కష్టం. అందుకని సర్వగుణపరిపూర్ణుడవు, దానశీలివి నువ్వే ఈ మణిని స్వీకరించడానికి అన్ని విధాలా తగినవాడవు. కాబట్టి నీ మణిని నువ్వే స్వీకరించు. కాదు, కూడదనకు అన్నాడు కృష్ణుడు.

అంగీకరించి శ్యమంతకాన్ని స్వీకరించాడు అక్రూరుడు. సూర్యునిలా ప్రకాశించాడు అని ఆగాడు వైశంపాయనుడు. ఊపిరి తీసుకున్నాడు. తీర్థాన్ని సేవించాడు. గొంతు సవరించుకున్నాడు. కళ్ళు మూసుకుని విశ్రాంతి తీసుకున్నాడు.

**(తృతీయఖండం సమాప్తం)**

కాసేపటికి కళ్ళు తెరిచాడు. కళ్ళు తెరిచిన వైశంపాయనునికి చేతులు జోడించి నమస్కరించాడు జనమేజయుడు. అడిగాడిలా.

పురాణనిధీ! యదువంశంలో ప్రభవించిన రాజుల చరిత్రలన్నీ వీనులవిందుగా వినిపించావు. కృతజ్ఞుణ్ణి. అయితే దేవదేవుడు కృష్ణుడు ఆచరించిన పుణ్యకార్యాలన్నీ వివరంగా వినాలని ఉంది. అసలు దేవదేవుని స్వభావం ఎలాంటిది? అతడు ఏ విధంగా భూలోకంలో అవతరించాడు? కష్టాతికష్టమైన మానవజన్మను ఎందుకు ఎన్నుకున్నాడు? ఆలమందల కాపరి ఎందుకయ్యాడు? జర, మరణాది దుఃఖాలతో దుర్భరమైన నరశరీరం ఎందుకు స్వీకరించాడు? నాకు ఆ వివరాలన్నీ కావాలి. వినిపించండి.

తప్పకుండా అన్నాడు వైశంపాయనుడు. చెప్పాడిలా.

విష్ణుదేవుని మహిమలు వినాలనుకుంటున్న నువ్వు నిజంగా పుణ్యాత్ముడివి. నీకు ఆ మహిమలు చెబుతూ నేనూ కృతార్థుడినవుతాను.

ఈ చరాచరాత్మక ప్రపంచం అంతటా ఆ దేవదేవుడు వ్యాపించి ఉన్నాడు. సృష్టి స్థితి లయకారుడు అతడే! లోకాలకు ఉపద్రవాలు సంభవించినప్పుడు, భూమాతకు భారం దుర్భరమైనప్పుడు, సజ్జనులకు యాతనలు కలిగినప్పుడు, ధర్మానికి హాని కలిగినప్పుడు ఆ దేవుడు చిత్ర విచిత్రమైన అవతారాలెత్తి లోకాన్ని రక్షిస్తున్నాడు. ఆ అవతారాల్లో కొన్నిటిని సంగ్రహంగా వినిపిస్తాను, విను.

ప్రపంచం యావత్తు ప్రళయసాగరంలో మునిగిపోయింది. అంధకారబంధురమై ఉంది. అప్పుడు దేవుడు వేయి యుగాలపాటు యోగా మాయావశుడై గాఢనిద్రపోయాడు. తర్వాత మేల్కొన్నాడు. ఆనాడు అతని నాభికమలంలో నుండి బ్రహ్మ జన్మించాడు.

(మిగతా 30వ పేజీలో)

# ఉగాది ప్రత్యేకం




**కో**రికలు లేకపోవడం
ఎంత బాగుంటుంది!
వస్తువులపై
ఒక్కొక్క వ్యామోహమే తెగిపోతూ
అభౌతిక దేహాలపై దృష్టి సారించడం
ఎంత బాగుంటుంది!

నిర్లిప్తత కాదు
నిర్హేతుక తంత్రీ స్వనభంగమూ
కాదు.

## ప్రేమదీపం



జీవితంలో
నేను వదిలివచ్చిన ఖాళీలను
ఆ నడిచి వచ్చే యువకులు
పూరిస్తే ఎంత బాగుంటుంది!

ఎన్ని భారాలను మోశానో
ఉద్వేగ నౌకల కల్లోల ప్రయాణంలో
ఉజ్వలం అనుకున్న
తారకల దిశానిర్దేశంలో
ఆశా నిరాశల మధ్య నలిగిన
హృదయబింబాన్ని తలుచుకుంటే
తలపులు ఎర్రబడుతాయి.
దానినిప్పుడు మృదువుగా
నిమురుతూ
గతావలోకనం చేస్తుంటే
ఎంత బాగుంటుంది!

ఈ గోడలోని కిటికీని తొలగించి
విశ్వవీధుల్లోకి
నేనే ఓ కిటికీగా మారితే
ఎంత బాగుంటుంది!

లగేజీని కాస్తకాస్త దింపుకుంటూ
వాహనాలు అవసరం లేని నడకతో
అందరి మనస్సుల్లో
సంచారం చేస్తే ఎంత బాగుంటుంది!

ఒకప్పుడిది చిన్న ప్రపంచం
నేనుతప్ప మరేమీ కనరాని
ఏకీకృత సమీకరణం.

ప్రేమదీపాన్ని చేతబట్టి
ఈ పిల్లల తలలు నిమరడం
ఎంత బాగుంటుంది!

ఇన్నాళ్ళ తరువాత
ఒక పక్షితో మాట్లాడాలని,
ఒక చెట్టును
తీరిగ్గా అధ్యయనం చెయ్యాలని,
ఒక పువ్వులోంచి జాగ్రత్తగా
కవిత్వాన్ని వెలికి తియ్యాలనే భావన
ఎంత బాగుంటుంది!


–డా. ఎన్.గోపి
సెల్: 93910 28496






(28వ పేజీ తరువాయి)

ఈ కారణంగానే ఈ అవతారానికి 'పౌష్కరము' అని పేరు వచ్చింది. బ్రహ్మ జననం అనంతరం మధుకైటభులని ఇద్దరు రాక్షసులు విష్ణువుతో తలపడ్డారు. వారిమధ్య నిరంతరం యుద్ధం కొనసాగింది. ఆఖరికి ఆ రాక్షసులను సంహరించి, భువనాలను కాపాడాడు విష్ణువు.

జనమేజయా! కల్పం ప్రారంభంలో విష్ణువు యజ్ఞవరాహమూర్తి అవతారం దాల్చాడు. ఆ అవతారంలో అతనికి వేదాలు నాలుగూ చరణాలయ్యాయి. యూపం కోర అయింది. ప్రాయశ్చిత్తాలు గోళ్ళయినాయి. చితి ముఖమైంది. అగ్నిజ్వాల నాలుకైంది. క్రతువు మోకాలైంది. నేయి నాసిక అయింది. ఉపాకర్మ పెదవి అయింది. రాత్రింబవళ్ళు కళ్ళు అయినాయి. ప్రవర్గ్యపాఠం భూషణమైంది. ఋత్విజుడు బ్రహ్మ శీర్షమైనాడు. హవ్యకవ్యాలు వేగాలయ్యాయి. ఛందస్సులు మార్గాలయ్యాయి. ప్రాగ్వంశం అనే యజ్ఞసభాభవనం శరీరమైంది.

ఇలా పరిపూర్ణమైన యజ్ఞవరాహస్వరూపం ధరించిన ఆ దేవదేవుని వాడికోరల తళతళలతో ప్రళయాంధకారం సర్వం పటాపంచలైంది. గొంతు నుండి వెలువడిన గురగురధ్వనులు బ్రహ్మాండ భాండం ఎల్లెడలా మారుమ్రోగాయి. మోర ముంచి పైకెత్తినంతనే సముద్రం అంతా దూరంగా తొలగిపోయింది. గిట్టలతాకిడి భరించలేక ఆదిశేషుడు శిరస్సులు వంచుకున్నాడు. అప్పుడు ఆ యజ్ఞవరాహమూర్తి ఏడుపాతాళలోకాల అడుగున ఇరుకుగొందిలో నీటిలో మునిగిన భూదేవతపై మోర ఆన్చి, ప్రేమగా పైకి లేపాడు. సప్తసాగరాలతో, ద్వీపాలతో, పర్వతాలతో విలసిల్లే ఆ భూదేవతను జాగ్రత్తగా కిందికి దించి మహాసాగరమధ్యంలో నిలిపాడు.

ఇప్పుడు నారసింహ అవతారకథ వినిపిస్తాను, విను.

ఓర్పు, ధైర్యం, శాంతి, దాంతిసహా అనేక సుగుణాలు కలిగిన హిరణ్యకశిపుడు కృతయుగంలో పదకొండువేల సంవత్సరాలపాటు ఘోర తపస్సు ఆచరించాడు. కఠోరబ్రహ్మచర్యం చేశాడు. ఆ తపస్సును మెచ్చి బ్రహ్మ అతని ముందు ప్రత్యక్షమయ్యాడు. ఏం వరం కావాలో కోరుకో అన్నాడు. ఎట్టెదుట బ్రహ్మ ఉన్నాడు, వరం కోరుకోమంటున్నాడు. హిరణ్యకశిపుడు ఆనందానికి అంతులేకుండాపోయింది. సాష్టాంగపడ్డాడతనికి. నమస్కరించాడు. తర్వాత లేచి నిల్చుని చెప్పాడిలా.

సురాసురులు, యక్షులు, గంధర్వులు, భూతాలు, పిశాచులు, ఉరగలు, మానవులు, తిర్యగ్జంతువులు, శైలాలు, వృక్షాలు, శస్త్రాలు, ఎండినవి, తడిసినవి మొదలైన వాటివల్ల నాకు మృత్యువు రాకూడదు. ఋషీశ్వరుల శాపాలు ఫలించకూడదు. చరాచర ప్రపంచం మొత్తం నాకు ఆధీనం కావాలి. దిక్పాలకాధికారాలు నాకే చెందాలి. కామక్రోధాదులు నా అనుమతి మేరకే నడుచుకోవాలి.

నువ్వు కోరుకున్నట్టుగానే జరుగుతుంది. తథాస్తు అని అదృశ్యుడయ్యాడు బ్రహ్మ.

దేవతలకు ఈ సంగతి తెలిసింది. బ్రహ్మను సమీపించారు. వేడుకున్నారిలా.

దేవా! నీ వరంతో ఆ రాక్షసుడు మమ్మల్ని హింసలపాలు చేయకమానడు. కరుణించి, వాణ్ణి సంహరించే ఉపాయం ఆలోచించు.

ఆలోచించానన్నట్టుగా సన్నగా నవ్వాడు బ్రహ్మ. చెప్పాడిలా.

తీవ్రతపస్సు ఆచరించిన హిరణ్యకశిపునికి అంతటి వరం ఈయక తప్పలేదు. అయితే వర ప్రసాదినన్న గర్వంతో కన్నూ మిన్నూ కానక అతడు సంచరిస్తాడు. అలా సంచరించడంతో తపశ్చర్య సుకృతఫలితం అంతా పోతుంది. అప్పుడు బలహీనుడైపోతాడు. బలహీనుడైన హిరణ్యకశిపుణ్ణి విష్ణుదేవుడు సంహరిస్తాడు.

హమ్మయ్య అని ఊరడిల్లారు దేవతలు.

అంతవరకూ మీరు హిరణ్యకశిపుని హింసలు భరించకతప్పదు అన్నాడు బ్రహ్మ. సరేనన్నారు దేవతలు. అక్కణ్ణుంచి నిష్క్రమించారు.

దేవతలు చెప్పినట్టుగానే, బ్రహ్మ ఊహించినట్టుగానే వరగర్వంతో హిరణ్యకశిపుడు అందరినీ మట్టుబెట్టసాగాడు. అష్టదిక్పాలకుల్నేగాక, సిద్ధులు, సాధ్యులు, వసువులు ఆదిగా మహామహులందరినీ అవమానించాడు. తాపసులను అనేకరకాలుగా హింసించి, సకలలోక ఆధిపత్యాన్ని కైవసం చేసుకున్నాడు. బాధలు తట్టుకోలేకపోయారు దేవతలు. ఓర్పు నశించింది. పరుగుపరుగున పాలకడలికి చేరుకున్నారు. అక్కడ శేషశయ్యపై పవ్వళించి ఉన్న విష్ణుదేవునితో మొరపెట్టుకున్నారిలా.

దేవాధిదేవా! బ్రహ్మాదిదేవతలకు కూడా నువ్వే దిక్కు, మేమెంత? ఆ దుష్టుడు హిరణ్యకశిపుని బాధలు తట్టుకోలేకపోతున్నాం. నీ చరణాలనంటి ఉండిపోదలచాం. మమ్మల్ని కరుణించు.

చిద్విలాసంగా నవ్వాడు విష్ణుదేవుడు.

ప్రభూ! ఆ హిరణ్యకశిపుణ్ణి నువ్వు సంహరించేంత వరకూ మేము నిన్ను వీడం. మాకు ఈ పాలకడలే ప్రశాంతనిలయం అన్నారు దేవతలు.

సన్నగా నవ్వి చెప్పాడిలా విష్ణుదేవుడు.

దేవతలారా! మీ రాజ్యాలూ, సంపదలూ త్వరలోనే మళ్ళీ మీ సొంతమవుతాయి. మీరిక ఎలాంటి ఆందోళనా చెందనవసరం లేదు. ఇదిగో ఇప్పుడే ఆ హిరణ్యకశిపుణ్ణి నేను సంహరిస్తాను. బయల్దేరుతున్నాను.

విష్ణుదేవుడు బయల్దేరాడక్కణ్ణుంచి. నృసింహ స్వరూపం ధరించి, హిరణ్యకశిపుని ముందు పరమ భయంకరంగా ప్రత్యక్షమయ్యాడు. ఆ భీకరమూర్తి కేసరాలు ఇలా సంచలించాయో లేదో ఆ గాలికి అలా అకాశంలోని దేవతల విమానాలు కిందపడి తునాతునకలయ్యాయి. కోరల నుండి వెలువడిన కరాళజ్వాలలకు దిక్కులు బీటలువారాయి. తీవ్రమైన నిట్టూర్పుల తాకిడికి సాగరతరంగాలు ఉవ్వెత్తున లేచాయి. మహోగ్రహుంకార ధ్వనికి బ్రహ్మాండ గోళమే పగిలిపోయింది. రోషావేశంతో ఆ కళ్ళ నుంచి వెలువడిన పచ్చని వెలుగు ముందు చంద్ర కాంతి వెలవెలబోయింది.

**—అరణి**

## స్తవనీయ సృష్టి

అప్పుడు ఉన్నదీ లేదు, లేనిదీ లేదు;
గాలీ లేదు, దాని అవతల ఆకాశమూ లేదు.
ఏది దాగి ఉంది? ఎందులో? ఎవరి రక్షణలో?



అప్పుడు అడుగందని, లోతయిన నీరువుందా?

అప్పుడు మరణమనేది లేదు, అమరణమూ లేదు;
రాత్రి, పగలు జాడ కూడా యెక్కడా లేదు.
'అది' గాలిలేకుండా స్వయంసిద్ధ శక్తితో
శ్వాసించింది.
అది మినహా అవతల యేదీ ఉనికిలో లేదు.

మొదట అదృశ్య అంధకార అంధకారం ఉంది;
ఇది అంతా విలక్షణచిహ్నరహితంగా వ్యాపించిన
జలమే.
శూన్యంతో యేర్పడిన దానిని అది కప్పి వేసింది,
'అది' మహోష్ణశక్తి వలన జనించింది.

ప్రారంభంలో వాంఛ 'దాని'లో ప్రవేశించింది;
ఆలోచనకి దారి తీసిన ఆదిబీజం అదే!
అంతరంగాలలో అన్వేషిస్తున్న వివేక రుషులు
'లేని దాని'తో 'ఉన్నదాని' బంధాన్ని
కనుగొన్నారు.

వారి కాంతిపుంజం కటిక చీకటిలో కాంతి
నింపింది;
కానీ 'అది' ఆ పైన వుందా లేక అది ఈ కింద
వుందా?
సృజించే బలం ఉంది అక్కడ, అక్కడ సారవంత
శక్తీ వుంది;
కింద ఓజస్సు వుంది, పైన సహజాత
సంకల్పమూ వుంది

ఎవరికెరుక రూఢిగా? ఇక్కడ ప్రకటించేదెవరు
దానిని?
దాని జననమూలమేదో, ఈ సృష్టి యెక్కడినుంచి
యేర్పడిందో;

ఉగాది ప్రత్యేకం




ఈ లోకసృష్టి తరువాతే దేవతలు జన్మించారు;
అప్పుడిక ఇది యెలా ప్రభవించిందో
తెలిసేదెవరికి?

ఎవరికీ తెలియదు సృష్టి ఎక్కడ తలయెత్తిందో;
దీనిని 'తాను' రూపొందించాడో లేదో తెలియదు;
సర్వోన్నత స్వర్గం నుంచి సృష్టిని అవలోకించే
'ఆయనకి'
అది అవకాశవశాత్తు, తెలియవచ్చు, లేక
తెలియకపోవచ్చు.

*(Ananda Wood* రచించిన
*Interpreting the Upanishads*
చదువుతున్నప్పుడు తారసపడిన *Arthur A.Macdonell* ఇంగ్లీషు అనువాదం
*Naasadiya hymn of creation – Rig Veda 10.129* – చదివిన తరువాత,
అలవోకగా)

అనుసృజన : దేవిప్రియ
సెల్: **9866111874**

# వెట్టి

## (ది వారియర్)

-మధుబాబు




**'తొందరగా చెప్పు. సస్పెన్స్ మాటలు మాట్లాడి నన్ను కన్ఫ్యూజ్ చేయకు' విసుగు నిండిన కంఠంతో చాలా విసురుగా అన్నాడు శివారెడ్డి.**

**'ఇందులో సస్పెన్స్ ఏముంది సారూ! పూజ చేయించటానికని వెళ్ళి ఏమయిపోయానో తెలియని నన్ను వెతకటం కోసమే వచ్చారు బాజిరెడ్డి సారు' క్లుప్తంగా చెప్పాడు వెట్టి.**

**'మరి ఈ కారును దొంగిలించటమనే మాటకి అర్థం ఏమిటి?' ఈసారి అయోమయానికి గురవటం శివారెడ్డి వంతయింది.**

'అడవిదారి. అర్ధరాత్రి సమయం. పగలంతా ఎండవేడికి కమిలిపోయిన చెట్లు, వాతావరణం చల్లబడగానే తమ ఆకుల్లో ఇమిడి ఉన్న రకరకాల వాయువుల్ని బయటికి వదిలే టైము. మత్తును కలిగించే వాసనలు, మతిని భ్రమింపచేసే గాలులు – మహా చికాకుగా ఉంటుంది. అందుకే చీకటి సమయాల్లో అడవుల్లోకి పోవటం మంచిదికాదని అంటుంటారు అందరూ. బాజిరెడ్డి సారుకి కూడా అనుభవం అయిందని నాకు అనిపిస్తోంది' కనురెప్ప కూడా కదిలించకుండా చెప్పాడు వెట్టి.

అతను బాజిరెడ్డిని ఆట పట్టిస్తున్నాడనే సంగతి అర్థమైపోయింది అందరికీ. శివారెడ్డికి కూడా తెలిసిపోయినట్లుంది... ఎప్పుడు చూసినా సీరియస్‌గా ఉండే అతని ముఖం మీద ఒక్కసారిగా ప్రత్యక్షమైంది చక్కటి వెలుగు.

'సరేసరే... నాకు అర్థం అయింది' అంటూ సంపంగి వైపు చూశాడు.

'బాజిరెడ్డి సారుకు మంచి టీ తీసుకొచ్చి ఇవ్వు..' అన్నాడు. 'శంకరయ్యగారు, కూర్చో పెట్టండి బాజిరెడ్డిని, నిలబడనీయకండి' అని ఆర్డర్ ఇచ్చాడు.

దూరంగా ఉన్న ఒక కుర్చీని గబగబా బాజిరెడ్డి దగ్గరికి జరపబోతున్న శంకరయ్య వైపు మహా క్రూరంగా చూశాడు బాజిరెడ్డి.

'నాకు మర్యాదలు ఎవరూ చేయవలసిన అవసరం లేదు. ముందు నేను శివారెడ్డితో అర్జంటుగా మాట్లాడవలసిన మాటలు ఉన్నాయి. బయటికి పొండి' అన్నాడు కోపంగా.

'బాజిరెడ్డి... ఏం మాట్లాడుతున్నావో బాగా ఆలోచించుకుని మాట్లాడు. ఆవేశం ఉండటం మంచిదే. కాని అది అన్ని సమయాల్లోనూ పనికిరాదు' ఉన్నట్లుండి నొసలు విరుస్తూ అన్నది పిచ్చమ్మి.

అతన్ని అయోమయానికి గురిచేయాలనుకున్న తన ఆలోచన సక్సెస్ అయినట్టు అర్థం అయిపోయింది వెట్టికి. ఇక తాను అక్కడ ఉండటం అనవసరమని కూడా తెలిసిపోయింది.

'అడవిలో నడిచి నడిచి నా కాళ్ళు ఎందుకూ పనికిరాకుండా పోయాయి. నేను పోయి కాస్తంత రిలాక్స్ అవుతాను' అంటూ ఆ గదిలో నుంచి బయటికి వచ్చేశాడు, శివారెడ్డి పర్మిషన్ కోసం ఎదురు చూడకుండా.

అతని వెనుకే తను కూడా గదిలోంచి బయటికి వచ్చింది ప్రణవి. ఆమెతో పాటు ప్రత్యూష వచ్చింది. ఆమె వెనుకే శంకరయ్య వచ్చేశాడు. శంకరయ్య వెనుకే ప్రత్యక్షం అయింది పిచ్చమ్మి.

'అయ్యయ్యో... మీరందరూ రాకూడదు. మీరు అక్కడే ఉండాలి. బాజిరెడ్డి చెప్పేది ఏమిటో మీకందరికీ తెలియాలి' అంటూ వారందర్నీ తిరిగి లోపలికి పంపేందుకు శక్తివంచన లేకుండా ప్రయత్నం చేశాడతను.

'మాకు బాజిరెడ్డి మాటల కంటే, నీ మాటలే చాలా ముఖ్యం. అసలు ఆ అడివిలో ఏం జరిగిందో మాకు తెలియాలి' అతన్ని తమ గదులవైపు నడవమని కనులతోనే సూచిస్తూ చెప్పింది ప్రణవి.

ఆమెను అడ్డుకునేందుకు వీలుపడలేదు వెట్టికి. పిచ్చమ్మి తనకు సహాయంగా మాట్లాడుతుందనుకున్న అతని ఆలోచన దారుణంగా తప్పిపోయింది.

'ముందు నువ్వు ప్రణవి చెప్పినట్టు చెయ్యి' సీరియస్‌గా ముఖం పెడుతూ ఖచ్చితంగా చెప్పింది.

అప్పుడు ఆమె అంత ఖచ్చితంగా మాట్లాడినప్పుడు తేరిపార చూశాడు వెట్టి ఆమె ముఖం



# పంచకర్మ చికిత్సలతోనే సొరియాసిస్ పరిసమాప్తం




**డాక్టర్ బి. బాలాజీ** ఎం.డి(ఆయుర్వేద)
పంచకర్మ వైద్యనిపుణులు
**డాక్టర్ బి. శ్రావ్య** బి.ఎ.ఎం.ఎస్(యుహెచ్ఎస్)
**డాక్టర్ బాలాజీ సొరియాసిస్ అండ్ ఇన్‌ఫెర్టిలిటీ హాస్పిటల్స్**
బ్రాంచీలు : కూకట్‌పల్లి, అమీర్‌పేట్, హన్మకొండ, నిజామాబాద్,మహబూబ్‌నగర్
ఫోన్స్ : 8886 111151, 8886 111152, 8886 111153


**సొరియాసిస్** రావడానికి శరీరంలో పేరుకుపోయిన వ్యర్థ పదార్థాలే కదా అసలు కారణం. చలికాలం స్వేదరంధ్రాలు మూసుకుపోయి, ఆ వ్యర్థ, విషపదార్థాలు మామూలుగా కన్నా శరీరంలో పదిరెట్లకు పెరిగిపోతాయి. ఎన్నిసార్లు స్నానం చేసినా పైపైని చర్మం శుభ్రం అవుతుందే గానీ, లోపలున్న వ్యర్థాలు తొలగిపోవు కదా! అందుకే ఆయుర్వేదం సూచించిన అద్భుత మార్గం పంచకర్మ చికిత్సలు. అయితే, సొరియాసిసిస్ నుంచి సంపూర్ణంగా విముక్తి పొందాలనుకునే వారికి పంచకర్మ చికిత్సలకు మించిన వైద్యమే లేద నేది పరమ వాస్తవం.

అటు వాతావరణంలోనూ, ఇటు ఆహారపదార్థాల్లోనూ కలుషిత అంశాలే కదా మనకు కనపడుతోంది. ఈ వ్యర్థాలు, విషపదార్థాలు శరీరంలో నిరంతరం చేరిపోతుంటే, ఆ శరీరం ఎన్నాళ్లని తట్టుకుంటుంది? కొన్నాళ్లు భరించినా, ఏదో ఒ క రోజున తీవ్రంగా వ్యాధిగ్రస్తమవుతుంది. అ లాంటి వ్యాధుల్లో అత్యంత తీవ్రమైనది సొరియాసిస్ ఆధునిక వైద్యాలు వ్యాధిని అణచివేయడం నేర్చుకున్నంతగా, వ్యాధి మూలాల్ని తొలగించడం నేర్చుకోలేదు. అందుకే చాలా రకాల వ్యాధులకు వాళ్లు జీవితకాలమంతా చికిత్సలు చేస్తూనే ఉంటారు. మన శరీరం పలుకారణాలతో నిత్యం విషతుల్యం అవుతూనే ఉంటుందనే విషయాన్ని వాళ్లింకా గ్రహించలేకపోతున్నారు, ఆహార పానీయాలైతేనేమి, శరీరం నిరంతరం వ్యర్థపదార్థాల నిలయంగా మారుతూ ఉంటుంది, లోపలున్న విషపదార్థాలను తొలగించకుం డా, ఎన్నేళ్లు మందులిస్తే మాత్రం వ్యాధి తగ్గుతుందా? సొరియాసిస్ రావడానికి వ్యర్థ విషపదార్థాలే అసలు కారణమైనప్పుడు వాటిని తొలగించకుండా ఇంకేంచేస్తారు?



## శరీరంలో ఏమవుతుంది?

మానవ శరీరం త్రిదోషాలతో నిర్మితమైన ది. సొరియాసిస్ సాధారణంగా వర్షాకాలం మొదల వుతుంది. చలికాలంలో తీవ్రమవుతుంది. వర్షాకాలంలో ప్రత్యేకించి త్రిదోషాలు మరింతగా ప్రకోపితమవుతాయి. ముందు వాతం ఒక్కటే ప్రకోపిస్తుంది. ఆ తరువాత పిత్త, కఫాలు కూడా ఆ ప్రభావానికి లోనవుతాయి. దీనికి తోడు వర్షం భూమి మీద పడగానే పంచభూతాల్లోని భూమి తన సహజమైన ధ ర్మాన్నీ, గుణాన్నీ కోల్పోతుంది. దీని పరిణామంగా మానవ శరీరంలో ప్రధానంగా కఫ ప్రకోపం కూడా జరుగుతుంది. భూమికీ కఫానికీ సంబంధం ఉండడమే ఇందుకు కారణం. ఈ క్రమంలో ఒక్కొక్కటిగా వాత, పిత్త, కఫాలు మూడూ సమస్థితిని కోల్పోతాయి. ఒక రుతువు వెళ్లిపోతూ, మరో రుతువు ప్రారంభమయ్యే రుతుసంధిలో సర్దుబాటు చేసుకోవడానికి శరీరంలో కొన్ని మార్పులు చోటుచేసుకుంటాయి. ఈ మార్పు సమయంలో శరీరం తీవ్రమైన ఒత్తిడికి లోనవుతుంది. ఈ పరిణామమే చలికాలం సొరియాసిస్ పెరగడానికి మరో కారణమవుతుంది. ఈ స్థితిలో శరీరంలోని పంచభూతాలు, త్రిదోషాలు తమ సమస్థితిని కోల్పోతాయి. ఇవన్నీ కలిసి శరీరంలో వ్యాధి నిరోధక శక్తి తగ్గడానికి దారి తీస్తాయి. ఫలితంగా సొరియాసిస్ తీవ్రమవుతుంది. అందుకే రుతు సంధి కాలంలో వ్యాధినిరోధక శక్తిని పెంచే ఆహారపానీయాలు, ఔషధ ద్రవ్యాలు తీసుకోవాలని ఆయుర్వేదం నొక్కి చెబుతూ ఉంటుంది. వ్యాధిగ్రస్తులు ఏటా రెండు సార్లు పంచకర్మ చికిత్సలు తీసుకుంటే రుతు సంధికాలంలో ఎదురయ్యే ఒత్తిళ్లను అధిగమిస్తూ శరీరం వ్యాధి ప్రకోప అవస్థలకు గురికాకుండా నిలకడగా, ఉంటుంది. ఆరోగ్యవంతులే అయితే ఏటా ఒకసారి చేయించుకుని మునుముందు కాలంలో ఏ రోగమూ దరిచేరకుండా చూసుకోవచ్చు.

## వ్యాధి నిరోధక శక్తి కొరవడితే...

శరీరమంతా వ్యర్థాలతో నిండిపోతే, ఇంక వ్యాధినిరోధక శక్తి ఎక్కడ ఉంటుంది? ఈ విషపదార్థాలతో ఇప్పుడు వచ్చిన సమస్య సొరియాసిసే కావచ్చు. కానీ, సమస్య అంతటితో ఆగిపోతుందా? అంటే లేదు. సాధ్యమైనంత త్వరగా వ్యర్థాలను తొలగించకపోతే ఆ వ్యర్థాలు మరెన్నో వ్యాధులకు మూలం కావచ్చు. అలా అని కేవలం ఆ వ్యర్థాలను తొలగించడంతోనే అంతా అయిపోదు. అ వెనువెంటనే, వ్యాధినిరోధక శక్తిని పెంచే రసాయన, వాజీకరణ చికిత్సలు అవసరమవుతాయి. ఈ చికిత్సలతో సొరియాసిస్ కారణంగా దెబ్బ తిన్న సప్తధాతువులూ పూర్వశక్తిని పుంజుకుంటాయి.

## పంచకర్మ చికిత్సలు తప్పనిసరి

సొరియాసిస్ వర్షాకాలం ఆరంభమవుతుంది కాబట్టి వ్యాధి ఇంకా ముదరక ముందే అంటే వర్షాకాలం ముగిసిపోవడానికి, చలికాలం ప్రారంభం కావడానికి మధ్య ఉండే రుతుసంధిలోనే పంచకర్మ చికిత్సలు తీసుకుంటే ఎంతో మేలు. పంచకర్మ చికి త్సల్లో ప్రత్యేకించి వమన, విరేచన చికిత్సలు మరింత ప్రధానమవుతాయి. వీటివల్ల చర్మం ఎండిపోవడం ఆగిపోతుంది. వ్యాధి కూడా మూలాల్లోంచి తొలగించ బడుతుంది. చలికాలం దాకా వేచి చూస్తూ సొరియాసిస్ తీవ్రమయ్యాక ఆ తీవ్రమైన అవ స్థలతో సతమతం కాకుండా, చలికాలం కన్నా ముందే పంచకర్మ చికిత్సలు తీసుకుంటే సమస్యలోకి జారిపోకముందే సమస్యనుంచి దూరం కావచ్చు. అప్పటికి సొరియాసిస్ తీవ్రమైన వారు పంచకర్మల ద్వారా వేగంగా విముక్తిపొందవచ్చు. ఏటా రెండు సార్లు పంచకర్మ చికిత్సలు తీసుకోవడం వల్ల జీవితంలో మరోసారి సొరియాసిస్ రాకుండా కాపాడుకోవచ్చు.

## వైద్యంలో అనుభవమే ప్రమాణం

వర్షాకాలానికి ముందు చలికాలం చివరన పంచకర్మ చికిత్సలు తీసుకోవడం అన్ని విధాలా సురక్షితం. ఇలా తీసుకోవడం వల్ల మునుముందు సొరియాసిస్ రాదు. పంచకర్మ చికిత్సల తరువాత నిర్లక్ష్యం చేయకుండా ఒక ఏడాది పాటు కడుపులోకి ఔషధ ద్రవ్యాలు తీసుకోవడం వల్ల సొరియాసిస్ శాశ్వతంగా తొలగిపోతుంది.

కేసి. చూసిన మరుక్షణం తెలిసిపోయింది అతనికి... ఆమెలో వచ్చిన మార్పు. విపరీతమైన సంతోషంతో గుండెలు నిండిపోయినట్లు అయింది అతనికి.

ప్రణవి ఇంకోసారి తమ గదులకేసి తల ఊపక ముందే, పెద్దపెద్ద అడుగులతో అటుకేసి పోయాడు. పిచ్చమ్మి ఒక కుర్చీలో చేరగిలబడి కూర్చున్న తరువాత తను ఇంకో కుర్చీలో కూర్చున్నాడు. తను తెల్లవారకముందే బుల్లెట్ బండి మీద అక్కడినుంచి బయలుదేరినప్పటి నుంచీ మొదలుపెట్టి, తిరిగి అక్కడికి వచ్చినంత వరకూ జరిగిన సంఘటనల్ని వివరంగా చెప్పటం మొదలు పెట్టాడు, చౌడేశ్వరి ఆత్మశిలకు సంబంధించిన వాటిని ఒమిట్ చేసి.

***

'ఓ... అందుకా నువ్వు అర్ధరాత్రి సమయంలో అటుకేసి వెళ్ళింది. ఇప్పుడు నాకు అర్థం అయింది' బెడ్ తలవైపున ఉన్న మెత్తటి దిండుకు ఆనుకుని కూర్చుంటూ అన్నాడు శివారెడ్డి.

'అవును.. నువ్వు వెంటనే సబ్బిరెడ్డికి ఫోను చేసి చెప్పాలి. అతను చింతలపల్లి నుంచి బయలుదేరకముందే పఠాన్‌ని వదిలేయాలి. హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకుపోతే మాటలతో పని జరగదు' చెప్పాడు బాజిరెడ్డి.

'సబ్బిరెడ్డి మహా మొండిఘటం. నా మాటను లెక్కచేయడు. అమ్మచెపితే వెంటనే తల ఊపేస్తాడు' అన్నాడు శివారెడ్డి.

'అయితే అమ్మతోనే చెప్పించు!' అన్నాడు బాజిరెడ్డి.

'అమ్మ కూడా మొండిఘటమే. తను మన మాటను వినిపించుకోదు' అన్నాడు శివారెడ్డి.

'అదంతా నాకు అనవసరం. నా పని జరిగితీరాలి. జరగకపోతే ఏం జరుగుతుందో బయటికి పదిసార్లు నా నోటితో చెప్పించకు. అది మంచిది కాదు' ముఖం ముడుచుకుంటూ చెప్పాడు బాజిరెడ్డి.

ప్లెజెంట్‌గా ఉన్న శివారెడ్డి ముఖం ఒక్కసారిగా వివర్ణమైంది. పక్కనే ఉన్న అతని భార్యకు స్పష్టంగానే కనిపించింది, అతని కళ్ళు స్వల్పంగా తడి అవుతున్న సంగతి.

'ఏం జరుగుతోంది బాజిరెడ్డి సారూ? ఎవరితో మాట్లాడుతున్నావో నీకు తెలుస్తోందా? ఒంట్లో బాగోలేని మనిషిని బెదిరింపులతో భయపెట్టటం పెద్ద గొప్పతనమని అనుకుంటున్నావా?' అని స్పీడ్‌గా మాట్లాడబోతున్న ఆమెను, తల అడ్డం తిప్పి మొదట్లోనే ఆపేశాడు శివారెడ్డి.

ఆగటం అయితే ఆగింది గాని, తన అసహనాన్ని మాత్రం అణుచుకోలేకపోయింది ఆమె.

'నువ్వు, నీ కొడుకు చేస్తున్న పాడు పనులకు మమ్మల్ని అడ్డం పెట్టుకోవాలని అనుకోవటం మహా దుర్మార్గం. అసలు అటువంటి పనులు చేసే ఆ నికృష్టుడికి మా బిడ్డనిచ్చి పెళ్ళి చేయమని అడగటం ఇంకా ఇంకా పెద్ద దుర్మార్గం. పదిమందికీ తెలిస్తే మా పరువులు ఏమైపోతాయో నువ్వు ఆలోచించటం లేదు' విసురుగా అన్నది.

'నేను అడిగిన పని చేయకపోతే అసలు పరువు అనేది ఉండనే ఉండదు మీకు. ఈ ఎస్టేట్‌ని వదిలి దూరంగా పారిపోయే గతి పడుతుంది. ముందు సబ్బిరెడ్డికి ఫోన్ చేసి చెప్పండి' కటువుగా అన్నాడు బాజిరెడ్డి.

ఆ గదిలో దూరంగా నిలబడి ఉన్న డాక్టరు వైపు, డ్యూటీ నర్సు వైపు ఒకసారి చూసి గాఢంగా నిట్టూర్చాడు శివారెడ్డి.

వారిద్దరినీ బయటికి పంపిన తర్వాత మాటలు మొదలు పెట్టవలసిన బాజిరెడ్డి, అసలు వాళ్ళు అక్కడ ఉన్నారనే మాటను మర్చిపోయినట్టు, నోటికి వచ్చినట్టు వార్నింగులు ఇచ్చాడంటే పరిస్థితి చాలా సీరియస్‌గా ఉన్నట్టు లెక్క.

'రాజీ..' అంటూ భార్య వైపు చూశాడు అతను, 'వెళ్ళి అమ్మకు చెప్పు' అన్నాడు.

నొసలు ముడివేసి చూస్తున్న బాజిరెడ్డి ముఖం నవ్వులమయం అయిపోయింది. 'నేను ఇంటికి పోతున్నాను. అరగంటలో తిరిగి ఫోన్ చేస్తాను. ఈ లోపల సబ్బిరెడ్డి దగ్గర పని పూర్తి అయిపోవాలి' అంటూ వెనుదిరిగి గది బయటికి వెళ్ళిపోయాడు.

దిండును ఆనుకుని కూర్చున్న శివారెడ్డి తన శరీరంలోని శక్తి అంతా హరించుకు పోయినట్టు ఇంకా ఇంకా వెనక్కి వాలిపోయాడు. అది చూసి వేగంగా ముందుకు వచ్చిన డాక్టర్‌ని, నర్సుని చెయ్యెత్తి దూరంగా నిలబెట్టేసింది శివారెడ్డి భార్య.

'ఇప్పుడు ఇక్కడ జరిగిన సంభాషణ అంతా మీకు అర్థమయి ఉంటుంది' అన్నది. తలలు ఊపారు వారిద్దరూ.

'ఒక్క ముక్క కూడా బయటికి పొక్కకూడదు.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. తన పెత్తనాన్ని సవాలు చేసిన వెట్టిని అంతమొందించాలనుకుంటాడు బాజిరెడ్డి. రాయుడిపల్లిలో చౌడేశ్వరికి జరిగిన అపచారమేమిటో తెలుసుకున్న వెట్టి, అడ్డదారి గుండా కదిరి బయలుదేరతాడు. దారిలో అతడికి చౌడేశ్వరి ఆత్మశిల కనిపిస్తుంది. దాంతో పాటు అడవిలో పఠాన్ తారసపడతాడు. అతణ్ణి అరెస్ట్ చేయిస్తాడు. పిచ్చిపూజారికి ఆత్మశిల గురించి చెప్పి, ఎవరికీ తెలియకుండా ఆ తల్లిని యథాస్థానంలో ఎలా ప్రతిష్ఠించాలో ఆలోచించమంటాడు. పఠాన్‌ని విడిచి పెట్టేందుకు ససేమిరా అంటాడు సబ్బిరెడ్డి. దాంతో వెనుదిరుగుతాడు బాజిరెడ్డి. దారిలో వెట్టి అతడి కారెక్కుతాడు. అతన్ని చంపటానికి ప్రయత్నించిన బాజిరెడ్డి నుంచి తప్పించుకుని, కదిరి చేరతాడు వెట్టి.

ఆ తర్వాత....

బయట ఎవరైనా ఈ విషయాలు మాట్లాడుకోవటం జరిగితే, అందుకు మీరే బాధ్యులు అవుతారు' అన్నది ఆమె.

'తల్లీ... మేము ఏమీ వినలేదు. మా నుంచి ఎటువంటి మాట బయటికి పోదు' ఒకేసారి చెప్పారు వారిద్దరూ.

'రాజీ, ముందు నువ్వు అమ్మతో...' జీవం లేనట్టు ధ్వనిస్తున్న కంఠంతో శివారెడ్డి హెచ్చరించే సరికి వేగంగా గది బయటికి నడిచింది ఆమె.

***

గ్లాసునిండా మందు పోయించుకుని, చేతిలో పట్టుకుని, తన టేబుల్ ముందు కూర్చున్నాడు బాజిరెడ్డి. గ్లాసును పెదవులకు ఆనించుకోక ముందే మోగింది అతని ఫోను.

'ఎవర్రా? ఎవరు?' కోపంగా అంటూ గ్లాసును కిందపెట్టి దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు.

'సంపంగి చేస్తోంది సారూ...' వెనుక నుంచి తను కూడా ఫోన్ వంక చూసి హెచ్చరించాడు అతని డ్రైవర్.

'ఏంటేః ఏంటి సంగతి? వాళ్ళు ఫోన్లు చేశారా? చేయలేదా?' విసురుగా అడిగాడు బాజిరెడ్డి.

'అయ్యగారూ... అందరూ మల్లగుల్లాలు పడుతున్నారు. పిచ్చమ్మి ససేమిరా అంటోంది. శివారెడ్డి పెళ్ళాం బతిమాలుకుంటోంది' వినవచ్చింది సంపంగి గొంతు.

'బతిమాలినా, కాళ్ళు పట్టుకున్నా మనకి అనవసరం. ముందు మన పని అయిపోవాలి. నువ్వు జాగ్రత్తగా చూస్తూ ఉండు' అన్నాడు బాజిరెడ్డి.

'అయ్యగారూ... నాకు ఏదో అనుమానంగా ఉంది. నేను మీ మనిషినని ఇక్కడ అందరికీ అనుమానం వచ్చినట్టు అనిపిస్తోంది. శివారెడ్డి పెళ్ళాం కూడా వేరే విధంగా మాట్లాడుతోంది నాతో' అన్నది సంపంగి.

'మరేం ఫరవాలేదు. మన పని అయిపోయిన తర్వాత నిలబెట్టి కడిగేద్దాం. నువ్వు భయ పడాల్సిన పని లేదు' అన్నాడు బాజిరెడ్డి.

'ఉంటానయ్యా... కుడితి తాగినట్టు అందరూ



## సైనస్ సమస్య మళ్లీ రాదు

**ముక్కు** కళ్ల చుట్టూ నాలుగు గదులుంటాయి. వాటిని సైనస్‌లు అంటారు. ఈ సైనస్‌లలో వైరల్, బాక్టీరియా, ఫంగల్ ఇన్‌ఫెక్షన్ కారణంగా విపరీతమైన నొప్పి పుడితే దాన్ని సైనసైటిస్ అంటారు.

**కారణాలు :** సైనస్ ముఖద్వారం మూసుకుపోతుంది లేదా అక్కడ చాలా మ్యూకస్ పేరుకుపోతుంది. ఫలితంగా అక్కడ బాక్టీరియా, ఇతర క్రిములు సులభంగా పెరిగి సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. శ్వాసకోశ మార్గానికి ఇన్‌ఫెక్షన్ రావటం వల్ల సైనస్‌లకు బాక్టీరియా ఇన్‌ఫెక్షన్ వస్తుంది. ఫలితంగా సైనసైటిస్ మొదలవుతుంది.

**గుర్తించటం సులభం :** తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తల అంతా బరువుగా ఉంటుంది. ఆ పైన ముక్కు నుంచి పసుపు పచ్చని, ఆకుపచ్చని ద్రవాలు రావడం మొదలవుతుంది. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది. ముఖంలో వాపు కనిపిస్తుంది. గొంతు మంటగా, నోరంతా చేదుగా మారుతుంది.

**సర్జరీ అవసరం లేదు :** హోమియోపతి చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్సతో సమస్య సమూలంగా తొలగిపోతుంది.

## హెపటైటిస్, హెర్పిస్‌కు చెక్ సాధ్యమే

**హెపటైటిస్** వైరస్ ఎప్పుడైతే కాలేయంపై దాడి చేస్తుందో అప్పుడు లక్షణాలు బయటపడతాయి. అంతవరకు ఇది సోకిన విషయం తెలియదు. హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్లు పడుతుంది. కొంతమందిలో వైరస్ సోకిన 4 వారాలు లేదా 12 వారాల తరువాత కొన్ని రోగలక్షణాలు బయటపడతాయి. ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి. వ్యాధి నిర్ధారణ కోసం హెపటైటిస్-బి(హెచ్‌బిఎస్ ఏజి) పరీక్ష చేయించాలి. హెపటైటిస్-బి ఉన్న కొందరిలో లివర్ ఫెయిల్యూర్‌కు దారితీస్తుంది. కొన్ని ఏళ్ల నుంచి వైరస్ ఉన్నవారిలో కాలేయం క్రమంగా దెబ్బతింటూ లివర్ సిర్రోసిస్‌కు దారితీయవచ్చు లేక లివర్ క్యాన్సర్‌గా మారవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలిపుండు పడుతుంది. ఈసమయంలో చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు. స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి నొప్పిని కలిగిస్తాయి.

**హోమియో చికిత్స :** హెపటైటిస్ బి, సి వ్యాధులను సమర్ధవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది.

**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106
V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 3:30కి డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



## కిడ్నీలో రాళ్లకు ఆపరేషన్ ఎందుకు?

**ఏ** పనైనా సాఫీగా జరుగుతున్నంత సేపు ఏ ఇబ్బంది ఉండదు. ఏదైనా ఆటంకం ఏర్పడినప్పుడే దాని ప్రభావం ఏస్థాయిలో ఉంటుందో అర్థమవుతుంది. మూత్రవిసర్జన విషయంలోనూ అంతే. కిడ్నీలో ఏర్పడిన రాళ్లు మూత్రనాళంలో అడ్డుపడితే ఆ బాధ చెప్పనలవికాదు.

**కారణాలు :** శరీరంలో తయారయ్యే మలిన పదార్థాలన్నీ మూత్రం ద్వారానే బయటకుపోతాయి. మలినాలన్నీ కరిగిన స్థితిలో మూత్రం ద్వారా బయటకు వెళితే ఏ సమస్యా ఉండదు. అలా కాకుండా మూత్రం విసర్జన సాఫీగా జరగకపోతే గాఢత పెరిగిపోయి మలినాలు రాళ్లుగా ఏర్పడతాయి. సాధారణంగా కిడ్నీ స్టోన్స్ రెండు రకాలుగా ఉంటాయి. ఒకటి కాల్షియం ఆక్సలేట్, యూరికాసిడ్. కొంతమందిలో మెటబాలిక్ సమస్య వల్ల కూడా రాళ్లు ఏర్పడతాయి.

**లక్షణాలు :** కిడ్నీలో ఏర్పడిన రాయి ఒక్కోసారి మూత్రనాళంలో అడ్డుపడుతుంది. ఫలితంగా కిడ్నీలో వాపు వస్తుంది. తీవ్రమైన నొప్పి, మూత్రంలో మంట, జ్వరం వంటి లక్షణాలు కనిపిస్తాయి. మూత్రంలో రక్తం కూడా రావచ్చు. మూత్రవిసర్జన సమయంలో తీవ్రమైన నొప్పి వస్తుంటుంది. నొప్పి వెనక నుంచి ముందుకు విస్తరిస్తూ ఉంటుంది.

**హోమియో వైద్యం :** ఆపరేషన్ కోసం పరిగెత్తకుండా హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా రాళ్లు సులభంగా తొలగిపోయేలా చూసుకోవచ్చు. మూత్రనాళంలో రాయి అడ్డుపడినట్లయితే హోమియో మందులు మూత్రనాళం వ్యాకోచం చెందేలా చేసి రాయి పడిపోయేలా చేస్తాయి. అంతేకాకుండా హోమియో మందులు శరీరతత్వాన్ని మార్చుతాయి. ఫలితంగా రాళ్లు తయారయ్యే అవకాశం తగ్గిపోతుంది. కిడ్నీలో రాయి ఉంది అనగానే గాభరా పడిపోకుండా అనుభవజ్ఞులైన హోమియో వైద్యున్ని సంప్రదిస్తే సమస్య ఇట్టే తొలగిపోతుంది.

## ఎసిడిటీని ఎన్నాళ్లు భరిస్తారు?

**ఎసిడిటీ, గ్యాస్ట్రైటిస్ :** జీవనశైలిలో మార్పులు అంటే సమయానికి భోజనం చేయకపోవడం, మసాలా, వేపుళ్లు ఎక్కువగా తీసుకోవడం, మాంసాహారం అధికంగా తినడం, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వంటివి గ్యాస్ట్రైటిస్ సమస్యకు కారణమవుతాయి.

**లక్షణాలు :** పుల్లటి తేన్పులు, వాంతులు, కడుపులో మంట, కడుపు ఉబ్బరం వంటి లక్షణాలుంటాయి. కొద్దిగా ఆహారం తీసుకున్నప్పటికీ పొట్ట నిండినట్లుగా అనిపించడం, ఆకలి లేకపోవడం, కారణం లేకుండానే బరువు తగ్గిపో తుండటం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** రోగి లక్షణాలు, శారీరకపరిస్థితిని పరిశీలించి మందులు ఇవ్వాల్సి ఉంటుంది. చికిత్స తీసుకోవడంతో పాటు జీవనశైలిలో మార్పులు చేసుకున్నట్లయితే మంచి ఫలితం ఉంటుంది. వేళకు భోజనం చేయడం, కారం, ఉప్పు, నూనె తగ్గించడం చేయాలి.

**అల్సర్స్(గ్యాస్ట్రిక్, పెప్టిక్) :** మ్యూకస్ మెంబ్రేన్ యందు పుండులాగా కావడాన్ని అల్సర్ అంటారు. అల్సర్ ఏ భాగంలో అయితే ఆ పేరుతో పిలుస్తారు. ఆహారవాహికలో ఉన్నట్లయితే ఒసియోఫేగల్ అల్సర్, జీర్ణకోశంలో ఉన్నట్లయితే గ్యాస్ట్రిక్ అల్సర్, చిన్న పేగు మొదటి భాగంలో ఉన్నట్లయితే డ్యుయోడినల్ అల్సర్ అని పిలుస్తారు.

**లక్షణాలు :** తినేముందు లేదా తిన్న తరువాత కడుపులో నొప్పి, కడుపు ఉబ్బరంగా ఉండటం, పుల్లటి తేన్పులు, తల తిరగడం, వాంతులు వంటి లక్షణాలు ఉంటాయి. వ్యాధి ముదిరినపుడు రక్తంతో కూడిన వాంతులు, భరించలేని కడుపునొప్పి, బరువు తగ్గిపోవడం జరుగుతుంది.

**చికిత్స :** అల్సర్‌ను సమూలంగా తొలగించే మందులు హోమియోలో ఉన్నాయి. ఆహారపు అలవాట్లు మార్చుకొని క్రమం తప్పకుండా మందులు వాడినట్లయితే సమస్యకు శాశ్వత పరిష్కారం లభిస్తుంది.

## ఉగాది ప్రత్యేకం




## సజీవ సౌందర్యం

కొందరుంటారు
సమీప దూరాల కాంక్షా రేఖల నడుమ
అప్రకటిత నిషేధాజ్ఞలకు లోబడి
ఆవృత వికారాలను ఒడుపుగా దాచుకుంటారు
సన్నివేశాలేవైనా మనుషుల మధ్య వేలాడే
మాయతెరల మోహాల మధ్య
ఆహార్యాలు లేని అభినయాలకు జీవం పోసేస్తారు

కలుసుకున్న చూపులు కత్తులు దూస్తున్నా
పెదాలపై మాత్రం ఏ గంధమూ లేని నవ్వులు
పూయిస్తుంటారు.
ఒక నమ్మకమైన అపనమ్మకంతో వారు
అవసరాలను అవకాశాలుగా మలుచుకుంటారు
వారం మసలిన చోటల్లా
అసహజ కృతక వాతావరణం!
ఇక మరికొందరుంటారు.



గుంపులు గుంపులుగా.. గుత్తులు గుత్తులుగా
బారులు బారులుగా మసలే
సమూహాల సందోహాలను ఇష్టపడతారు
బహువచనాలు సాకారమైన
సుందర దృశ్యాలను కాంక్షిస్తారు.
ఊపిరి తీసిన ప్రతిసారీ
ఇంత ప్రేమను నిశ్వసిస్తుంటారు
చర్చి ఆవరణలోనో.. ఆలయ ప్రాంగణంలోనో
సమైక్యంగా గింజలేరుకు తినే
పక్షుల గుంపుల్నించి స్ఫూర్తి పొందుతారు
పూల వనంలో వాత్సల్యపు తునకల్ని
ప్రేమగా పంచుకునే దృశ్యాలను
అపురూపంగా చూస్తారు
సమైక్య జీవన సౌందర్యానికి
సమానమేదీ లేదంటారు
తమ ఇంటి ముంగిట వాలే
స్నేహ కపోతాలకు కానుకివ్వడానికి
తాజా ఆలివ్ ఆకుల్ని సిద్ధంగా ఉంచుతారు.
నడిచే కాళ్ళకింది నేల మీది సరిహద్దుల్ని
ఒక్కటొక్కటిగా చెరుపుకుంటూ పోతారు
తన చుట్టూ తాను గుండ్రంగా తిరిగే భూమి
వారి ముందు సాగిలపడి సాష్టాంగ ప్రమాణం చేస్తుంది.

**–శారదా ఆవాల**
**సెల్: 92959 01447**

అదేపనిగా టీలు తాగుతున్నారు. అరగంటకి ఒక సారి ఈళ్ళందరికీ టీలు పెట్టి ఇచ్చేసరికి నా చేతులు చచ్చుపడినట్టు తయారయి పోతున్నాయ్, ఉంటాను' అంటూ కనెక్షన్ కట్ చేయబోయి 'అయ్యగారూ, ఒక్క నిమిషం.. ఒక్క నిమిషం' అంటూ మాటల్ని పొడిగించింది సంపంగి.

'ఏమిటే అది? ఏమయింది అక్కడ? శివారెడ్డి పెళ్ళాం కూడా విరుచుకుపడిపోయిందా? హార్ట్ ఎటాక్ ఏమైనా వచ్చిందా?' విసుగ్గా అడిగాడు బాజిరెడ్డి.

'అదేమి కాదయ్యా... అందరూ కలిసి ఆ వెట్టి గాడి వైపు చూస్తున్నారు. ఆడు పిచ్చమ్మితో ఏదో మాట్లాడుతున్నాడు. విసిరి కొట్టకుండా నోరు మూసుకుని వింటోంది ఈవిడ..' ఎగ్జయిట్ అయిపోతున్నట్టు చెప్పింది సంపంగి.

'ఓరినీ... ఆడు ఎవడోగాని మనకి శనిదేవుడి మాదిరి వచ్చి కూర్చున్నాడు' అన్నాడు బాజిరెడ్డి.

'అదేమీకాదు సారు.. ఇప్పుడు వాడి మూలకంగానే మన పని అయిపోతుంటే శనిదేవుడు ఎలా అవుతాడు?' వెంటనే అడిగాడు వెనుక ఉన్న డ్రైవర్.

'ఒక మంచి జరిగిందని చెప్పి, మొత్తం జీవితమంతా మంచే జరుగుతుందని అనుకోవటం ఎలా? వాడి అంతు చూడకపోతే ఎలా కుదురుతుంది?' కోపంగా అన్నాడు బాజిరెడ్డి.

మాటలు పొడిగిస్తే తప్పంతా తన మీదనే పడిపోతుందని అర్థమై గబగబా తల ఊపేశాడు డ్రైవర్.

ఇప్పుడు వాడు ఆ పిచ్చిమొఖాన్ని సమాధాన పరిచేందుకు ఆగుదాము. ముందు మన పఠాన్‌బాబు బయటికి రావాలి. వచ్చిన వెంటనే పెళ్ళి జరిగిపోవాలి. ఆ పని పూర్తి అయిన వెంటనే పెళ్ళిపందిట్లోనే వాడి తల తెగి కింద పడిపోవాలి' అన్నాడు.

'సంపంగీ.. సంపంగీ" పిలిచాడు ఫోన్లో బాజిరెడ్డి.

'నేను వింటూనే ఉన్నాను, చెప్పండయ్యా' అన్నది సంపంగి.

'ఏం జరుగుతోంది అక్కడ?' అడిగాడు బాజిరెడ్డి.

'వాడు ఆ వెట్టిగాడు ఇంకా మాట్లాడుతూనే–' అంటూ అదిరిపడినట్టు మాట ఆపేసి, 'ఆ గుడ్లగూబ వచ్చేస్తోంది. ఉంటానయ్యా' అంటూ డిస్కనెక్ట్ చేసేసింది సంపంగి.

మౌనం వహించిన ఫోన్‌ని టేబుల్ మీదికి విసురుతూ డ్రైవర్ వైపు చూశాడు బాజిరెడ్డి.

'నన్ను వెళ్ళి ఏం జరుగుతోందో చూసి రమ్మంటారా?' అడిగాడు అతను.

తల అడ్డం తిప్పాడు బాజిరెడ్డి. 'నువ్వు చింతలపల్లి వెళ్ళి పఠాన్‌బాబుని వెంటబెట్టుకు రావాలి. పోయి ఆ పని మీద ఉండు' అన్నాడు. తను అనుకున్న పని అనుకున్నట్టే అక్షరాలా జరిగి తీరుతుందన్న నమ్మకం ధ్వనిస్తోంది ఆ మాటల్లో. తల ఊపి బయటికి పోయాడు డ్రైవర్.

***

'వాడు బయటికి వస్తే, వచ్చిన వెంటనే పెళ్ళి జరిపించేయమంటాడు బాజిరెడ్డి. వాడి సంగతి నీకు తెలియదు. వాడు వట్టి జలగ' వెట్టి చెప్పిన మాటలన్నిటినీ శ్రద్ధగా ఆలకించి, అతి ప్రశాంతంగా అన్నది పిచ్చమ్మి.

'పదిరోజులు... కేవలం పది రోజులు ఏదో విధంగా వాయిదా పడేటట్టు చూసుకోగలిగితే, బాజిరెడ్డి పొగరు దిగిపోతుంది. వాడు శివారెడ్డి సారును ఏం చేయలేడు. ఏ విధంగానూ బెదిరించలేడు' నిర్మొహమాటంగా చెప్పాడు వెట్టి.

'అంత నమ్మకంగా చెపుతున్నావు. వాడు బెదిరిస్తున్నది ఏ విషయం గురించో నీకు తెలుసా?' అడిగింది పిచ్చమ్మి.

తను అక్కడి నుంచి చౌడేశ్వరి గుడి దగ్గరికి బయలుదేరి, తిరిగి వచ్చిన క్షణం వరకూ జరిగిన సంఘటనలన్నిటినీ చెప్పాడు వెట్టి. ఆ తల్లికి సంబంధించిన మాటలేవీ చెప్పలేదు. పిచ్చిపూజారి గురించి, బండోడి నాయన గురించి చెప్పలేదు.

'నా మీద నమ్మకం ఉంచండి. సమయం వచ్చినప్పుడు రహస్యాలన్నీ వాటంతట అవే బట్టబయలు అయిపోతాయి. పది రోజులు... పదంటే పది రోజులు మనం ఓపిక పట్టాలి. అంతే' అన్నాడు ఇప్పుడు.

'సబ్బిరెడ్డి మన మాట వింటాడా?' మొదటిసారిగా తన అనుమానాన్ని వెల్లడించింది పిచ్చమ్మి.

'ప్రయత్నం చేసి చూడండి తల్లీ. వినకపోతే మనం చేయగలిగింది ఏదో చేసేద్దాము' అన్నాడు వెట్టి.

ప్రత్యూష వైపు తిరిగింది పిచ్చమ్మి. గుమ్మం చాటున నిలబడి ఉన్న సంపంగి దగ్గరికి పోయి వేడి వేడి టీలు పెట్టించి, తను దగ్గర ఉండి తీసుకు వచ్చింది ప్రత్యూష.

**సబ్బిరెడ్డికి ఫోన్ చేసి పఠాన్‌ని వదిలిపెట్టమని చెప్పింది పిచ్చమ్మి. ససేమిరా అన్నాడతను. హెడ్‌క్వార్టర్స్‌కు తీసుకుపోవాల్సిందేనన్నాడు. అన్నివిధాలా నచ్చచెప్పింది. ఇక లాభం లేదనుకుని ఫోను వెట్టికిచ్చింది. ఫోనులో వెట్టి చెప్పిన మాటలు అతణ్ణి ఆలోచనలో పడేశాయి. మరి సబ్బిరెడ్డి పఠాన్‌ని విడిచిపెట్టాడా? లేదా?**

'అక్కడ పెట్టి నువ్వు వంటపని చూడు. తలుపుల చాటున, గోడల పక్కన నిలబడి మా మాటలు వినే ప్రయత్నాలు చేయకు. నీ గురించి ఎవరూ మాట్లాడుకోవటం లేదు ఇక్కడ' డైరెక్టుగా చెప్పేసింది.

చింతాకంత అయిపోయింది సంపంగి ముఖం. తల వంచుకుని విసవిసా వెళ్ళిపోయింది వంట

# హెర్పిస్ ఛాయలే ఉండవు

**ఒక** గుండు సూది గుండుమీద కోటి వైరస్‌ల దాకా ఇమిడిపోయేంత సూక్ష్మమైన వైరస్ ఇది. జీవింతాంతం బాధించే ఈ వైరస్‌ను హెర్పిస్ సింప్లెక్స్ వైరస్ అని అంటారు.

### రెండు రకాలు

హెచ్ఎస్‌వి 1 : ఇది నోటి దగ్గర పొక్కులరూపంలో బయటపడుతుంది. పెదవుల చుట్టూ తెల్లని నీటిపొక్కులలాగా కనిపిస్తుంది. ఇది ముఖ్యంగా తల్లిదండ్రులు, తోటి పిల్లల నుంచి వ్యాపిస్తుంది. ఎక్కువగా పిల్లలలో కనిపిస్తుంది. సాధారణంగా ఇవి వచ్చిపోతూ ఉంటాయి.

హెచ్ఎస్‌వి 2 : జననావయవాల దగ్గర పొక్కులతో బయటపడుతుంది. దీన్ని జెనిటల్ హెర్పిస్ అని అంటారు. చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి పగిలిపోతుంటాయి.

హెర్పిస్ వైరస్ పురుషుల నుంచి స్త్రీలకు, స్త్రీల నుంచి పురుషులకు లైంగిక సమయంలో వ్యాప్తి చెందుతుంది. లైంగిక కలయిక సమయంలో చర్మం చిట్లినపుడు గాయాలు, పుండ్ల ద్వారా ఈ వైరస్ వస్తుంది. ఈ చర్మం చిట్లినపుడు వైరస్ లోపలకు ప్రవేశిస్తుంది. ఈ వైరస్ కొద్ది రోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. ఈ వైరస్ వెన్నెముక చివరిభాగం శాక్రమ్ చుట్టూ ఉండే నాడుల సముదాయంలో చోటు చేసుకుని నిద్రావస్థలో ఉండిపోతుంది. ఈ నిద్రాణస్థితిలో ఎలాంటి లక్షణాలు చూపించకుండా అవసరమైనపుడు తన ప్రతాపాన్ని చూపించి అతలాకుతలం చేస్తుంది.

### ఎలా గుర్తుపట్టాలి

ఒళ్లంతా నొప్పులు, గజ్జలలో, చంకలలో గడ్డలు కట్టినట్లుగా ఉంటుంది. తరువాత క్రమక్రమంగా లైంగిక భాగాలపై చిన్న చిన్న నీటిపొక్కులు కనిపిస్తాయి. రెండు, మూడు రోజులలో పగిలి పుండ్లలాగా తయారవుతాయి. ఈదశలో రోగికి సమస్య వచ్చినట్లు తెలుస్తుంది. తొలిసారి లక్షణాలు కనిపించినపుడు సరియైన చికిత్స తీసుకుంటే ప్రారంభదశలోనే సత్వరనివారణ జరుగుతుంది. కానీ చాలా మందిలో వైరస్ ఉండిపోవడం వల్ల నిదానంగా ఉంటూ తిరగి బయటపడుతూ ఉంటుంది. దీన్ని హెర్పిస్ రికరెంట్ అటాక్ అని అంటారు.


డా. మధు వారణాశి, ఎం.డి
ప్రముఖ హోమియో వైద్యులు
ప్లాట్‌నెం 188, వివేకానందనగర్ కాలనీ,
కూకట్‌పల్లి, హైదరాబాద్
ఫోన్ : 8897331110
8886 509 509




### హెర్పిస్ రికరెంట్ అటాక్స్

వాతావరణ పరిస్థితుల్లో ఉన్న తీవ్రమైన తేడాలు, మానసిక ఆందోళన వల్ల హెర్పిస్ రికరెంట్ అటాక్స్ వస్తాయి. దీనిలో లక్షణాల తీవ్రత అంతగా లేకపోయినా కొన్నిరోజులలో పుండ్లు మానిపోయి సాధారణంగానే ఉంటుంది. నీటి పొక్కులు చితికి పుండ్లుగా మారినపుడు హెర్పిస్ వైరస్ పుండు రసిలో ఉంటుంది. ఈ సమయంలో రతిలో పాల్గొంటే భాగస్వామికి అంటుకునే అవకాశం ఉంది. స్త్రీలలో నెలసరి సమయంలో చిన్న చిన్న పొక్కులు ఉన్నా తెలియవు. వీరికి హెర్పిస్ ఉన్నట్లు తెలియకపోయినా, లోలోపల హెర్పిస్ ఉండే అవకాశం ఉంటుంది.

### హోమియో చికిత్స

లైంగిక వ్యాధులలో హోమియో చికిత్స కీలక పాత్రపోషిస్తుంది. శాస్త్రీయతను సంతరించుకున్న హోమియో చికిత్స మూలకారణాన్ని గుర్తించి దానితొలగించడంలో కృషి చేస్తుంది. రోగనిరోధక వ్యవస్థను పెంచి రోగనివారణకు సరియైన మార్గాన్ని చూపిస్తుంది. పొక్కులు కనిపించగానే చికిత్స తీసుకోవాలి. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని దగ్గర చికిత్స తీసుకుంటే హెర్పిస్ ఇట్టే తొలగిపోతుంది.

# పైల్స్ బాధ ఇలా పోయింది

**ఒకేచోట** కదలకుండా కనీసం పది నిమిషాలైనా కూర్చోకుండా కుర్చీలో అటు ఇటు కదిలే వారిని చూస్తే పక్కవారికి కాస్త చిరాకుగానే ఉంటుంది. కానీ అది పైకి చెప్పలేని బాధ. ఇంతగా బాధించే వ్యాధి పేరే పైల్స్. కానీ అది పైకి చెప్పలేని బాధ. జీవనశైలిలోమార్పుల వల్ల ఇప్పుడు పైల్స్ సమస్యలు పెరుగుతున్నాయి. హెమరాయిడ్స్‌ని సామాన్య పరిభాషలో పైల్స్ అంటారు. దీనినే తెలుగులో మొలలు అంటాం. ఈ వ్యాధి అసౌకర్యాన్ని కలగిస్తుంది. తప్పితే సాధారణంగా ప్రాణ ప్రమాదాన్ని కలిగించదు. మలద్వారం లోపల సిరలు ఉబ్బిపోయి పెద్దవిగా మారటాన్ని పైల్స్ అంటారు. సరైన ఆహార నియమాలు పాటించకపోవడం, తీవ్రమైన మానసిక ఒత్తిళ్లు, నీరు తక్కువగా ఉండటం, మద్యం అతిగా సేవించడం, మాంసాహారం తరచుగా తినడం వీటివల్ల పైల్స్ వచ్చే అవకాశాలు ఎక్కువ. దాదాపు ప్రతివారికి జీవితంలో ఏదో ఒక సందర్భంలో పైల్స్ ఇబ్బంది పెడతాయి. పైల్స్ ఏర్పడటానికి ప్రధాన కారణం మలవిసర్జన సజావుగా, నిరాటంకంగా దానంతట అదే జరగకపోవడం. మలవిసర్జన త్వరత్వరగా జరిగిపోవాలనే భావంతో ముక్కటం, మలద్వారపు కండరాలను బిగపట్టడం చేస్తే మలద్వారం, లోపలి రెక్టల్ సిరల మీద ఒత్తిడి పెరిగి పైల్స్‌గా ఏర్పడతాయి. ఒత్తిడి పెరిగే కొద్దీ సిరల్లో రక్తం ఎక్కువగా పోటేసి గోడలను ఉబ్బిపోయేలా చేస్తుంది. మలవిసర్జన సాఫీగా జరగదు. తీవ్రమైన నొప్పి, రక్తస్రావం, మంట ఉంటాయి. అప్పుడప్పుడు రక్తం పడుతుంది. మలవిసర్జన అనంతరం కూడా కొందరిలో నొప్పి, మంట రెండుగంటల వరకు ఉంటుంది. మలవిసర్జన సమయంలో మొలలు బయటకు పొడుచుకుని వచ్చి బాధిస్తాయి. దీనిని రెండు రకాలుగా విభజించవచ్చు. ఇంటర్నల్ పైల్స్, ఎక్స్‌టర్నల్ పైల్స్. ఒకే సమయంలో రెండు రకాలుగా ఉండవచ్చు. తీవ్రతను బట్టి ఇంటర్నల్ పైల్స్ నాలుగు దశలుగా ఉంటుంది. మొదటి దశలో మలద్వారం నుంచి మొలలు బయటకు రావు. రెండవ దశలో మలవిసర్జన సమయంలో బయటకు వచ్చి తర్వాత లోపలకు వెళ్లిపోతాయి. మూడవ దశలో మలవిసర్జన తరువాత వాటంతట అవే లోపలికి వెళ్లవు. నాలుగవ దశలో మొలలు ఎల్లప్పుడు మలద్వారం బయటే ఉంటాయి. ఎక్స్‌టర్నల్ పైల్స్‌లో ప్రధాన లక్షణం నొప్పి. మల విసర్జన సమయంలో రక్తస్రావం, దురద ఉంటుంది.

**నాపేరు చంద్రశేఖర్. కార్పొరేట్ కంపెనీలో హెచ్ఆర్‌గా పనిచేస్తున్నాను. నా ఆహారపు అలవాట్లు, మానసిక ఒత్తిడి వల్ల నాకు పైల్స్ సమస్య వచ్చింది. సర్జన్ చూపిస్తే ఆపరేషన్ ఒక్కటే మార్గమన్నారు. ఆపరేషన్ అంటే భయం వేసి డా. వారణాసిగారిని కలిశాను. ఫస్ట్‌డోస్‌తోనే నాకు నొప్పి, బ్లీడింగ్ తగ్గిపోయింది. ఒకనెల తరువాత సమస్యలన్నీ తగ్గిపోయాయి. ఎంతో ప్రశాంతంగా జాబ్‌కు వెళుతున్నాను. 6 నెలలు ట్రీట్‌మెంట్ కంటిన్యూ చేశాను. ఇప్పుడు నాకు పైల్స్ ఉన్నాయనే విషయం మరిచిపోయాను. థాంక్స్ టూ వారణాసి**

**- చంద్రశేఖర్, మాదాపూర్**

### ఏం చేయాలి?

పీచుపదార్థాలు ఎక్కువగా ఉన్న ఆహారం తీసుకోవాలి. నీరు ఎక్కువగా తాగాలి. ప్రతిరోజు వ్యాయామం చేయాలి.మద్యం, ఫాస్ట్‌ఫుడ్, వేపుళ్లు, మాంసాహారం మానేయాలి. మానసిక ఒత్తిడి నివారణకు యోగా, వ్యాయామం చేయాలి. గ్రీన్‌వెజిటబుల్స్, లీవ్స్ తీసుకోవాలి. ఎందుకంటే వీటిలో పీచుపదార్థాలు అధికంగా లభిస్తాయి. ఇది మలబద్ధకాన్ని నివారిస్తుంది. అలాగే బీన్స్, సోయాబీన్స్, బ్లాక్‌బీన్స్ లాంటివి తేలికగా జీర్ణమై పేగులు శుభ్రపడేలా చేస్తాయి. మామిడి, నిమ్మ, బొప్పాయి మొదలైన పండ్ల రసాలు తీసుకోవాలి. కాఫీ, టీ బాగా తగ్గించాలి.

గదుల వైపు.

'టీ తాగు' అంటూ వెట్టికి చెప్పి ప్రత్యూషకి సైగ చేసింది పిచ్చమ్మి. తన ఫోను తీసి సబ్బిరెడ్డి నంబర్‌ని ప్రెస్ చేసింది ప్రత్యూష. అవతలి నుంచి మాట విన బడగానే పిచ్చమ్మికి అందించింది.

'సబ్బిరెడ్డీ – నువ్వు పఠాన్‌ని వదిలిపెట్టు' అన్నది పిచ్చమ్మి.

ఆమె దగ్గర్నుంచి అటువంటి రిక్వెస్టు వస్తుందని అనుకోలేదు కాబోలు కొంచెం షేక్ అయినట్లు ధ్వనించింది సబ్బిరెడ్డి కంఠం.

'అత్తమ్మా... ఏమిటి నువ్వు చెప్పబోతుంది?' అడిగాడు.

'పఠాన్‌ని వదిలేయ్. నువ్వు ఎలా వదిలేస్తావో నాకు తెలియదు. వాడు మాత్రం వెంటనే బయటికి వచ్చేయాలి. అంతే' మరింత స్పష్టంగా అన్నది ఆమె.

'అత్తమ్మా! ఇది నా ప్రెస్టేజి క్వశ్చన్. ఆ బాజిరెడ్డి ఇక్కడికి వచ్చినప్పుడు ఎగిరెగిరి తంతానని చెప్పాను. దిక్కున్న చోటికి పొమ్మని అన్నాను. ఇప్పుడు వీడిని వదిలేస్తే చేతకాని వాడినైపోతాను. ఈ మాట బయటికి వస్తే నా డిపార్ట్‌మెంట్ నన్ను చేతకాని వాడిగా భావిస్తుంది. నా కెరీర్ నాశనం అయిపోతుంది' గబగబా చెప్పాడు సబ్బిరెడ్డి.




'అదంతా నాకు తెలియదు. కావాలంటే నువ్వు మా విఠల్‌బాబుతో...' అని వెట్టి పేరు చెప్పబోయి ఆగిపోయింది పిచ్చమ్మి. 'వెట్టితో మాట్లాడు' అంటూ ముగించింది.

ఆమె తనకేసి జాచిన ఫోన్ తీసుకుని, 'హల్లో' అన్నాడు వెట్టి.

'ఏంటి ఇదంతా? ఏం చేశాడు ఆ బాజిరెడ్డి?' విసురుగా అతన్ని అడిగాడు సబ్బిరెడ్డి.

'వాడు, వాడి కొడుకు పర్మినెంటుగా మూలన పడే రోజులు దగ్గరికి వచ్చేశాయి సారూ! మీరు ఏదో ఒక విధంగా ఆ పఠాన్‌గాడిని బయటికి పంపించండి. వాడు తిరిగి మీ చేతులకు చిక్కటమో, ఏకంగా పైకి వెళ్ళిపోవటమో ఖచ్చితంగా జరిగి తీరుతుంది' అన్నాడు వెట్టి.

'ఇది ఏమీ బాగోలేదు బ్రదరూ. మీరందరూ కలిసి నన్ను పనికిరాని వాడి కింద మార్చేసే పని పెట్టుకున్నట్టు కనిపిస్తోంది. దొరక్క దొరక్క దొరికిన కేసు ఇది' అంటున్న సబ్బిరెడ్డి కంఠంలోని వేదన వెట్టికి అర్థం అయింది.

'దొరక్క దొరక్క దొరికిన ఆ కేసును గురించి మొదట మీకు ఉప్పు అందించింది ఎవరో మర్చిపోయారా?' అని అడిగాడు.

ఠక్కున ఆగిపోయాయి అవతలి నుంచి వినవస్తున్న మాటలు.

'ఏమిటి సబ్బిరెడ్డి సారూ... వింటున్నారా?' రెట్టించాడు వెట్టి.

'వినకుండా ఇంకేం చేస్తాను బ్రదరూ.. నువ్వే ఈ చవటని పట్టించావు. మళ్ళీ నువ్వే వదిలిపెట్టమని అంటున్నావు' కచ్చగా వినవచ్చింది సబ్బిరెడ్డి కంఠం.

'నిజమే. కాదని అనటం లేదు. వాడిని ఊరికే వదిలిపెట్టొద్దు. వాడి నాయన్ని పిలిపించి సంతకాలు పెట్టించుకుని మరీ వదిలి పెట్టాలి. ఇక్కడ మా పరిస్థితులు సరిదిద్దబడిన వెంటనే మళ్ళీ తీసుకుపోయి లోపలికి నెట్టే విధంగా ఏర్పాట్లు ఉండాలి. అర్థమైందా?' అన్నాడు వెట్టి.

'పట్టుకోవడం, వదిలి పెట్టడం... మళ్ళీ పట్టుకోవటం ఈ గోలంతా దేనికి? అసలు అక్కడ ఏం జరుగుతోంది?' అడిగాడు సబ్బిరెడ్డి.

'బాజిరెడ్డి నడుమును విరగేసే ప్రయత్నం జరుగుతోంది. వాడు కుదురుగా ఉండకుండా ఏదో ఒక మెలిక పెట్టి వాడి మతిపోగొట్టే కార్యక్రమాల్లో ఇది కూడా ఒక పార్టు. ఫోన్లో మాట్లాడే విషయాలు కావు. దగ్గర నిలబడి వివరంగా చెబితే తప్ప అర్థం కావు' అన్నాడు వెట్టి.

'ఓకే! నీ మీద నమ్మకంతో నువ్వు చెప్పినట్టు చేస్తాను. పదిరోజులు మాత్రమే గడువు. పదకొండో రోజున అడ్డం వస్తే ఆ బాజిరెడ్డిని కూడా పట్టుకుని తీసుకుపోతాను' ఒక నిర్ణయానికి వచ్చినట్టు నిబ్బరంగా చెప్పాడు సబ్బిరెడ్డి.

'అలాగే సారూ... ఆ ప్రకారమే చేయండి. మిగిలిన వాళ్ళని హెడ్‌క్వార్టర్స్‌కి తీసుకుపోయి...' అంటూ మొదలుపెట్టిన వెట్టిని మధ్యలోనే ఆపేశాడు సబ్బిరెడ్డి.

'హెడ్‌క్వార్టర్స్‌కి ఇప్పుడిప్పుడే పోయేది కాదు. వదిలిపెట్టిన చవటని కూడా వెంట బెట్టుకునే పోతాను. అప్పటివరకూ చింతలపల్లిలోనే మకాం' అన్నాడు.

అనుకోని విధంగా ఎదురైన ఆ డెవలప్‌మెంట్‌ను గమనించేసరికి ఆనందమయమై పోయింది వెట్టికి.

పది రోజుల్లోపల తను అనుకున్న పనులను చేయలేకపోతే, పఠాన్ మాత్రం బయట స్వేచ్ఛగా తిరగలేడు, అతని పెళ్ళి పది రోజులపాటు వాయిదా వేయించగలిగితే చాలు... ఒక సమస్య సాల్వ్ అయిపోతుంది.

చింతలపల్లిలోనే మకాం పెట్టిన సబ్బిరెడ్డి సాయంతో అమ్మవారి ఆత్మశిలను ఆలయం దగ్గరికి అతి తేలికగా తరలించవచ్చు. పిచ్చిపూజారి అనుకుంటున్నట్టు హంగు ఆర్భాటాలను అవాయిడ్ చేయవచ్చు.

దైవీకమయిన సమస్య కారణంగా శివారెడ్డి ఫ్యామిలీ ఫేస్ చేస్తున్న సమస్యలన్నీ, అమ్మవారి ఆత్మశిల చౌడేశ్వరి ఆలయం దగ్గరికి చేర్చబడిన వెంటనే సాల్వ్ అయిపోతాయి.

బాజిరెడ్డితో వచ్చే బాధల్ని మాత్రం తట్టుకోవాల్సి ఉంటుంది. తన అనారోగ్యం నుంచి తేరుకుంటున్న పిచ్చమ్మి సహాయంతో వాటిని ఫేస్ చేయవచ్చు.

వెట్టి వదనంలో ఉన్నట్లుండి వచ్చిన మార్పు పిచ్చమ్మికే కాదు, అక్కడ ఉన్న వారందరికీ తెలిసిపోయింది. 'ఏమన్నాడు సబ్బిరెడ్డి?' అంటూ అతన్ని ఒత్తిడి చేయటానికి రెడీ అయ్యారు అందరూ.

'పఠాన్‌ని వదిలిపెడతానని చెప్పాడు' అన్నాడు వెట్టి.

కుతూహలంగా ముందుకు వంగిన ప్రణవి ముఖం చిన్నబోయింది ఒక్కసారిగా. అప్రయత్నంగా కళ్ళల్లో ప్రత్యక్షం అయిన కన్నీళ్ళను అరచేతులతో ఆర్పుకుంటూ అవతలికి జరిగింది ఆమె.

'నువ్వు ఏదో ఒరగబెడతావని అనుకుంటుంటే ఆఖరికి చేసింది ఇదా? వాడు.. ఆ చవట బయటికి వచ్చిన వెంటనే జరిగేది ఏమిటో నీకు గుర్తుందా?' కోపంగా అడిగింది ప్రత్యూష.

'ఏంటి అబ్బయ్యా? ఇట్టా చేశావేంటి?' బాధగా అన్నాడు శంకరయ్య.

'రాకరాక వచ్చిన అవకాశం. వాడిని పర్మినెంటుగా వదిలించుకోవచ్చనే నేను కూడా అనుకున్నాను' అంతకుముందే వచ్చి, గుమ్మం దగ్గర నిలబడి ఉన్న రమణయ్యపంతులుగారు కూడా అన్నాడు.

ఒక్క పిచ్చమ్మి మాత్రం ఎటువంటి మాటా మాట్లాడకుండా స్థిరంగా కూర్చుని ఉంది. 'నీ అభిప్రాయం ఏమిటి తల్లీ? నువ్వు కూడా నన్ను రెండు తిట్లు తిడితే కడుపు నిండిపోతుంది' నవ్వుతూ అన్నాడు వెట్టి.

చిరునవ్వు నవ్వి, చటుక్కున చేతిని జాచి అతని తలమీద చిన్న మొట్టికాయ వేసింది ఆమె.

'నీకు ఈ మధ్య అవతలివాళ్ళను ఏడ్పించి, నీలో నువ్వు సంతోషపడటం బాగా అలవాటైపోయింది. నువ్వు ఎందుకు సబ్బిరెడ్డిని కన్విన్స్ చేశావో వాళ్ళకి చెప్పినట్లయితే చాలా బాగుండేది' అంటూ అందరి వైపు కలియజూసి, 'ఏ ఉద్దేశంతో అలా చేశాడో చెపుతాడు – వినండి' అని కమాండ్ చేసింది.

'ఏంటి వినేది? వినాల్సినవన్నీ వినేశాము. ఇంక వినవలసినవి ఏమీలేవు?' అంటూ తన గదిలోకి వెళ్ళిపోబోయిన ప్రణవిని, 'ఆగు ప్రణవీ... ఒక్క నిమిషం ఆగు..' అంటూ ఆపేసింది శివారెడ్డి భార్య.

'నువ్వు కూడా అతనితో జట్టు కట్టావు...' కోపంగా అన్నది ప్రణవి.

# కండరాల నొప్పి ఇక దూరం

**ఫైబ్రోమయాల్జియా అంటే కండరాల నొప్పి. కండరాల నొప్పిలో ప్రైమరీ, సెకండరీ అని రెండు రకాలున్నాయి. మొదటిరకం ప్రైమరీ కండరాలనొప్పి ఇతర కారణాల వల్ల రాదు. సెకండరీ కండరాల నొప్పి ఇతర వ్యాధులు కారణాల వల్ల వస్తుంది. కారణాలు ఏవైనా కలవర పెడుతున్న కండరాల నొప్పి నుంచి హోమియో చికిత్స తో శాశ్వత ఉపశమనం కలిగించవచ్చని అంటున్నారు హోమియోవైద్యనిపుణులు డా॥ మురళీ అంకిరెడ్డి.**

కండరాలు కుచించుకుపోయినట్లు అనిపించడం, కండరాలు కొంకర్లు పోవడం, నిద్రలేచిన తర్వాత అలసట గా ఉండటం, నీరసం, శరీరం శక్తినికోల్పోయి నట్లు అని పించడం, కండరాల నొప్పి, మెడ, వెన్ను, భుజాల సున్నితంగా ఉండటం, నిద్రలేమి, ఉదయం లేచిన వెంటనే కండరాలు బిగుతునా ఉండటం, ఆందోళన, తలనొప్పి, తలతిరుగుతున్నటు అని పించటం విరేచనాలు, మల బద్ధకం వంటి లక్షణాలు ఉంటాయి.

**కారణాలు:** రక్తహీనత, థైరాయిడ్ సమస్యలు, అడ్రినల్ సమస్యలు, శరీరంలో వెలుతురు తక్కువగా ఉండటం, న్యూరో పతి అంటే నరాలకు సంబంధించి న సమస్య, అతి మూత్ర వ్యాధి, డయాబెటీస్ వ్యాధులు కండరాల నొప్పికి కారణమవుతున్నాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** సీబీపీ, ఈఎస్ఆర్, టీ3, టీ4, సీరం క్యాల్షియం, ఆర్‌బీఎస్, ఎఫ్‌బీఎస్, అడ్రినల్ గ్లాండ్ పరీక్షల ద్వారా కీళ్ల నొప్పులను నిర్ధారించవచ్చు. హోమియో చికిత్స కీళ్ళనొప్పుల సమస్య కు హోమియోలో బ్రయోనియా, రస్టాక్స్, కాల్చికమ్, ఫార్మికా, కాల్మియా, ఆర్నికా, ఆర్సెనిక్, లైకోపోడియం మందులు వాడదగినవి.

**బ్రయోనియా:** శరీరంలో ఉన్న అన్ని కండరాలు నొప్పిగా ఉంటాయి. చిరిగినట్లు నొప్పి ఉంటుంది. ఈ నొప్పి కదలికలకు ఎక్కువగా ఉంటుంది. ఇది ధృడంగా ఉండి నల్లగా ఉండే వారికి మంచి మందు. సమస్యలు కుడి పక్క ఎక్కువగా ఉంటాయి. చిరాకు, ఎప్పుడు తమ వృత్తి గురించే మాట్లాడుతుండటం, మల బద్ధకం, నాలుక పొడిగా ఉండటం, వేడిని భరించలేక పోవడం వంటి లక్షణాలు ఉంటాయి. **రస్‌టాక్స్:** ఇది కీళ్ళు, టెండాన్స్, కండరాలు మీద మంచిప్రభావం చూపుతుంది. అధిక బరువు ఎత్తడం, ఒత్తిడి వల్ల సమస్యలు, దిగులుగా ఉండటం లాంటి లక్షణాలకు ఈ హోమియో మందు బాగా పనిచేస్తుంది. కీళ్ళు, కండరాల మీద బాగా పని చేస్తుంది. కీళ్ళవాపు, చల్లగాలిని భరించలేరు. కాళ్లు పట్టినట్లు ఉంటాయి. సయాటికా, కుదురుగా ఒకచోట కూర్చోలేరు. నిరంతరం కదులుతుంటారు. తిమ్మిర్లు మొదలైన సమస్యలు ఉంటాయి. వీరు శ్రద్ధ, ఉత్సాహం లేకుండా, ఆత్మహత్య గురించి ఆలోచనలు రావటం, రాత్రి వేళ ఆందోళన మొదలైన లక్షణాలతో ఉంటారు. **కాల్చికమ్:** ఈ హోమియో మందు కండరాలు, కీళ్ళ చుట్టూ ఉండే పొర వద్ద మంచి ప్రభావం చూపిస్తుంది. వాతరోగం, కాళ్లు నీరసంతో, తిమ్మిరితో, సూదులతో పొడిచినట్లుంటాయి. కీళ్లవాపు, ఎరుపుదనం వెచ్చగా ఉండటం, బిగపట్టినట్లు ఉండటం, నొప్పులు ఒకచోట నుంచి మరోచోటుకు మారుతుండటం, కాలివేళ్ల వాపు, కడుపు ఉబ్బరం, ఆహారపదార్థాల వాసనకి వికారంగా అనిపించడం, నడుమునొప్పి మొదలైన లక్షణాలుంటాయి. **ఫార్మికా రూఫా:** వాతరోగం ఉన్నవారికి మంచి మందు. కీళ్లు పట్టినట్లు ఉండటం, కదలికలు కష్టంగా ఉండటం, మలబద్ధకం, మలవిసర్జనకు ముందు బొడ్డు చుట్టూ నొప్పి కండరాలు అలసినట్లు వాటి స్థానం నుంచి విడిపోయినట్లు అనిపించడం, నీరసం, నొప్పులు లాంటి లక్షణాలు ఉంటాయి. **కాల్మియా:** ఇది రుమాటిక్ సమస్యలకు మంచి మందు, నరాలనొప్పి, శరీరంపై భాగం నుంచి కింది భాగానికి వెళుతుంది. మెడనొప్పి, చేతుల నొప్పులు, నడుంనొప్పి, కుడిభుజం, మోకాళ్ళు, పాదం నొప్పి, నీరసం, నొప్పులు వచ్చినట్లు అనిపించడం ఎక్కువగా ఉంటాయి. **ఆర్నికా:** ఇది గాయాలు తగిలిన తర్వాత వచ్చే సమస్యలకు మంచి మందు, శరీరం సున్నితంగా ఉండి సన్నని స్పర్శను తట్టుకోలేరు. **ఆర్సెనికమ్ ఆల్బమ్:** వీరు అధిక ఆందోళన కలిగి విశ్రాంతి లేని, మరణమున్నా, ఒంటరితనం అన్నా భయం, మందులు వాడి ఉపయోగం లేదు అని భావించటం, స్వార్థం, పిరికిగా ఉండటం, పొదుపుగా ఉండటం వంటి లక్షణాలుంటాయి. **లైకోపోడియం:** ఉత్సాహంగా లేకపోవడం, ఒంటరిగా ఉండటానికి భయం, కొత్తపనులు చేయడానికి ఇష్టపడక పోవటం సున్నిత స్వభావం కలిగి ఉండటం లక్షణాలు. కాళ్ళు, చేతులు తిమ్మిర్లు, బరువుగా ఉండటం, భుజం, మోచేయి నొప్పి, వాతరోగం, కీళ్ళ దగ్గర రాళ్లు ఏర్పడటం. నడుమునొప్పి, కీళ్ల నొప్పి వాపు, లక్షణాలుంటే వాడదగిన ఔషధం.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



# చర్మం మీద నల్లమచ్చలు, తెల్లమచ్చలు

చర్మం యొక్క వర్ణమునకు మన శరీరంలోని మెలానిన్ పిగ్‌మెంట్ కారణంగా ఉంటుంది. ఈ మెలానిన్ పిగ్‌మెంట్ ఉత్పత్తిలో ఉన్న హెచ్చు తగ్గుల వల్ల మన చర్మంలో తెల్లమచ్చలు లేదా నల్లమచ్చలు రావచ్చు. మెలానిన్ పిగ్‌మెంట్ వల్ల చర్మం, కంటికి, జుట్టుకి వర్ణం వస్తుంది.

**నల్లమచ్చల రుగ్మతలు:**

**1. పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్:** గాయం లేక వాపు వచ్చి మానడం వల్ల చర్మంలో నల్లమచ్చలు రావడాన్ని పోస్ట్ ఇన్‌ఫ్లమేటరీ హైపర్ పిగ్మెంటేషన్ అని అంటారు. ఈ అవస్థకి తరువాతనే మొటిమలు, సోరియాసిస్, ఎటోపిక్ మరియు కాంటాక్ట్ డెర్మటైటిస్, లైకెన్ ప్లానస్ వచ్చే అవకాశం వుంది. దీని వల్ల తెల్లమచ్చలు అప్పుడప్పుడు వచ్చే అవకాశం వుంది.

**2. మెలాస్మా:** శరీరంలో ఏ భాగమైతే ఎక్కువగా ఎండకి బహిర్గతం అవుతుందో అక్కడ ఈ విధంగా గోధుమ వర్ణంలో వున్న మచ్చలు వస్తాయి. ముఖ్యంగా ముఖము, చేతులు, పాదాలు, ఈ రకమైన మచ్చలు గర్భిణిలో కూడా చూడవచ్చు. కాని ఇవి ప్రసవం తరువాత వాటికంతట అవే పోతాయి.

**3. సోలార్ లెంటిజినెన్స్:** ఎక్కువ అల్ట్రావైలెట్ లైట్‌కి (కిరణాలకి) బహిర్గతం అయినప్పుడు చర్మం మీద నల్లగా చిన్నచిన్న మచ్చలు వస్తాయి. ఇవి ప్రాథమికంగా, ముఖం, చేతులు, చాతి, వీపు, కాళ్ళమీద వస్తాయి.

**4. ఎఫిలైడ్స్:** ఇవి సాధారణంగా పిల్లల్లో ఎక్కువగా కనబడతాయి. పిల్లలు ఎక్కువ ఎండకి బహిర్గతం అవడం వల్ల వస్తాయి. ఇవి ఎరుపు రంగు నుండి గోధుమరంగులో ముఖము, మెడ, ఛాతి, చేతుల మీద వస్తాయి. ఇది స్వయంగా వాటికంతట అవే చలికాలం వచ్చేసరికి మానిపోతాయి.

**తెల్లమచ్చలు:**

**1. విటిలిగో:** మెలెనిన్ శాతం తక్కువ అవ్వడం వల్ల చర్మం మీద తెల్లమచ్చలు ఏర్పడతాయి. ఇవి మృదువుగా, తెల్లమచ్చలుగా ఏర్పడతాయి. ఇవి శరీరం మీద అక్కడక్కడ లేదా మొత్తం కూడా రావచ్చు. **2. ఆల్బినిజమ్:** శరీరంలో పూర్తిగా మెలెనిన్ పిగ్మెంట్ లేకపోవడం వల్ల ఈ రకమైన తెల్లమచ్చలు వస్తాయి. జుట్టు రంగు మరియు చర్మం రంగు తెల్లగా మారిపోతుంది. వంశపారంపర్యంగా వచ్చే అవకాశం వుంది.

**3. టీనియా మెర్సికలర్:** ఇది ఒకరకమైన ఫంగల్ ఇన్‌ఫెక్షన్. దీనిలో చర్మంపై అనేక తెల్లమచ్చలు. పొరలలో కూడా వస్తాయి. ఈ మచ్చలు అప్పుడప్పుడు పెరుగుతాయి కూడా. చర్మం జిడ్డుగా ఉన్నవాళ్ళు, చెమటలు ఎక్కువగా వస్తున్నవాళ్ళు, వ్యాధినిరోధకశక్తి తగ్గినవాళ్ళు వీళ్ళకి ఇవి ఎక్కువ రావడానికి అవకాశం వుంది.

**నిర్ధారణ:** రోగి శరీర, మానసిక, వంశపారంపర్య చరిత్ర ఆధారంగా రోగనిర్ధారణ చేయువచ్చును.

**చికిత్సవిధానం:** ఆయుర్వేద వైద్యనుసారం దూషించబడిన వాత, పిత్త, కఫ దోషాలను సమస్థితిలోకి తీసుకుని వచ్చే ఔషదాలు అద్భుతమైన లేపనాలు, పంచకర్మ విధానాలు ఉన్నాయి. వ్యాధి ఆరంభంలోనే రోగి ఆలస్యం చేయకుండా వైద్యుల్ని సంప్రదించి వ్యాధిని పూర్తిగా నివారించుకోవచ్చును.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT



## అనుష్క వలన 20 కోట్లు నష్టం?

*ఏ నిర్మాతకయినా ఇది చాలా పెద్ద మొత్తమే! అదీ ఓ హీరోయిన్ వలన అంటే మాటలు కాదు. ఇంతకీ అసలు సంగతేమిటంటే 'బాహుబలి' పార్ట్-1లో అనుష్క సన్నగా, అందంగా ఉంది. అప్పుడు ఆమెతో రెండవ భాగానికి సంబంధించి చాలా సన్నివేశాలను షూట్ చేశారు. ఇదంతా రెండు సంవత్సరాలనాటి మాట. ఇప్పుడు అనుష్క బరువు బాగా పెరిగిపోయింది. ఆమెతో ఇప్పుడు మిగిలిన భాగం షూట్ చేయిస్తే మొదటి భాగమప్పుడు చేసిన షూటింగ్‌కీ, ఇప్పటి షూటింగ్‌కి తేడా స్పష్టంగా కనిపిస్తోందట! ఇది సినిమా విజయం మీద దెబ్బతీస్తుందన్న భావనతో మొదటి పార్టులో షూట్ చేసిన సన్నివేశాలన్నింటిని దర్శకుడు రాజమౌళి రీ షూట్ చేయించారట! ఇలా చేసినందుకు అదనంగా 20 కోట్లు ఖర్చు అవుతాయని తెలిసినా రాజమౌళి కాంప్రమైజ్ కాలేదని సినీజనాలు అంటున్నారు.*

చిన్నగా గొంతు సవరించుకుని.. బాజిరెడ్డి శివారెడ్డిని ఏ విధంగా కన్విన్స్ చేయగలడో చెప్పాడు వెట్టి. పఠాన్‌ని వదిలిపెట్టకపోతే తను ఏం చేయగలడో చిన్నచిన్న మాటలతో వివరించాడు.

'వాడు వట్టి రాక్షసుడు. మనం మొండిగా తలలు అడ్డం తిప్పితే తను గుడ్డలు చించుకుంటూ రోడ్డు ఎక్కుతాడు. అతను రోడ్డు ఎక్కిన మరుక్షణం శివారెడ్డి పరువు కూడా రోడ్డున పడుతుంది. జనం రియాక్ట్ అవుతారు. ఎస్టేట్ మీద నిందలు అధికం అయిపోతాయి. బాగా ఆలోచించండి' అన్నాడు.

అప్పుడు కూడా అతను బాజిరెడ్డికి అటువంటి బలం ఎందుకు వచ్చిందో బయట పెట్టలేదు.

అయోమయంగా చూస్తున్న తన బిడ్డ తల నిమిరింది పిచ్చమ్మి. 'నా మాటలు విను. జరిగేవన్నీ మన మంచికే. తను చెప్పింది అక్షరాల నిజం' అన్నది.

'వాడు బయటికి వచ్చిన మరుక్షణం సరాసరి ఇక్కడికే వచ్చి పెళ్ళి చేసుకుంటానంటాడు. అప్పుడు ఏం చేస్తాడు ఈ మహావీరుడు?' కోపంగా అడిగింది ప్రణవి.

'ఏం చేస్తానో మీకు ఎప్పుడో చెప్పాను. నామాట మీద గౌరవం ఉంటే కామ్‌గా మీ పనులు మీరు చేసుకోండి. అనవసరంగా కంగారు పడకండి' సీరియస్‌గా చెప్పాడు వెట్టి.

'అంత గట్టిగా చెపుతున్నప్పుడు ఇంకా భయం దేనికి?' ప్రణవిని అడిగింది ప్రత్యూష.

ముక్కును గట్టిగా ఎగపీల్చి తడి కనులను అర చేతులతో ఆర్చుకుంటూ కుర్చీలో చతికిల పడింది ప్రణవి.

'ముందు నువ్వు వెళ్ళి నీ అవతారాన్ని మార్చుకో' వెట్టికి చెప్పింది పిచ్చమ్మి. గుమ్మంలోనే నిలబడిన రమణయ్యపంతులుగారితో కలిపి అవుట్‌హౌస్ దగ్గరికి బయలుదేరాడు వెట్టి.

వంటగదుల్లో బిజీగా ఉండవలసిన సంపంగి, అక్కడి పనులన్నిటినీ పనిమనుష్యులకు అప్పగించి, తను మెయిన్‌గేటు దగ్గర కనిపించింది అతనికి, ఫోన్లో ఎవరితోనో మాట్లాడుతూ.

అనుకోకుండా బిల్డింగ్‌లో నుంచి బయటికి వచ్చిన అతణ్ణి చూడగానే చటుక్కున ఫోన్ పెట్టేసి, గబగబా వెనక్కి వచ్చేసింది ఆమె.

'బాజిరెడ్డికి చేరిపోయి ఉంటాయి మన మాటలు..' చిన్నగా వెట్టికి చెప్పాడు పంతులుగారు.

'ఇప్పుడు కాకపోయినా, ఇంకాస్సేపటికయినా వాడికి తెలిసిపోతాయి అన్నీ. మరేం పరవాలేదు' అన్నాడు వెట్టి.

'అడవిలో ఏం జరిగింది అబ్బయ్యా... నాకు చెప్పకూడనివి ఏమైనా జరిగాయా?' అడిగాడు పంతులుగారు.

అవుట్‌హౌస్ ముందుగదిలో ఉన్న సోఫాలో ఆయన్ని కూర్చోబెట్టి రాయుడిపల్లిలో బండోడి నాయన గురించి చెప్పాడు వెట్టి.

కనురెప్ప కూడా కదిలించకుండా మొత్తం ఆలకించి విపరీతంగా ఎగ్జయిట్ అయిపోయాడు పంతులుగారు.

'తొందరపడకండి. ఈ విషయాలు మాత్రం బాజిరెడ్డికి తెలియవు. తెలిస్తే మళ్ళీ ఆ పవిత్రమైన శిలకి ప్రమాదం తప్పదు' అన్నాడు వెట్టి.

'ఏం చేయమంటావు నన్ను?' ఎంతో ప్రయత్నం మీద తన ఎగ్జయిట్‌మెంట్‌ని అదుముకుంటూ అడిగాడు రమణయ్యపంతులు.

'పఠాన్ బయటికి వచ్చిన తర్వాత పరిస్థితులు ఏ విధంగా మారిపోతాయో మనకి తెలియదు. ముందు ఆ విషయాలు అర్థం కావాలి. ఆ తరువాత ఏం చేయాలో నిర్ణయించుకుందాం' అన్నాడు వెట్టి.

'నువ్వు ముందు స్నానం చేసి నీ డ్రెస్సు మార్చుకో. నెమ్మదిగా మాట్లాడుకుందాము' అన్నాడు పంతులుగారు.

తన గదిలోకి పోయి, అక్కడి నుంచి బాత్‌రూమ్‌లోకి ఎంటరయ్యాడు వెట్టి.

***

సాయంత్రం నాలుగు గంటలు దాటిన తరువాత పఠాన్‌ని బెయిల్ మీద వదిలి పెట్టాడు సబ్బిరెడ్డి.

పది రోజుల తరువాత తనంతట తానుగా వచ్చి అతను తనకు లొంగిపోకపోతే, పోలీసుల సాయంతో అరెస్టు చేసి స్టేషన్‌కి తరలించటం జరుగుతుందని చాలా గట్టిగా హెచ్చరించాడు.

'ఒకసారి శివారెడ్డి చెల్లెలి మెడలో తాడు కట్టిన తర్వాత వాడు మనల్ని చెయ్యగలిగింది ఏమీ లేదు. ముందు ఆ పనిని వెంటనే పూర్తిచేయాలి..' తన కోపాన్ని అతి బలవంతంగా అదుముకుని, కొడుకుతో తన కారు దగ్గరికి వస్తూ అన్నాడు బాజిరెడ్డి.

మాడి మసి అయిపోయినట్లున్న ముందు సీటును చూసి, ప్రశ్నార్థకంగా డ్రైవర్ వైపు తిరిగాడు పఠాన్.

'ఇది ఆ వెట్టిగాడు చేసిన పని. వాడిని ఊరికే వదిలిపెడితే, ఇలాంటి పనులు ఇంకా ఇంకా జరుగుతాయి' కచ్చగా అన్నాడు డ్రైవర్.

కారు కదిలి సిటీవైపు తిరగబోతుండగా – మోతలు చేస్తూ అడ్డం వచ్చింది గుర్రపోడు నడుపుతున్న మోపెడ్ ఒకటి. దాని వెనుకే ప్రత్యక్షం అయింది గ్రానైట్ మైన్స్ జనం కూర్చున్న వెహికల్.

'వాడు రాయుడిపల్లిలో లేడు సారూ. అడవిదారిని పట్టుకుని సిటీకి తిరిగిపోయాట్ట. రవీంద్రన్న ఇంటి దగ్గర వదిలిపెట్టిన బుల్లెట్ బండి కోసం ఎవరినైనా పంపిస్తానని చెప్పాట్ట..' మోపెడ్‌కి స్టాండ్ వేసి, బాజిరెడ్డి దగ్గరికి వస్తూ రిపోర్టు చేశాడు.

కనులు చిట్లిస్తూ అతనివంకా, అతని వెనుకే ఉన్న గ్రానైట్ మైన్స్ జనం వంకా చూశాడు బాజిరెడ్డి.

'ఇప్పుడు ఏం చేయమంటారు వాళ్ళని?' రెట్టించాడు గుర్రపోడు.

'వాడు ఎస్టేట్‌లోనే ఉన్నాడు. తీసుకుపోయి చూపించు. రేపు తెల్లారేసరికి వాడు గల్లంతయి పోవాలి..' అన్నాడు బాజిరెడ్డి.

'వీళ్ళకి కావాల్సింది వాడేనని నిరూపణ అయ్యిందా? అవలేదు కదా' అన్నాడు గుర్రపోడు. వెహికల్‌లో కూర్చుని ఉన్న వాళ్ళ లీడర్‌ని దగ్గరికి పిలిచాడు బాజిరెడ్డి.

'వాడు ఎవడైనా సరే. మడతపెట్టి మట్టిలో తొక్కేయండి. మీరు అడిగినంత మీకు ఇస్తాను' అని చెప్పాడు.

**(ఇంకావుంది)**

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'గౌట్' సమస్యకు సమర్థవంతమైన పరిష్కారం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

మన ప్రతి కదలికలో కీళ్ళ పాత్ర ప్రధానమైనది. ఇంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఉదయాన్నే నిద్ర లేచేసరికి కాలి బొటనవ్రేలులో వాపు, సలపరంతో కూడిన నొప్పి మరియు ఆ కీళ్ళకు సంబంధించిన ప్రతి చిన్న కదలిక కూడా అత్యంత కష్టతరంగా అనిపించడం వంటి సమస్యలు కేవలం 'గౌట్' అనే వ్యాధి వలన మాత్రమే కలుగుతాయని మనం తెలుసుకోవాలి.

గౌట్ వ్యాధి మన శరీరంలో యథావిధిగా జరిగే యూరిక్ ఆమ్లపు జీవ ప్రక్రియ సరిగ్గా లేనందున ఉత్పన్నమయ్యే ఒక కీళ్ళవ్యాధి. ఒక అధ్యయనం ప్రకారం 2013వ సం॥ నాటికే దాదాపు 5.8 మిలియన్ల మంది ఈ సమస్యతో బాధపడుతున్నారని తేలింది. మారుతున్న జీవనశైలి, ఆహారపు అలవాట్ల వలన ఈ సమస్య నానాటికీ పెరుగుతూనే ఉంది. స్త్రీల కంటే పురుషులలో 3 రెట్లు అధికంగా ఈ సమస్య కనిపిస్తోంది. 30 సం॥లు దాటిన పురుషులలో మరియు నెలసరి ఆగిపోయిన స్త్రీలలో ఈ సమస్య ఎక్కువగా కనిపిస్తుంది.




సాధారణంగా మనం తీసుకునే ఆహారంలో ఉండే ప్యూరిన్స్ విచ్ఛిన్నంలో భాగంగా ఏర్పడే యూరిక్ ఆమ్లం రక్తంలో ఉండవలసిన పరిమాణం కంటే అధికంగా ఉన్నట్లయితే, అది కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఇలా చేరిన యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు కీళ్ళలో మరియు కీళ్ళ చుట్టూ ఉండే కణజాలంలో వచ్చి చేరినప్పుడు కీళ్ళు వాచి పోయి – కదలికలు కష్టతరంగా మారడాన్ని గౌట్ అని అంటారు. దీని వలన కీళ్ళు హానికి గురవుతున్నాయి కనుక దీనిని 'గౌటీ ఆర్థరైటిస్' అని కూడా అంటారు.

**కారణాలు:** సాధారణంగా రక్తంలో ఉన్న యూరిక్ ఆమ్లం – కిడ్నీల నుండి మూత్రం ద్వారా విసర్జించబడుతుంది. ఒకవేళ శరీరంలో యూరిక్ ఆమ్లం ఉత్పత్తి పెరిగినా లేదా దాని విసర్జన సరిగా జరగకపోయినా, ఈ రసాయనం రక్తంలో నిలిచిపోవటంతో, గౌట్ వ్యాధి ఉత్పన్నమవుతుంది. • ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారం, ఉదా: మాంసం, గ్రుడ్లు, చేపలు మొదలైన సముద్రపు ఆహారము ఎక్కువగా తీసుకోవడం. • అధిక బరువు, వయస్సు పెరగడం, వంశపారంపర్యత • కొన్ని కిడ్నీ సంబంధిత వ్యాధుల వలన యూరిక్ ఆమ్లం విసర్జన ప్రక్రియలో లోపాలు ఏర్పడటంతో గౌట్ (Gout) వ్యాధి వచ్చే అవకాశం ఉంటుంది.

**లక్షణాలు:** మొదట్లో ఈ వ్యాధి కాలి బొటన వ్రేలుకు మాత్రమే పరిమితమైనప్పటికీ, క్రమేపీ ఇది మోకాళ్ళను, మడమలను, మోచేతులను మరియు మణికట్టుతోపాటు ఇతర వ్రేళ్ళను కూడా ప్రభావితం చేస్తుంది. • ఈ సమస్య పట్ల నిర్లక్ష్యం వహించి, సరైన చికిత్స తీసుకోకపోతే వ్యాధి తీవ్రతరం అయి, కీళ్ళను పూర్తిగా దెబ్బ తీస్తుంది మరియు ఈ వ్యాధి మూలంగా కిడ్నీలో రాళ్ళు కూడా ఏర్పడే అవకాశం ఉంటుంది.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** రక్తపరీక్ష – రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువైనంత మాత్రాన గౌట్ వ్యాధికి గురి అయినట్లు భావించరాదు. రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటంతో పాటు, కీళ్ళలో ఆర్థరైటిస్ సమస్య కూడా ఉన్నట్లయితే 'గౌట్' వ్యాధిగానే భావించాలి. • సోరియాటిక్ ఆర్థరైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి ఇతరత్రా సమస్యలలో కూడా యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండే అవకాశం ఉంటుంది. కాబట్టి గౌట్ విషయంలో రోగ నిర్ధారణ చాలా కీలక పాత్ర పోషిస్తుంది. • ఈయస్ఆర్, X-Ray, అల్ట్రా సౌండ్ (యూరిక్ ఆమ్ల స్ఫటికాలను గుర్తించడంలో సహాయపడే పరీక్ష) మరియు కీళ్ళలోని ద్రవాన్ని తీసి పరీక్షించడం వంటి పరీక్షల ద్వారా ఈ వ్యాధిని నిర్ధారించుకోవచ్చు

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** గౌట్ వ్యాధితో బాధపడేవారు, వారు తీసుకునే ఆహారంలో మాంసకృత్తులను బాగా తగ్గించాలి. • మామూలుగా మాంసకృత్తులు (ప్రోటీన్లు) రెండు రకాలు. అవి ప్యూరిన్స్ మరియు పిరమిడైన్స్. • గౌట్ బాధితులు ప్యూరిన్స్ ఎక్కువగా ఉండే ఆహారాన్ని –అంటే ముఖ్యంగా మాంసాహారంలో భాగంగా మేక మరియు గొర్రె మాంసం తినరాదు మరియు బీఫ్ వంటివి కూడా తీసుకోకూడదు. అలాగే లివర్, కిడ్నీ, ఎముక మూలుగ, ప్రేగుల వంటి జంతు అంతర్గత అవయవాలు తీసుకోరాదు. • ఇంతేకాకుండా పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుళ్ళు, వివిధ రకాల బీన్స్, పుట్ట గొడుగులు వంటి శాకాహారాలు తగ్గించాలి. • మద్యపానాన్ని మానివేయడం మంచిది.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతన కాన్స్‌టిట్యూషనల్ హోమియో వైద్య విధానం ద్వారా, రోగి యొక్క మానసిక మరియు శారీరక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, సరైన చికిత్స అందించడం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నివారింపజేయడం జరుగుతుంది. అంతేకాకుండా కీళ్ళలో మరోసారి స్ఫటికాలు ఏర్పడకుండా మరియు రక్తప్రసరణలోని వివిధ రసాయనాల సమతుల్యతను స్థిరంగా ఉంచేలా తగిన జాగ్రత్తలు తీసుకోవడంతో గౌట్ వ్యాధి సమర్థవంతంగా మరియు శాశ్వతంగా నయం కాబడుతుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212 | కన్సల్టేషన్ ఉచితం 955 000 1199 | www.homeocare.in



పుస్తక ఆవిష్కరణ దృశ్యం

# పార్వతీపురంలో సాహితీఉత్సవాలు

**పార్వతీపురం అంటే చైతన్యం. పార్వతీపురం అంటే ఉద్యమస్ఫూర్తి, నిబద్ధత. పార్వతీపురం అంటే పోరాటం. ఆంధ్రరాష్ట్రం అంచునవున్న పార్వతీపురంలో పాతికేళ్ళక్రితం ఒక సాహితీ సంస్థ మొలకెత్తి నెమ్మదిగా సాహితీ పరిమళాలు పంచుతూ మారాకువేస్తూ సాహితీవనంగా విస్తరించింది.**

ఈ సాహితీ ఉద్యానవనంలో పూసినపూలు అన్నా ఇన్నా... ఎన్నని చెప్పగలం ఆచంట సాంఖ్యాయన శర్మతో మొదలుపెడితే గొల్లపూడి, జగన్నాథశర్మ, వోలేటి శ్రీనివాసభాను, గంటేడ గౌరునాయుడు... ఇలా ఎందరో. ఒక సాహితీ కదంబాన్ని 'కథా పార్వతీపురం'గా వెలువరించిన ఘనత స్నేహకళాసాహితిదే. ఒక నిశ్శబ్ద కెరటంలా ఎగసిపడుతున్న కవి, రచయిత గంటేడ గౌరునాయుడి దీక్ష, తపన, కమిట్మెంట్ ఆ సంస్థ ఏర్పాటు వెనక ఉంది. ఆ తపనే మార్చి 12వ తేదీన 'స్నేహకళాసాహితి' పాతికేళ్ళ పండుగకు శ్రీకారం చుట్టింది. ఫాల్గుణమాసంలో కాముడి పున్నమి రోజు ఉదయం 11 గంటలకు పార్వతీపురం లయన్స్ క్లబ్ హాలులో మూడు పుస్తకాల ఆవిష్కరణోత్సవం జరిగింది. స్థానిక రచయితలతోపాటు శ్రీకాకుళం, విజయనగరం, రాయఘడ్ (ఒరిస్సా) పరిసర ప్రాంతాల రచయితలు, సాహిత్యాభిమానులు 'స్నేహకళాసాహితి' రజతోత్సవానికి హాజరయ్యారు.

ఈ సందర్భంగా 'ముంపు కథలు' శీర్షికన వెలువరించిన 'పొద్దు మునిగిపోయింది' కథా సంకలనం, 'గోరపిట్ట' సువర్ణముఖి కథలు, కె.క్యూబ్‌వర్మ 'కాలుతున్న రుతువు' కవితా సంకలనాన్ని వరుసగా, బి.ఎ.వి. రామారావు, కవి శివారెడ్డి, ప్రముఖ రచయిత, నవ్య వీక్లీ సంపాదకులు ఎ.ఎన్. జగన్నాథశర్మ అభిమానుల కోలాహలం మధ్య ఆవిష్కరించారు.

### సాహిత్యానికి పండుగరోజు

పాతికేళ్ళ కిందట పార్వతీపురం సమీపంలోవున్న కురుపాం అనే చిన్న గ్రామంలో ఒక చెట్టుకింద సాహిత్యాభిమానంతో ఏర్పడిన స్నేహకళాసాహితి, తన ప్రస్థానంలో స్థానిక కథకులతో 'కథా పార్వతీపురం' సంకలనం వెలువరించడమేకాదు, కొత్తతరాన్ని వెంటబెట్టుకుని ముందుకు సాగుతోందన్నారు గంటేడ గౌరునాయుడు.

'పొద్దు మునిగిపోయింది' పుస్తకాన్ని కమల కుమారి సమీక్షిస్తూ కథలన్నీ రైతు ఆత్మఘోషను ప్రతిధ్వనిస్తాయన్నారు. గిరిజన జీవితాలను మన కళ్ళ ముందుంచే 'గోరపిట్ట' కథలు ప్రజా ఉద్యమాల అవసరాన్ని నొక్కి చెబుతాయన్నారు మల్లిపురం జగదీష్.

'కాలుతున్న రుతువు' పుస్తకంలో కవి కె.క్యూబ్ వర్మ సంక్షుభిత వర్తమానాన్ని రాశులుగా పోస్తారన్నారు సమీక్షకుడు పక్కి రవీంద్రనాథ్.

### ఈ ఊరు నన్ను వెంటాడే జ్ఞాపకం

పాతికేళ్ళుగా ఒక సంస్థను నడుపుతూ బంధాలు అల్లుకుంటూ కొత్త తరాన్ని తీర్చిదిద్దడం సామాన్య విషయం కాదన్నారు ఈ సందర్భంగా ప్రసంగించిన ఎ.ఎన్. జగన్నాథశర్మ. పాతికేళ్ళుగా సంస్థను నిర్వహిస్తూ, ఇంత పెద్ద కార్యక్రమం నిర్వహించడం సామాన్య విషయం కాదంటూ గౌరునాయుడిని అభినందించారు.



సభకు విచ్చేసిన సాహితీ ప్రముఖులు

"నేను ఇక్కడ పుట్టిపెరిగిన వాడినే, నా జ్ఞాపకమంతా ఈ ఊరే, నా జీవితమే ఈ ఊరు. ఇక్కడ ఉద్యమాలు చూసినవాడిని. ఇక్కడ అక్షరాన్ని విత్తితే హైదరాబాదులో మొలకెత్తాను అంటూ తన సాహిత్య ప్రస్థానాన్ని జగన్నాథశర్మగారు గుర్తుచేసుకున్నప్పుడు అందరికళ్ళు చెమర్చాయి.

### మనుషుల్ని కలిపేది సాహిత్యం

మనుషుల్ని విడదీసేది పెట్టుబడి అయితే మనసుల్ని కలిపేది సాహిత్యం అన్నారు శివారెడ్డి. సంక్షుభిత సమాజంలో వచ్చే మార్పుల్ని రికార్డు చేసే రచయిత సమస్య లోతుల్లోకి వెళ్ళి కూకటివేళ్ళతో సహా పాఠకునికి చూపాలన్నారు. స్వతంత్రంగా ఉంటూ, చెప్పదలిచిన సత్యాన్ని స్వేచ్ఛగా చెబుతూ రచయిత నిరంతర కృషి చేయాలన్నారు శివారెడ్డి. కవి శివారెడ్డి పార్వతీపురంపై ఆ ఉదయమే రాసుకున్న 'పోయమ్' వినిపించి సభికులు మైమరచిపోయేలా ప్రసంగించారు.

స్నేహకళాసాహితి కార్యదర్శి శాంతి (జి.రామకృష్ణ) నివేదిక సమర్పించగా, ప్రవాసాంధ్ర రచయితల పక్షాన ఆనందరావు పట్నాయక్, స్థానిక ప్రముఖులు డాక్టర్ డి.పి.జి.శంకరరావు, చీకటి దివాకర్, దాసరి రామచంద్రరావు (కథానిలయం), డాక్టర్ మంచిపల్లి శ్రీరాములు, బి.వి.ఏ. రామారావు నాయుడు తదితరులు పాల్గొన్నారు. రచయిత పాలకొల్లు రామలింగస్వామి స్వాగత వచనాలు పలికారు.

—సి.ఎస్.రాంబాబు
సెల్ 94 90 40 10 05

### ఎవడన్నా.....

ఎవడన్నా శరీరాన్ని పిండి
నేలమీద ఆరేస్తే
అక్కడొక కల్పవృక్షం పుడుతుంది
ఎవడన్నా కన్నీటిని దోసిలిలో పట్టి
భూమ్మీద గుమ్మరిస్తే
అక్కడొక సముద్రం ఏర్పడుతుంది
ఎవడన్నా వేళ్ళతో భూమిని కుళ్ళగించి
ఏదైనా ఒక గింజ నాటితే
అక్కడొక దండకారణ్యం లేస్తుంది
భూమినెవడు కాళ్లతో దున్నుకుంటూ పోగలడో
వాడే మనుషులందరినీ
గుప్పెటపట్టి తాడులా పేనగలడు
ఎవడు గిరిధరాన్ని ఎడ్లు చేసి
వ్యవసాయం చేయగలడో
వాడొక వీరుడు

***

వీర కార్యాలు చేయటానికి వీరులక్కరలేదు
మనుషులు చాలు, మామూలు మనుషులు చాలు
భూమిని బొంగరంలా
వేలిమీద తిప్పగలరు

—శివారెడ్డి

కొత్త శీర్షిక ప్రారంభం

# జన్మపత్రిక

రమేశ్చంద్ర మహర్షి
సెల్ : 92 46 58 22 55
040-65 22 55 54
rameschandramaharishi.com



భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం అనే పంచ భూతాలూ, అహంకారం, బుద్ధి, ప్రకృతి, పంచ జ్ఞానేంద్రియాలు, మనసూ అనే పదకొండు ఇంద్రియాలూ, శబ్ద, రూప, స్పర్శ, రసగంధాలనే ఇంద్రియ విషయాలూ కోరిక, ద్వేషం, తెలివి, సుఖం, దుఃఖం, ధైర్యం... వీటి వికారాలూ కలిసి ఏర్పడే క్షేత్రం... మనిషి! ఆ మనిషికి భవిష్యత్తనే దారి చూపే నేత్రం, జ్యోతిశ్శాస్త్రం!!

★ ★ ★

ఎన్ని శతాబ్దాలు గడిచినా మనిషి ఒక కొలిక్కి రాలేని విషయం..

Life is more by accident than design... నిజమా

లేక life is more by design than accident నిజమా ... అన్నది.

గోడ మీద నుండి పతనం కావడం భవిష్యత్తు అని నిర్ధారించబడి ఉంటే "పడడం" accident! "దూకడం" design! భవిష్యత్ ముందే తెలిస్తే పడడాన్ని దూకడంగా మలచుకోవచ్చు.

కృతే కార్యే కింముహూర్త ప్రశ్నేన? పని ముగిసిన పిదప ముహూర్తమడగడం, జరగకూడనిది జరిగిపోయాక పరిహారాలు పాటించడం వలన ఏమిటి ప్రయోజనం?

భవిష్యత్ ముందే తెలిస్తే ముప్పు నుండి తప్పించుకోవడం లేదా తగ్గించుకోవడం సాధ్యమే!

కాలః క్రీడతి గచ్ఛత్యాయుః

కాలం ఆడుకుంటూ ఉంటుంది. ఆయువు గతించిపోతూ ఉంటుంది. రాబోయే మంచి చెడులు తెలిస్తే ఉన్నంతలోనే ఉన్నతంగా జీవించగలుగుతాం!

వయం భగవంతః స్యామ!

జ్యోతిశ్శాస్త్రం ఎంతవరకూ నిజం?

చాలా మంది నన్ను తరచూ అడిగే ప్రశ్న ఇది.

ఇలాంటి ప్రశ్న వేయడానికి నాకు తెలిసి మూడు కారణాలు ఉండవచ్చు.

1) క్లాయిస్టరాఫ్ మెడీవల్ థాట్ లోంచి బయటకు రాలేని వారే ఈ శాస్త్రాన్ని నమ్ముతారని భావించడం కావచ్చు.
2) సృష్టిలో ఏదీ ఒక పద్ధతి ననుసరించకుండా అన్నీ యాదృచ్ఛికంగా, వితౌట్ రైమ్ ఆర్ రీజన్ జరిగిపోతూ ఉంటాయని అనుకోవడం కావచ్చు.
3) ఫలానా గ్రహం అలా చేస్తుంది. ఫలానా గ్రహం ఇలా చేస్తుంది అని చెప్పేటప్పుడు, గ్రహం ఏమన్నా మనిషా అలాగా ఇలాగా చేయడానికి అని భావించడం కావచ్చు.

సృష్టిలో ఏదీ ఎప్పుడూ యాదృచ్ఛికంగా జరగదు. గణిత శాస్త్రం, సైన్స్ ఏదైనా వాటిలోని విషయ సంపదంతా ఒక పద్ధతిలోనే ఉంటుంది కదా! రెండూ + రెండూ కలిపితే నాలుగే అవుతుంది కదా. ఏ ఎలిమెంట్‌కి కూడా ఎప్పుడూ ఎటామిక్ నంబర్ మారలేదు కదా. వేసవి తర్వాతనే వర్షాకాలం వస్తుంది కదా. మామిడి చెట్టుకు మామిడికాయలే కాస్తున్నాయి కదా. ఇన్ని లక్షల సంవత్సరాలయింది కదా అని బోర్ కొట్టి మామిడి చెట్టు కొబ్బరికాయలు కాస్తుందా?

మ్యాక్రో ప్రపంచంలో సూర్యుని చుట్టూ గ్రహాలు తిరుగుతాయి. మైక్రో ప్రపంచంలో న్యూక్లియస్ చుట్టూ ఎలక్ట్రాన్స్ తిరుగుతాయి. అణువు నుండి బ్రహ్మాండం వరకూ అంతా ఒక పద్ధతిలోనే జరుగుతుంది. ఈ ప్రపంచం, దానిలో సంఘటనలూ ఏదీ యాదృచ్ఛికం కాదు. శీతాకాలం, వేసవికాలం, వర్షాకాలం... గతం, వర్తమానం, భవిష్యత్తూ అంతా ఒక పద్ధతిలోనే, ఒక పద్ధతి ప్రకారమే జరుగుతాయి. ఫ్యూచర్ ఈజ్ ప్రీడిస్టెన్డ్! పుట్టిన ప్రతి వస్తువుకీ, జంతువుకీ, మనిషికీ, మొక్కకీ కూడా ఒక డెస్టినీ ఉంటుంది. దాన్ని వివరించి చెప్పేదే జ్యోతిశ్శాస్త్రం.

* * *

"1999లో కుజుడు మీకు ఇల్లు ఇస్తాడు. 2010లో మీకు శుక్రుడు కారు ఇస్తాడు" లాంటి విషయాలు చెప్పినప్పుడు, కుజుడు ఒక గ్రహం, అదేమైనా మనిషా... ఇల్లు ఇవ్వడానికీ, కారు ఇవ్వడానికీ, ఫలానాది సేంక్షన్ చేయడానికి అని వాదించే వారిని మనం చూస్తుంటాం. ఆ వాదనలో తప్పు లేదు. కానీ దానిలో మిస్సయ్యే విషయం ఒకటుంది.

ఒక తోటకూర గింజ తీసుకుందాం. దాన్ని నాటేం. అది భూమిలోని మినరల్స్ కావచ్చు. నీరు కావచ్చు, మీది గాలి కావచ్చూ తీసుకుని మొక్కగా ఎదిగింది. అంటే ఆ మొక్క మరేంటో కాదు భూమి! ఒక మనిషి పుట్టేడు, అలాంటి మొక్కలూ అవీ తిని ఎదుగుతాడు.

మనిషి మరేంటో కాదు భూమి! చంద్రుని మీది రాయి చంద్రుడే అవుతుంది కానీ, చంద్రుడు వేరూ రాయి వేరూ అవుతాయా? భూమిని లాంగ్ షాట్‌లో చూద్దాం.

అంతా భూమి అనే గ్రహమే కానీ, భూమి వేరు, భూమి మీద సముద్రం వేరు, భూమి వేరూ, దాని మీద జంతువు వేరూ అవుతుందా? ఏ వైపు నుండి ఎటుచూసినా మనిషి భూమే! భూమిలో భాగమే! అలాంటి మనిషి ఆలోచిస్తున్నాడు. నవ్వుతున్నాడు,ఏడుస్తున్నాడు.

అంటే భూమి ఆలోచిస్తుంది. భూమి నవ్వుతుంది. భూమి ఇంకా చాలా పనులు చేస్తుంది, మంచీ చెడూ...! ఒక గ్రహమైన భూమికి ఆలోచన ఉన్నప్పుడు మరో గ్రహమైన ఏ కుజునికో ఆలోచన ఎందుకుండదు. ఏ గురువుకో ఒక పథకం, ప్రణాళిక ఎందుకుండవు.

ఆలోచన లేకుండానే వర్షాకాలానికి ముందు ఎండ లొస్తున్నాయా. మనం సేటిలైట్స్ ఎందుకు పంపిస్తున్నాం. భూమి చుట్టూ తిరిగి ఇన్ఫమేషన్ సేకరించడం కోసం. భూమి చుట్టూ తిరిగే అసలు సేటిలైట్ చంద్రుడు. భూమి మీది ఇన్ఫర్మేషన్ అంతా దేవుడు చంద్రుని ద్వారా సేకరిస్తున్నాడేమో! ఎందుకంటే గ్రహం ఆలోచిస్తుందని నిర్ధారణయింది కదా! ఇక కొంత మంది వాదించే మరో విషయముంటుంది.

సూర్యుడు నక్షత్రం, చంద్రుడు ఉపగ్రహం వీటిని జ్యోతిశ్శాస్త్రం గ్రహాలని చెప్పింది కనుక శాస్త్రం తప్పు అని వీరి వాదన.

గ్రహాలంటే పూర్వీకుల ఉద్దేశ్యం, ఆకాశంలో నక్షత్రాల్లా స్థిరంగా ఉండక కదిలేవి అని. దాన్ని గ్రహం అంటామో, నక్షత్రం అని పేరు పెట్టుకుంటామో ప్రధానం కాదు కదా.

ఎలక్ట్రాన్ ఎప్పుడయినా తన పేరు ఎలక్ట్రాన్ అని చెప్పిందా? తన పేరు బాగా లేదు మార్చమని అడిగిందా? శుక్రుడు తన పేరు శుక్రుడని, వీనస్ అనీ మనలో ఎవరికైనా చెప్పేడా? ఆకాశంలో కదిలే సూర్యుడు నక్షత్రమా, గ్రహమా అన్నది ఆలోచించలేదు జ్యోతిశ్శాస్త్రం! భూమి మీదా, భూమి మీది ప్రాణులకు ఎలాంటి ఫలితాలిస్తుందన్నదే ఈ శాస్త్రం విశదీకరించే విషయం! విజ్ఞానం!! ప్రయోజనం!!!

దేవుడున్నాడో లేడో తర్వాత విషయం. కానీ ఈ కనిపించే సృష్టి వెనుక ఒక మహా మేధస్సు ఉంది. దాని ఉనికిని పక్కనపెట్టి, ఉద్దేశ్యాన్ని మాత్రమే వెలికితీయాలని ప్రయత్నించే శాస్త్రం జ్యోతిశ్శాస్త్రం. ఉపయోగించుకుని బాగుపడడం మన తెలివితేటల మీద ఆధారపడి ఉంటుంది. ఎందుకంటే...

వచ్చే వర్షాలనీ, తుపానులనీ మనం ఆపలేం. మరి వాతావరణ కేంద్రాలెందుకూ అంటే జాగ్రత్త చెప్పడానికి, హెచ్చరించడానికి.

ఒక జ్యోతిషవేత్త వర్షాన్ని సృష్టించడు. అలాగే గొడుగునీ సృష్టించడు. గొడుగు పట్టుకెళ్ళమని చెప్తాడు. ఒక్కోసారి అసలు బయటకే పోవద్దని హెచ్చరిస్తాడు.

ప్రపంచంలో అన్నీ ఉంటాయి. అయితే ఉపయోగించుకోవడం మన చేతిలో ఉంటుంది.

చెరకు దేవుడిస్తాడు. చక్కెర మనిషి తయారు చేసుకోవాలి!

**తమసో మా జ్యోతిర్గమయ!**

అంధకారం నుండి ప్రకాశం వైపు నడుద్దాం!!

ఎస్ట్రాలజీ చెప్పడంలో టెక్నిక్స్, సీక్రెట్స్ నేర్చుకోవాలనుకుంటున్నారా...
అయితే rameschandramaharishi.com సైట్ వీక్షించండి.
స్పెల్లింగ్‌లో తేడా రాకుండా చూసుకోగలరు.




**నా** క్లోజ్ ఫ్రెండ్ ఒంగోలులో గుండె జబ్బుల హాస్పిటల్ ఓపెనింగ్‌కి నన్ను పిలిచాడు. గుంటూరు, విజయవాడ, తెనాలి, చీరాల చుట్టుపక్కల ఉంటున్న మా ఫ్రెండ్సంతా వచ్చారు. మేమంతా డిగ్రీలు, పీజీలు పూర్తిచేసి దొరికిన పని చేసుకుంటున్నాం. మాలో ఎవ్వరికీ కార్లు లేవు. అప్పట్లో కారంటే అంబాసిడర్, ప్రీమియర్ పద్మిని. కారు ఒక సోషల్ స్టేటస్. ఆ మాటకొస్తే ఒక్కరిద్దరికి తప్ప స్కూటర్లు కూడా ఎవ్వరికీ లేవు. మేమంతా ఎర్రబస్సెక్కి ఒంగోలు చేరాం. అప్పటికే ఎండలు మండిపోతున్నాయి.

# ఎదిగిన

డా॥ నక్కా విజయ రామ రాజు

# నవ్యవీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతి సాహితి కథల పోటీలో ప్రథమ బహుమతి రూ.10,000 పొందిన కథ

హాస్పిటల్ ఓపెనింగ్ ఫంక్షన్‌కి డా. సోమరాజు గారు చీఫ్ గెస్ట్‌గా వచ్చారు. కోకోనట్ బ్రేకింగ్, రిబ్బన్ కటింగులాంటి ఫార్మాల్టీస్ అయ్యాయి. వచ్చిన గెస్టులు, డాక్టర్లు, విలేకర్లతో ఇంటరాక్షన్ మీటింగు ఏర్పాటుచేశారు.

ఈ చుట్టుపక్కల అదే ఫస్టు హార్ట్ హాస్పిటల్! అటు నెల్లూరు నుంచి ఇటు గుంటూరు దాకా! ఈ చుట్టుపక్కల పేషెంట్స్‌కి పేయింగ్ కెపాసిటీ తక్కువ. హార్ట్ హాస్పిటల్ అంటే ఆషామాషీ వ్యవహారం కాదు. బోలెడు ఖర్చు. ఎక్విప్‌మెంట్ చాలా కాస్ట్‌లీ. అందుకే ఇంతవరకు ఎవ్వరూ ముందుకు రాలేదు.



ఆ విషయాన్నే డా. సోమరాజుగారు చెబుతూ "ఎలాంటి గుండెజబ్బులొచ్చినా ఈ చుట్టుపక్కల జనం దేవుడి మీద భారం వేసేవాళ్లు. సకల జీవులకు జీవం పోసేది కనబడని దేవుడైనా, జబ్బులొస్తే ప్రాణాలు కాపాడేది మాత్రం డాక్టర్లే. అందుకే డాక్టర్లను దేవుడితో పోలుస్తారు. ఈ విషయం డాక్టర్ వృత్తి చేపట్టిన ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాలి. ఎంతో వ్యయప్రయాసల కోర్చి అమృతంలాంటి ఈ హార్ట్ హాస్పిటల్‌ను సేవాభావంతో ప్రారంభిస్తున్న ఈ డాక్టర్‌ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను" అని చెప్పి ముగించాడు.

ఆ డాక్టర్‌గారు మాట్లాడే టైంలో మా గ్రూపంతా వెనకచేరి జోకులేసుకుని నవ్వుకుంటున్నాము. డాక్టర్ సోమరాజుగారి మాటలు సూటిగా మాకే చెప్పినట్టనిపించింది. మీటింగ్ అయిపోయింది. అందరం బయటపడ్డాం.

"ఇవేం ఎండల్రా బాబూ!" ముఖానికి పట్టిన చెమటను హ్యాండ్ ఖర్చీఫ్‌తో తుడుచుకుంటూ అన్నాడు మురళి.

"ట్రైల్‌పార్టే ఇలా ఉంటే, ఇంక మెయిన్ పిక్చర్ ఇరగదీస్తదేమో!" అన్నాడు కిరణ్, ఏప్రిల్, మే నెలలను ఊహించుకుంటూ.

"ఫ్రంటుందిరా క్రోకొడైల్ ఫెస్టివల్" అన్నాడు మనోహర్.

అందరం నవ్వుకున్నాం. చెమటతో చొక్కాలు వీపులకు అతుక్కుపోయాయి.

"ఈ ఎదురెండలో బస్టాండు దాకా నడవడం కష్టం రా! రిక్షాలు పిలవండ్రా బాబూ!" ఆపసోపాలు పడుతూ అన్నాడు జేవి.

ఆ చుట్టుపక్కల ఎక్కడా రిక్షాలు కనబడలేదు మాకు. జనాలంతా తలమీద తుండుగుడ్డలు వేసుకుని, టోపీలు పెట్టుకొని నడిచిపోతున్నారు. కొంచెం ముందుకు నడిచాం.

రోడ్డు పక్కనున్న తురాయి చెట్ల కింద అర డజను రిక్షాలు కనిపించాయి.

"వెదకబోయిన తీగ కాలికి తగలడమంటే ఇదే సోదరా!" అన్నాడు విజయసారధి.

అప్పట్లో రిక్షాలదే హవా! మా అందరికీ ఎడారిలో ఒయాసిస్ చూసిన ఫీలింగు! అంతా చెట్లకిందికి జేరాం. చల్లగాలి తగిలి ప్రాణాలకి హాయిగా ఉంది. చెట్లమీదకి పక్షులన్నీ చేరి రెస్టు తీసుకుంటున్నాయి. ఆ పక్కనే పుచ్చకాయల బండి, సోడాల బండి గిరాకీలతో బిజీగా ఉన్నాయి.

"మన దేహాలను రిక్షాల్లో పడేస్తే హాయిగా బస్టాండుకు చేరుస్తాయి. మాట్లాడండిరా!" అన్నాడు జేవి.

అక్కడ సీన్‌చూస్తే అంత వీజీ కాదేమోననిపించింది. రిక్షాల తాలూకు మనుషులంతా వారి కాళ్లు రిక్షాహేండిల్స్ మీదేసి హాయిగా గుర్రు కొడుతున్నారు.

"నిద్ర సుఖమెరుగదు. ఆకలి రుచెరుగదంటే ఇదే సోదరా!"అన్నాడు వారి పొజిషన్ చూసి సారధి.

రెండు మూడు రిక్షాలను నిద్రలేపా. బస్టాండు దాకా వస్తారా? అనడిగా. రామన్నారు. విసుక్కున్నారు. కోప్పడ్డారు.

"సల్లగాలికి హాయిగా కునుకు తీత్తావుంటే! పానకంలో పుడకలాగా ఏందీ నీ గోల" అన్నాడొక ఆసామి.

"తమరికి చెముడా ఏంది సామి? ఆడు చెబుతుంటే మతికెక్కదా?" అన్నాడింకొకడు.

"ఇది మేము నడుంవాల్చే టైం సామి! బొమ్మదే ముడొచ్చి లేపినా లేవరు" అన్నాడొక నడికారు మనిషి.

వాళ్ల మాటలకు కోపం వచ్చింది కిరణ్‌కి. "దిసీజ్ టూ మచ్" అన్నాడు.

"టైం బాబూ! టైం! ఇది వాళ్ల టైం. మనం లెఫ్ట్ రైట్ చెయ్యక తప్పదు" అన్నాడు మిండాల.

"ఎవ్రీ డాగ్ హేజ్ ఇట్స్ ఓన్ డే!" మాకూ టైం వస్తుంది. అప్పుడు చెబుతాం" అన్నాడు కోపంగా శరత్.

"ఇప్పుడు నిమ్మకాయ సోడా తాగే టైం వచ్చింది గానీ, తాగరా" అంటూ తలో సోడా ఇచ్చాడు మురళి.

ఆ పక్కనే ఉన్న బండిమీద పుచ్చకాయ బద్దలు తింటున్నారు మిండాల, పూర్ణ.

పుల్లపుల్లగా, తీపితీపిగా నిమ్మకాయ సోడా గొంతు దిగుతుంటే హాయిగా ఉంది. నిమ్మకాయ సోడాను మించిన డ్రింక్‌లేదు. "మా బెజవాడలో అయితే రిక్షావాళ్లంతా ప్యాసెంజర్ల చుట్టూ ఈగల్లా ముసురుతారు! ఇక్కడేంది?" అన్నాడు కాలేషా, ఖాళీ గోలీసోడా తిరిగి ఇస్తూ.

"ఈ ఊళ్లో ఇంతేరా! ఈ టైంలో రిక్షావాళ్లంతా రెస్ట్ తీసుకుంటూ ఉంటారు" అన్నాడు రాఘవరావు. వాడిది ఆ ఊరే.

మా బ్యాచ్‌లో అందరికంటే ముందుగా ప్రైవేట్ ప్రాక్టీస్ పెట్టింది వాడే! కబుర్లు చెప్పుకుంటూ ముందుకు నడిచాం. మధ్యలో ఇంకో రిక్షా స్టాండు తగిలింది. అక్కడ కూడా సేమ్ టు సేమ్. వాళ్ల యూనిటీ చూసి ముక్కుమీద వేలేసుకున్నాం.

"వీళ్లదిరా యూనిటీ అంటే! మనమూ ఉన్నాం ఎందుకు? ఇంతింత చదువులు చదివినా ఏం లాభం? వేళాపాళాలేకుండా పేషెంటు ఎప్పుడొచ్చినా అర్ధరాత్రి అపరాత్రి అనకుండా చూస్తాం" అన్నాడు మనోహర్.

"మనం మాత్రం పేషెంటు ఎప్పుడొచ్చినా చూడాలిగానీ, మనకవసరమై పిలిస్తే మాత్రం ఒక్కడూ రాడు. డ్రైవర్ నుంచి ఎలక్ట్రీషియన్ దాకా, స్వీపర్ నుంచి దోబీ దాకా..."

"పైగా వాళ్లు ఎంతడిగితే అంత ఇవ్వాల్సిందే!"

"మనం కన్సల్టేషన్ ఫీజు పదో పరకో ఎప్పుడన్నా పెంచామా! ఇక చూస్కోండి! ఈ డాక్టర్ల కన్నా గజదొంగలు మేలని, దేశాన్ని దోచేస్తున్నారని పేపర్ల నిండా ఒకటే గోల."

"మొన్నొక పేషెంటొచ్చి, 'ఐదు నిమిషాలన్నా చూడలేదు, యాభై గుంజాడ'ని గొణుక్కుంటూ పోయాడురా."

"డెలివరీ చేసి వెయ్యి రూపాయలు బిల్లేస్తే గుడ్లు తేలేస్తారు గానీ, అదే ఆ పిల్లోడికి ఫంక్షన్ చేసి వేలకు వేలు తగలేస్తారు."

మాలో ఎవరి అనుభవాలు వారు ఏకరువు పెడుతున్నారు.

గాలి స్థంభించినట్టుంది. చెమటలు కారిపోతు న్నాయి. మా మాటలకు సూర్యుడిక్కూడా కోపం వచ్చినట్టుంది, మా మీదే గురిపెట్టాడు.

"మనం మాత్రం పేషెంట్లను ఊరికే చూస్తు న్నామంట్రా?" అన్నాను.

"వీళ్లమాత్రం కిరాయి తీసుకోకుండా ఫ్రీగా సర్వీస్ చేస్తున్నారా? దీనికి తోడు టైమింగ్స్ ఒకటి" గొణి గాడు రవీంద్రనాథ్.

"మన ప్రొఫెషన్ వేరురా! బ్యాంకులు, ఆఫీసులు, షాపులు, స్కూళ్లలాగా టైమింగ్స్ ప్రకారం పని చెయ్యలేంగా" అన్నాను.

"మరి డాక్టర్లు మాత్రం 24 గంటలు పని చెయ్యాలేం? వాళ్లు యంత్రాలు. రెస్టు అవసరం లేదు కదూ?" జేవి అన్నాడు కోపంగా. ఓపిగ్గా అందరి అభిప్రాయాలు వింటున్నాడు రాఘవరావు. మేమంతా బస్టాండు దరిదాపులకు జేరాం.

అరటిపండ్లు, జాంకాయలు, కొబ్బరిబొండాలు, సోడాలు, కూల్‌డ్రింక్స్, ఐస్‌లు అమ్మే వాళ్ళతో హడా విడిగా ఉంది.

"వాన రాకడ ప్రాణం పోకడ తెలీనట్టే గుండె నొప్పి, కడుపునొప్పి అదే ఎపెండిక్స్, యాక్సిడెంట్లు టైం చూసుకుని రావు కదరా! అందుకే మనం అన్ని వేళల్లో అందుబాటులో ఉండాలి. డాక్టర్లు చేసే పని ప్రపంచంలో ఎవ్వరూ చెయ్యలేరు కాబట్టే, మనకు డబ్బిచ్చి మరీ దండం పెడతారు పేషెంట్లు. ఎన్నన్నా చెప్పండి... మిగిలిన ఏ వృత్తీ మన వృత్తికి సాటిరాదు."

రాఘవ చెబుతుంటే బస్టాండులోకి ఎంటరయ్యాం.

"నిజమే" అన్నట్టుగా అంతా తలలూపారు.

"ఇప్పుడు మనమంతా మంచి వయసులో ఉన్నాం కాబట్టే ఇలా మాట్లాడుతున్నాం. ఈ వయసే అలాం టిది. ఏదేమైనా జీవితంలో అనుభవమైతే గానీ తత్వం బోధపడదు" అన్నాడు రాఘవరావు.

రాఘవరావు జనరల్ సర్జరీ, ఆర్థోపెడిక్ చేసి ఇక్కడే సొంతంగా నర్సింగ్‌హోమ్ స్టార్ట్ చేశాడు. పేదసాదలు, బీదాబిక్కిలను కనిపెట్టి చూస్తాడు. చుట్టుపక్కల ఊళ్ళల్లో ఇప్పుడిప్పుడే మంచిపేరు తెచ్చుకుంటున్నాడు.

మమ్మల్నందరినీ బస్సులెక్కించాడు.

***

కాలచక్రం పదేళ్లు ముందుకు జరిగింది. రిక్షాల హవా తగ్గి ఆటోల రాజ్యం వచ్చింది. మాలో చాలా మంది మారుతీకార్లకు ఓనర్లయ్యారు. అందరి ఇళ్ళల్లో టెలిఫోన్లు మోగుతున్నాయి. గవర్నమెంటు, ప్రైవేటు, ఫారిన్ కంట్రీస్ అలా తలా ఒక దగ్గర సెటిలై పోయాం.

ఒక గదిలో మొదలైన నా ప్రాక్టీస్ ఐదంతస్తుల నర్సింగ్‌హోం అయింది. పై అంతస్తులోనే నా నివాసం. నేనుండే ఏరియా ఇప్పుడు పెద్ద మెడికల్ సెంటరైంది. ఆ చుట్టుపక్కలంతా నర్సింగ్‌హోంలు, హాస్పిటల్స్, పాలీక్లినిక్‌లు, మల్టీస్పెషాలిటీలు, డయో గ్నోస్టిక్ సెంటర్లు, మందుల షాపులు వచ్చాయి. ఈ చుట్టుపక్కల ఏదయినా అడ్రస్ పట్టుకోవాలంటే, నా హాస్పిటలే పెద్ద కొండగుర్తు.

నేను ప్రాక్టీస్ స్టార్ట్ చేసిన దగ్గర్నుంచి టైమింగ్స్ మాత్రం స్ట్రిక్టుగా మెయిన్‌టెయిన్ చేస్తున్నాను. రాత్రి 9 గంటలయితే చాలు, పేషెంట్స్‌ని చూడను, ఎంత ఎమర్జెన్సీ అయినా సరే! ఆదివారం సెలవు. ఆ రోజున ఎంత ఎమర్జెన్సీ కేసయినా చూసేది లేదు. కిందికి దిగే ప్రసక్తేలేదు. నా పర్సనల్ లైఫ్ నాకుంటుంది కదా!

రాత్రి 10 గంటలు... హాస్పిటల్ ముందొక ఆటో ఆగింది. దాంట్లోంచి దిగిన మనిషి కంగారు కంగా రుగా లోనికొచ్చాడు.

కుర్ర డాక్టరు కన్సల్టేషన్ రూంలో కూర్చొని ఏదో మెడికల్ బుక్కు చదువుకుంటున్నాడు. హాల్లో సిస్టర్, వార్డుబోయ్ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"డాక్టర్‌గారూ .. డాక్టర్‌గారూ.. బయట ఆటోలో మా నాన్నగారు ఉన్నారు. స్పృహలో లేరు. గంట క్రితం అన్నం తింటూ పడిపోయారు. రెండు మూడు హాస్పిటల్స్‌కి తీసుకెళ్ళాం. ఎవ్వరూ చేర్చుకోలేదు. ప్లీజ్... కొంచెం చూడండి సార్!" మనిషి భయంతో

**'ఆదివారం సెలవు..రాత్రి తొమ్మిది తరువాత ఎమర్జెన్సీ కేసులు చూడబడవు' ఆ హాస్పిటల్‌కి వెళితే ముందుగా కనిపించే బోర్డది. రూల్స్‌ని తు.చ. తప్పకుండా పాటించే డాక్టరాయన. సిటీలో కాన్ఫరెన్సుకని బయలుదేరి వెళ్ళాడు. కాని కాన్ఫరెన్సుకి వెళ్ళకుండా వెనక్కి తిరిగివచ్చి 'అన్నిరోజులూ, ఇరవై నాలుగ్గంటలూ ఎమర్జెన్సీ కేసులు చూడబడును' అని బోర్డు మార్చేశాడు. ఎందుకీ మార్పు? అసలేం జరిగింది?**

వణికిపోతున్నాడు.

ఈ టైంలో ఏంటీ గోల? అన్నట్టుగా చూసిన సిస్టర్ "నైట్ నైన్ తర్వాత ఏ పేషెంట్‌నీ తీసుకోవద్దని మా పెద్ద డాక్టర్ ఇన్‌స్ట్రక్షన్స్" అంటూ ఏదో చెప్ప బోతుంటే, కుర్ర డాక్టర్ పుస్తకం మూసి లేచాడు.

ఆటోలో ఉన్న పేషెంట్‌ని ఎగ్జామిన్ చేసి, "ఇది సెరిబ్రోవాస్కులర్ యాక్సిడెంట్! మెదడులో రక్త నాళాలు చిట్లిపోయాయి. బి.పి కూడా చాలా ఎక్కు వగా ఉంది" అంటూ బి.పి ఆపరేటస్ విప్పుతూ చెప్పాడు.

"ఏదో ఒకటి చేసి మా నాన్నను బతికించండి డాక్టర్! వీలైతే పెద్ద డాక్టర్‌ని పిలవండి, ప్లీజ్ అంటూ ప్రాధేయపడ్డాడు.

"పెద్ద డాక్టరుగారు నైన్ తర్వాత ఎంత ఎమర్జెన్సీ వచ్చినా చూడరయ్యా! రేపు వచ్చి ఓపి టైంలో చూపించుకో" అంటూ బీపీ ఆపరేటస్ తీసుకెళ్తూ చెప్పింది సిస్టర్.

"ఇంత పెద్ద హాస్పిటల్లోనే ఇలా చెపితే, మేమంతా ఎక్కడికి పోవాలి సార్?"

"నన్నేం చెయ్యమంటారు? నేను డ్యూటీ డాక్టర్‌ని. మీరంతగా అడ్మిట్ చెయ్యాలనుకుంటే, చేర్చుకుని, బేసిక్ పేరామీటర్స్ అంటే బీపీ కంట్రోల్‌చేసే మందు లిచ్చి, ఫ్లూయిడ్స్ ఎక్కిస్తాం. అక్కడ కౌంటర్‌లో ఎమౌంట్ పే చేసిరండి" అంటూ స్టెతస్కోపు భుజాన వేసు కుని లోనికెళ్ళాడు కుర్ర డాక్టర్.

"గుడ్డిలో మెల్ల. ఇదిగో, లోన డబ్బు కట్టిరా! గవర్నమెంటాసుపత్రి కెల్తే గేటు కూడా తియ్యరు" ఆటోలో మనిషి చెబుతోంది. పేషెంట్‌ను ఐ.సి.యు లోకి షిఫ్ట్ చేశారు.

గంట తర్వాత ఆ హాస్పిటల్ ముందొక ట్రాక్టర్ ఆగింది. పదిమందిదాకా లుంగీలు ఎగ్గట్టిన పల్లె టూరోళ్లు దిగారు. "పురుగుమందు తాగింది" ఒక కుర్రాడు ఏడుస్తూ సిస్టర్‌తో చెబుతున్నాడు.

"ఇది పోలీస్ కేసు. ఇక్కడ తీసుకోం. గవర్న మెంటాసుపత్రికి పోండి" కుక్కల్ని కసిరినట్టు తోలే సింది సిస్టర్. ట్రాక్టర్ హాస్పిటల్ ఆవరణ దాటగానే పెద్దగా ఏడుపులు వినిపించాయి.

"చచ్చినట్టుంది. పీడ విరగడైంది. దేశ జనాభా కొంతైనా తగ్గుద్ది" సిస్టర్, వాచ్‌మెన్ జోకులేసు కుంటున్నారు.

అలాంటి ఎమర్జెన్సీలు ప్రతి రాత్రి రెండు మూడైనా ఆ ఆస్పత్రికి వస్తూనే ఉంటాయి. హాస్పి టల్ స్టాఫ్ వచ్చినవాళ్ళను తిట్టి, తిప్పి పంపిస్తూనే ఉంటారు. పై అంతస్తులో హాయిగా నిద్రపోతున్న డాక్టర్ గారికి అవేమీ కనిపించవు... వినిపించవు.

***

జోరున వాన కురుస్తోంది. హైవే మీద కారు దూసుకుపోతోంది. రోడ్డుమీద లారీలు, బస్సులు, కార్లు, హెవీ వెహికల్స్ హద్దూ అదుపూ లేనట్లు ఒక దాన్ని మించి ఇంకోటి పోటీ పడుతున్నాయి.

కారులో చల్లగా ఉంది. అద్దం మీద పడుతున్న వర్షాన్ని అవిశ్రాంతంగా తుడుస్తున్నాయి వైపర్లు. లోపల అద్దం బూజర బూజరగా ఉంది. ఏ.సి పాన ల్స్‌ని ఆ వైపు తిప్పాడు డ్రైవర్. చూపు రోడ్డుమీదే నిలిపి, డ్రైవింగ్‌మీదే కాన్సన్‌ట్రేట్ చేసి, దీక్షగా నడుపు తున్నాడు. రోడ్డుకడ్డంగా వాన తెర!

మంద్రంగా డెక్కుల్లోంచి వాయులీనం విన్పి స్తోంది. వర్షంలో ప్రయాణమన్నా, శ్రీమతితో షికా రన్నా చాలా ఇష్టం నాకు. వర్షమంటే చిన్నప్పటి నుంచీ చాలా ఇష్టం. అమ్మ తిట్టినా వర్షంలో తడిసి వచ్చేవాణ్ణి. ఇహ! వర్షంలో సముద్రం చూడ్డమంటే గొప్ప సరదా! రెయిన్ అండ్ ఓషన్ ఆర్ మార్వలెస్ క్రియేషన్ ఆఫ్ గాడ్!

ఇప్పుడు నా పరిస్థితి వేరు. చుట్టుపక్కల ఏం జరుగుతున్నదో పట్టించుకునే స్థితిలో లేను. నే వెళు తోంది జాలీ రైడ్‌కి కాదు. రేపు హైదరాబాద్‌లో జరగ బోయే ఇంటర్నేషనల్ మెడికల్ కాన్ఫరెన్స్‌కి. మన సంతా రేపు అక్కడ ప్రెజెంట్ చెయ్యబోయే టాపిక్ మీదే ఉంది.

మూడు నెలల్నుంచీ రకరకాల బుక్కు, జర్నల్స్, మ్యాగజైన్స్ రిఫర్‌చేసి నాకిచ్చిన టాపిక్ మీద ఓ ఆర్టికల్ తయారుచేశాను. రేపు జరగబోయే కాన్ఫ రెన్సులో దాన్నే ప్రెజెంట్ చెయ్యాలి. ఏదన్నా పని

తలబెడితే అది పూర్తయ్యేవరకు నా మనసు వేరే విషయాల మీద లగ్నం కాదు. ఇప్పుడు నా పరిస్థితి అదే! పక్కన బాంబులు పడ్డా పట్టించుకోను.

రేపు ప్రెజెంట్ చెయ్యబోయే టాపిక్ 'ఎథిక్స్ ఇన్ మెడికల్ ప్రాక్టీస్'. నేషనల్, ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ లలో నేనిచ్చే ఒరేషనంటే ఓ రకమైన క్రేజు. దేశ విదేశాల నుండి అతిరథ మహారథులనబడే మేధావులు వస్తారు. ఊహించని ప్రశ్నలడిగి తికమక పెట్టేస్తారు. అందుకే ఇలాంటి సమయాల్లో నా మానాన నన్ను వదిలేస్తుంది శ్రీమతి. వెనక సీట్లో కూర్చుని పాపతో ఆడుకుంటూ ఉంటుంది. వాన కురుస్తూనే ఉంది.

డిన్నర్ టైంకి హైదరాబాద్ చేరేలా ప్లాన్ చేసుకున్నాం. మధ్యాహ్నం వరకూ పేషెంట్స్‌ని చూశా. లంచ్ చేసే టైం లేదు.

"దీని వాలకం చూడబోతే రాత్రంతా కురిసేలా ఉంది" అన్నాను, చూస్తున్న పేపర్లోంచి తల పైకెత్తి.

"ఈ మధ్య ఇంతపెద్ద వాన కురవలేదు" అంది శ్రీమతి.

కారు ఏదో బ్రిడ్జి మీద పోతోంది. వర్షం జోరుకి పది గజాలు మించి కనబడడం లేదు. కాలువలో నీరు వరదలా దూకుడుగా పారుతోంది. నీటి ప్రవాహాన్ని గమనిస్తున్నాను. కారు వేగంలో ఏదో తేడా ఉంది. కారు కొంచెం దూరం పోయాక స్లో అయ్యింది. వెంటనే బ్రిడ్జి రైలింగుకు గుద్దుకుని పెద్ద శబ్దంతో ఆగిపోయింది.

"ఏమైంది?!" కంగారుపడింది శ్రీమతి.

డోరు తీసుకుని దిగాడు డ్రైవర్.

దూరంగా ఉరిమింది. పెద్ద శబ్దంతో దగ్గర్లో పిడుగు పడ్డట్టుంది. వెనక సీట్లో పాప గుక్క పట్టి ఏడుస్తోంది. సముదాయిస్తోంది శ్రీమతి. తడుస్తూ నేను కూర్చున్నవైపు డోర్ దగ్గరకొచ్చి నిలబడ్డాడు డ్రైవర్.

అద్దాలు దించాను. వర్షపు జల్లు ముఖం మీద కొట్టింది.

"వెనక టైరు పంచరైంది సార్! అదే ముందు టైరు అయితే చాలా పెద్ద యాక్సిడెంట్ అయ్యేది" అన్నాడు.

అప్పటికే అతను పూర్తిగా తడిసిపోయాడు. నాకు మూడాఫ్ అయింది. కదలకుండా అక్కడే నిలబడ్డ డ్రైవర్‌ని చూసి, "సైలెన్ స్టాండులా ఇక్కడే నిలబడక పోతే స్టెప్నీ మార్చొచ్చుగా?" అన్నాను కోపంగా.

"స్టెప్నీ లేదు సార్" అన్నాడు.

వర్షపుజల్లు నా బట్టల్ని పూర్తిగా తడిపేసింది, చేతిలో ఉన్న కాగితాలతో సహా. నా కోపం నషాళాని కంటింది.

"బయటికొచ్చేప్పుడు ఇవన్నీ చూసుకోవా?"

చేతులు నలుపుకుంటూ అలాగే నిలబడ్డాడు. జల్లు పడుతూనే ఉంది.

"అలా నిలబడి గుడ్డిగుర్రాలకు పళ్లు తోముతున్నావా? టైర్ విప్పదీసి పంచరేయించుకురా! అదీ నేనే చెప్పాలా? పదేళ్లనుంచి పనిజేస్తున్నావు. కొంచెం బుర్ర వాడండయ్యా."

"జాకీ లేదు సార్...!" మెల్లిగా బాంబు పేల్చాడు.

కోపంతో ఊగిపోయా. పేపర్లు విసిరికొట్టా. గట్టిగా గాలి పీల్చుకుని, "పంచర్లేసే షాపులు ఇలాంటి హైవేలపక్కన ప్రతి నాలుగైదు కిలోమీటర్లకు ఉంటాయ్... పోయి పిల్చుకురా!" అరిచినంత పనిజేశాను. "బియ్యం పుచ్చిపోతాయని పుడతారు... ఛీ...ఛీ" భయపడి పరిగెత్తాడు డ్రైవర్.

డోరు తీసి దిగాను. వర్షం జోరు ఏ మాత్రం తగ్గేలా లేదు. దానికితోడు ఉరుములు మెరుపులు. సీసా రేకుమీద గీచినట్టు గాలి ఒకటే రొద! రైలింగ్ చూశా. బ్రిడ్జి రైలింగ్ గట్టిగా ఉండబట్టి సరిపోయింది, లేకపోతే ఈపాటికి కారుతో సహ అందరం వరద కాలువలో కొట్టుకుపోయే వాళ్లమే! వెనక సీట్లో శ్రీమతి




## ఉగాది ప్రత్యేకం

ఈ క్రమశిక్షణ
నాకు శిక్షగా మారింది
ఈ సమయపాలన
వింత సంకటమై కూర్చుంది
పనికిరాని ప్రాముఖ్యతగా
విలువలేని దానికోసం
పట్టించుకోని వాళ్ల ముందు
వాదిస్తున్నట్టుగా ఉంది
మాట చెప్పి మరిచిపోయిన వాళ్లను
అడిగినందుకు అలకలు పోయి
నా ముఖం వాచేలా
చెంప మీద చరిచినట్టుగా ఉంది
ఇచ్చిన క్షణానికి ముందుగానే చేరడం

## మన్నించాలి

చెప్పినచోట కచ్చితంగా నిరీక్షించడం
ఎండైనా వానైనా
గడియారంతో నిలవడం
అటు చూసీ ఇటు చూసీ
రాని వాళ్లను కలగన్నట్టుగా
తలచుకొంటూ దూరం దాకా చూడడం
అనుకోకుండానే అభ్యాసం చేసుకొన్నాడు

చెమటలో తడిసి
వెళ్లిపోయేటప్పుడు
ఆలస్యంగా వచ్చినవాళ్లు
కంగారుపడకుండా, ఎదురుపడ్డప్పుడు
అడగవలసిన అవసరమే లేదన్నట్టు
నుదురుమీద గుద్దినట్టు నాకు ఎదురు చెప్పడం
విసిగిపోతే మాత్రం
దురుసుతన మెందుకని
నిందమోపి కడకు
ముఖం తిప్పుకొంటున్నారు.

ఈ క్రమశిక్షణ ఎందుకో
నాకు నిష్ఠూరంగా తయారైంది
ఈ సమయపాలన నన్ను
వెటకారం చేస్తోంది.

ఆడిన మాటకు కట్టుబడడం
అడిగినదానికి సూటిగా చెప్పడం
ఎంతమంది ముందైనా
అది ఎవరి స్వంత మిద్దైనా

తడబడకుండా మనసు విప్పడం
ఎదుటి వాళ్ళకు మోయలేనంత
బుసకొట్టినంత కోపం తెప్పిస్తోంది

నా ఆవేదనని కొట్టి పారేయాలని
పిట్టకతలు వెకిలిగా చెప్పి
ఆటలో ఓడిన పిల్లల్లా ప్రవర్తిస్తారు
సంస్కారంగా తర్కించినా
సాగదీసిన తప్పులతో
మూర్ఖంగా గాయపరుస్తారు



ఈ క్రమశిక్షణతో
కోటలు కట్టిందీలేదు
సమయపాలనతో
మూటలు సంపాదించిందీ లేదు
పెంచిన వాళ్ల నీడలో
నేర్పిన వారి ప్రేమలో
గీతలు దాటకుండా
బాటలో నడవడం
జీవితం చేసుకొన్నాను

ఎవరూ సమర్థించని
ఎక్కడా ప్రస్తావించని
చుట్టూ ఉన్న వాళ్లకు
కంటకమైన నా అలవాటుకు
ఎంతో మథన పడుతున్నాను

ఈ క్రమశిక్షణ
మిత్రుల్ని దూరం చేస్తోంది
ఈ సమయపాలన
బంధువుల్ని విరోధుల్ని చేస్తోంది
ఈ సంఘర్షణ
నాకు నిద్ర లేకుండా చేస్తోంది

—ఆశారాజు
సెల్: 93923 02255

పాపను బుజ్జగిస్తోంది. గంట తర్వాత వచ్చాడు డ్రైవర్.

"ఎవ్వరూ లేరా?"

"ఉన్నాడుగానీ... ఈ గాలివానలో ఈడదాక రానన్నాడు సార్"

"ఎందుకు రాడూ? డబ్బాశ చూపితే శవమైనా లేచి వస్తుంది! ఎంతడిగితే అంతిచ్చి తీసుకురా.. పో."

"వెయ్యి రూపాయలిచ్చినా రానన్నాడు సార్!"

షాకయ్యాను. డబ్బుకు లొంగని మనుషులు ఉంటారా?

వెనక సీట్లో చంటిది గుక్కపట్టి ఏడుస్తోంది.

"పాలు పట్టాలని తెలీదా? పిల్లల్ని కనగానే సరి గాదు. జంతువులు కూడా కంటున్నాయ్."

"సీసాలో పాలు విరిగి పోయాయండీ.."

"ఛీ! ఛీ!! పంచర్లేసే వాణ్ణుంచి ప్లంబర్ దాకా... ఈ దేశంలో ఎవరికీ బాధ్యత లేదు. మనకి అవసరం లేనప్పుడు వచ్చి పని కావాలని కాళ్లు పట్టుకుంటారు. అదే మనకవసరమై పిలిస్తే మాత్రం చెట్టెక్కి కూర్చుంటారు. ఛీ! ఛీ! ఈ దేశం ఇంకెప్పటికీ బాగుపడదు. అంతా స్వార్థపరులు! కోపంతో నేనేం మాట్లాడుతున్నానో నాకే తెలీలేదు.

ఐదు నిమిషాల్లో మామూలు మనిషినైపోయా!




నా కోపం పాలపొంగే!

పార్కింగ్ లైట్లేసి కారుని పక్కకి పెట్టాడు డ్రైవర్. రోడ్డుకిరువైపులా నిలబడి వచ్చే పోయే లారీలను, బస్సులను ఆపుతున్నాం. గంటకు పైగా ప్రయత్నించినా ఫలితం లేదు. మానవతా విలువలు పూర్తిగా అడుగంటిపోయాయి. పూర్తిగా చీకటి పడిపోయింది. ఒక లారీ దూరంగా ఆగింది. పరిగెత్తుకెళ్లా, ఆశ చావక. కనీసం జాకీ అన్నా ఇస్తే, టైరు విప్పి తీసుకెళ్ళి పంచరేయించుకొస్తాడు డ్రైవరు అన్న ఆశ!

"ఏంది ఈడ ఆపారు? ఇది దొంగల గండి! చానా డేంజర్. వెళ్లిపోండి" అంటూ ఓ ఉచిత సలహా ఇచ్చివెళ్ళాడు ఆ లారీడ్రైవర్.

గోరుచుట్టు మీద రోకటిపోటంటే ఇదేనా?

నడిసంద్రంలో నావ. ఆ పైన తుపానులా ఉంది మా స్థితి.

మెరుపు వెలుగులో బ్రిడ్జికి ఇంకో పక్క మినుకుమినుకు మంటూ దీపం కనిపించింది.

"రాత్రిపూట ఇక్కడుండడం సేఫ్ కాదు. అక్కడేదో ఇల్లున్నట్టుంది. అక్కడికెళ్దాం పద" అన్నాను.

కారును నెట్టుకుంటూ దీపం కన్పించిన చోటికి చేరాం. అదొక పూరిగుడిసె. బొగ్గుల కుంపటి ముందు కూర్చొని చలి కాచుకుంటున్నాడొక మనిషి. ఆడ మనిషి చంటిపిల్లకు పాలిస్తోంది. కారు చూసి లోనికి వెళ్లిందామె.

మగమనిషి లేచి నిలబడ్డాడు. చేతిలో బీడీ దూరంగా గిరాటేశాడు.

"యామైంది సామీ? ఈయాలప్పుడీడ?" అడిగాడు కారుచూస్తూ.

విషయం రెండు ముక్కల్లో చెప్పాడు డ్రైవర్.

"వానలో మాసెడ్డ సిక్కొచ్చిపడిందే! ఈ బ్రిడ్జికి ఇటుపక్క అటుపక్క నాలుగైదు కిలోమీటర్లు పోయినా ఏడా పంచర్లు యేసే షాపుల్లేవు. కూసింత ముందుకెల్తే గంగరమంద తగులుద్ది. ఆడ ఈ మద్దెనే ఓ తురకోళ్ల కుర్రోడు షాపు తెరిచాడు. మంచి పనోడే! ముందు సలి కాచుకోండి" అన్నాడు.

"నేనెల్తే ఈ వానలో రానన్నాడే" అంటూ బొగ్గుల కుంపటి దగ్గర కూర్చున్నాడు డ్రైవర్.

"నేషనల్ హైవే పక్కన అడుగడుక్కి దాబాలు, పంచర్లేసే షాపులుంటాయిగా.. ఇక్కడేంటి ఈ దరిదాపుల్లో ఎక్కడా లేవు?" అడిగా.

"ఈ బ్రిడ్జి దరిదాపుల్లో ఎవుళ్లూ దాబాలుగానీ, షాపులుగానీ తెరవరు బాబూ! ఇది కట్టక ముందు దీన్ని దొంగల గండి అనేవోరండి. ఈడ రోడ్డు కడ్డంగా బండరాళ్ళు పెట్టి కార్లు, బస్సులు దోసుకునేవోరండి. ఎవళ్లకీ దొరక్కుండా ఆ దొంగతూముల్లో దాక్కునే వోళ్లండీ".

"అందుకనేనా... ఇక్కడుండొద్దు వెళ్లిపొమ్మని మేము ఆపిన లారీడ్రైవర్ చెప్పింది. ఇంకా దొంగతనాలు జరుగుతున్నాయా?"

"ఇప్పుడు లేవండి?"

"ఆ దొంగల్ని పోలీసులు పట్టేశారా ఏంటి?"

"అంతేగదండీ! నూరు గొడ్లను తిన్న రాబందు ఒక్క గాలివానకి సచ్చినట్టు.. దొంగోడన్నాక పోలీసులకు ఎప్పుడోసారి సిక్కకుండా పోతాడా? ఆ జగ్గడి ముఠా అంతా మారిపోయారండి బాబూ!

గుక్కపట్టి ఏడుస్తున్న పాపను తీసుకుని నా దగ్గరకొచ్చింది శ్రీమతి.

"చంటిది గంట నుంచి పాలకోసం గుక్కపట్టి ఏడుస్తోంది. మీ దగ్గర పాలు ఏమైనా దొరుకుతాయా బాబూ" అడిగింది.

"మా దగ్గర లేవమ్మా. ఆ కనబడే ఊరెల్తే దొరకొచ్చుగానీ, సూడబోతే ఈ గాలివాన ఇప్పుడప్పుడే తెరిపిచ్చేలా లేదు తల్లీ! ఇప్పుడంత దూరం పోయి రాడం కట్టమే. అయినా పసిబిడ్డ ఆకలాగుద్దా... పోయొత్తా" అంటూ గుడిసెలోకి తొంగిచూశాడు.

"టిపినీ ఇత్తావా... కొలనుకొండ పోయి పాలు తెత్తా" అన్నాడు.

గుడిసెలోని ఆడమనిషి వచ్చి చంటిదాన్ని, శ్రీమతిని లోనికి తీసుకెళ్లింది. వెంటనే పాప ఏడుపు ఆగిపోయింది.

పాలకోసం బయలుదేరిన మనిషి ఆగిపోయాడు. అతను కుంపటిలో ఇంకొన్ని బొగ్గులు వేశాడు. వెచ్చగా ఉంది. చంటిదాన్ని తీసుకొచ్చి గోతాం పట్టా మీద పడుకోబెట్టింది. పాప నిద్రపోతోంది.

అతడు గుడిసెలోనికెళ్లి వచ్చాడు.

"బాబూ! ఇప్పటికే చానా పొద్దుపోయింది. మేమిద్దరం మద్దిగేల మిగిలిన అన్నం తిన్నాం. కొద్దిగా బియ్యం ఉంటే ఉడకేసింది. తమరేమీ అనుకోబోతే కూత్తి ఎంగిలి పడండి" అడిగాడతను.

నా వంక చూశారు శ్రీమతి, డ్రైవర్. అందరం ఆకలి మీదున్నాం. ఈ ఇబ్బంది లేకపోతే ఇప్పటికి హైదరాబాద్ చేరి డిన్నర్ చేసే వాళ్లమే!

"తెల్లారేదాకా ఇంక ఏ దారీ లేదు బాబూ!" అన్నాడు తను వర్షాన్ని చూస్తూ.

నాలోని అహం వెనక్కి లాగిందిగానీ ఆకలి నకనకలాడుతోంది. లంచ్ కూడా చెయ్యకుండా బయల్దేరా. తలూపాను తింటామన్నట్టుగా.

పొగలు గక్కుతున్న అన్నం గిన్నె, మూడు సత్తు పళ్లాలు తీసుకొచ్చాడు. ఉడుకుడుకు అన్నంలో ఎర్ర కారం వేసుకుని తింటుంటే అమృతంలా ఉంది.

పొడిబట్టలు మార్చుకుని కారులోనే నిద్రపోయాం.

ఉదయాన్నే నిద్రలేచాం. వాన కురుస్తూనే ఉంది. గాలి దూకుడు తగ్గింది. అప్పటికే టైరు మార్చేసి కారు రెడీ చేశాడు డ్రైవర్. చంటిదానికి ఫీడింగ్ ఇప్పించేసి తీసుకొచ్చింది శ్రీమతి. పాప కేరింతలు కొడుతూ ఆడుకుంటోంది. ఆ పాప మాకు పెళ్ళైన పదిహేనేళ్లకు లేక లేక పుట్టిన అపురూపం!

"మా అందరికీ ఆశ్రయమిచ్చి కడుపునింపి ఆదుకున్నావ్. నీ ఋణం జన్మలో తీర్చుకోలేం. ఇదిగో ఇదుంచు" అంటూ నేను డబ్బివ్వబోతే – తీసుకోలేదతను.

"మీరు బలేవోరండీ! ఇదేమంత పెద్ద సాయం బాబు! మీ బోటి గొప్పోళ్ళు మా దగ్గరకు రావడమే మాకానందం బాబూ!" అంటూ చేతులెత్తి దండం పెట్టాడు. ఆడమనిషి అతని పక్కనే నిలబడి ఉంది. ఆమె చంకలోని పాప మమ్మల్ని చూసి బోసినవ్వులు కురిపిస్తోంది. మా పాప ఈడే!

"పోనీ నీకు ఎప్పుడైనా ఏదన్నా సాయం కావాల్సి వస్తే మా దగ్గరకు రా" అంటూ నా విజిటింగ్ కార్డ్ ఇచ్చాను. తీసుకున్నాడు. కారు స్టార్ట్ చేశాడు డ్రైవర్.

"అన్నట్టు అడగడం మరిచా! నీ పేరేంటోయ్?" అన్నాను కారు అద్దం దించి.

"జగ్గడు అంటారు బాబు!" అన్నాడు కారు దగ్గరకు వచ్చి.

కారు రోడ్డెక్కింది. బ్రీఫ్‌కేస్‌లోని పేపర్లు తీశా. ఆ రోజు కాన్ఫరెన్స్‌లో ప్రెజెంట్ చెయ్యబోయే పేపర్స్ చూసుకుంటున్నా. పేపర్లన్నీ తడితడిగా ఒకదానికొకటి అతుక్కుపోయి ఉన్నాయి.

పేపర్లలో మునిగిపోయిన నాకు ఏదో తట్టి – "అవునూ.. ఆ గుడిసె మనిషి తన పేరేంటన్నాడు?"

"జగ్గడు సార్!"

"జగ్గడంటే...?"

"మీరు ఊహించింది కరెక్టే సార్! ఇంతకు ముందు ఆ దొంగల గండి మీద దొంగతనాలు, దోపిడీలు చేసిన ముఠా వీళ్లదే సార్!"

నా పక్కన బాంబు పేలినట్టయింది. ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను.

"ఆ గజదొంగ జగ్గడు ఇతనే సార్! ఆ దొంగల ముఠాను పోలీసులు పట్టుకుని రాజమండ్రి సెంట్రల్ జైల్లో పెట్టారంట! సత్ప్రవర్తన కింద ఆరేళ్ల కిందట వదిలేశారంట సార్!"

వెనక్కి తిరిగి చూశాను. శ్రీమతి మెడలో డైమండ్ నెక్లెస్ సెట్, చేతి బంగారు గాజులు అలాగే ఉన్నాయి. పాప చేతులకు, చెవులకున్న బంగారం చెక్కుచెదరలేదు. నా చేతి వాచీ, ఉంగరాలు చూసుకున్నాను. టైం ఎనిమిది గంటలైంది.

"జైలు నుంచి తిరిగొచ్చాక భార్యాబిడ్డల ఆచూకీ దొరకలేదంట. అప్పటినుంచి ఈ బ్రిడ్జి మీదే గుడిసె వేసుకుని ఉంటున్నాడంట!"

"ఇప్పుడున్న ఆడమనిషి ఇతని భార్య కాదంట! ఎవరో మోసం చేసి ప్రెగ్నెంట్ చేస్తే సూసైడ్ చేసుకుందామని బ్రిడ్జి మీద నుంచి కాలువలోకి దూకిందంట! ఇతనే రక్షించాడంట! అప్పట్నించీ ఇతని దగ్గరే ఉంటోంది. ఇక్కడే డెలివరీ అయ్యిందట? అందుకే వాళ్లిద్దరి మధ్య ఆ ఏజ్ డిఫరెన్సు చూశారా?"

"ఆయన కాలవలో చేపలు పడితే ఈవిడ చుట్టుపక్కల ఊళ్లల్లో అమ్ముకొస్తుందట సార్! మిగతా సీజన్లో జాంకాయలు, మామిడిపళ్ళు, జొన్నపొత్తులు అమ్ముతుంటాడట! రాత్రుళ్లు మాత్రం జీతం బత్తెం లేకుండా బ్రిడ్జికి కాపలా కాస్తాడంట!

"అవునండి! ఈ ఆరేళ్ళలో ఈ బ్రిడ్జి మీద ఒక్క దొంగతనం, దోపిడీ జరగలేదంట! అతని గురించి ఎంత గొప్పగా చెప్పిందో ఆవిడ! ఇతన్ని చూస్తే గజదొంగని ఎవరన్నా అనుకుంటారా?"

"మనమంతా నిద్రపోతే రాత్రంతా మన కారుకి కాపలా కాశాడు సార్! పొద్దున్నే నిద్ర లేవకముందే ఆ పంచర్లేసే తురకోళ్ల కుర్రాణ్ణి తీసుకొచ్చాడు. డబ్బులు ఇవ్వబోతే పైసా కూడా తీసుకోలేదా కుర్రాడు."

"ఇంకా ఇక్కడే ఎందుకుంటున్నట్టు? టౌనుకొచ్చి ఏదో ఒక పని చేసుకుని బ్రతకొచ్చుగా! ఇక్కడ పలకరించే మనిషి లేడుగా" అన్నాను కంటి అద్దాలు తుడుచుకుంటూ.

"చచ్చిపోయేదాకా ఆడే ఉంటాడంట సార్!"

"అంత పట్టుదల దేనికోయ్?"

"ఆ బ్రిడ్జికి దొంగల బ్రిడ్జి అనే పేరు పోయేదాకా ఆడే ఉంటాడంట!"

"వెరీ ఇంటరెస్టింగ్ క్యారెక్టర్!!"

వర్షం కురుస్తూనే ఉంది. వాళ్ల గురించి శ్రీమతి చాలా పాజిటివ్‌గా చెబుతోంది. డ్రైవర్ అయితే అతన్నో పెద్ద హీరోలా పొగిడేస్తున్నాడు.

తిరిగి పేపర్స్‌లో తల దూర్చాను. కారు దూసుకుపోతోంది. వర్షం తగ్గే సూచనలు లేవు. అక్షరాలు అల్లుకుపోయినట్టనిపిస్తోంది. తల విదిలించి, మళ్లీ పేపర్స్ చూడసాగాను. ఏదీ సరిగ్గా కన్పించడం లేదు. అంతా బూజర బూజరగా ఉంది. నా మనసు గందరగోళంగా ఉంది. కళ్ళజోడు తీసి తుడుచుకున్నాను. రోడ్డు పక్కన దాబాలున్నాయి. చాలా కార్లు ఆగి ఉన్నాయి.

కారాపమన్నాను. ఆపాడు. కాఫీ తాగాలని అనిపించింది. తాగాను. నాకు టిఫిన్ తినాలనిపించలేదు. వాళ్లు తిన్నారు.

ఇంకో కాఫీ తాగుతూ దాబాలో కూర్చొని వర్షాన్ని చూస్తున్నాను. ఎంతసేపు చూసినా తనివి తీరడం లేదు. అలా చూస్తూనే ఉన్నాను. ఎంతసేపయిందో.. శ్రీమతి తట్టిలేపేదాకా ఈ లోకంలోకి రాలేదు.

"మీకు కాన్ఫరెన్సుకు లేటవుతుంది. ఇక వెళ్దామా?" అంది.

"మనం వెనక్కి, ఇంటికెళ్తున్నాం. కాన్ఫరెన్సుకి వెళ్ళటం లేదు."

"అదేం?! మీరు కాన్ఫరెన్స్‌లో పేపర్ ప్రెజెంట్ చెయ్యాలిగా?"

"ఇంతకాలం మెడికల్ ఎథిక్స్ మీద ఇచ్చిన స్పీచ్‌లు చాల్లే!" అన్నాను పెద్దగా నవ్వుతూ.

ఊరు చేరుకున్నాక, కారు దిగి ముందుగా చేసిన పని హాస్పిటల్ బోర్డు మార్పించటం! దాని మీద ఇలా రాయించాను.

"ఈ హాస్పిటల్‌లో అన్నిరోజుల్లోనూ 24 గంటలు ఎమర్జెన్సీ కేసులు చూడబడును. ఈ హాస్పిటల్‌కి సెలవు లేదు."

***

కాలచక్రం పది సంవత్సరాలు ముందుకు సాగింది. ఇప్పుడు ఎవరి చేతుల్లో చూసినా సెల్ ఫోన్లే! ఏ ఊర్లో చూసినా పెద్దపెద్ద మాల్స్! మల్టీప్లెక్స్ థియేటర్లు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన కార్లన్నీ ఇండియా రోడ్లమీద తిరుగుతున్నాయి. ఏ ఇంట్లో చూసినా ఫ్లాట్ టి.విలు, కంప్యూటర్లు.

"పగలనక రాత్రనక 24 గంటలు పేషెంట్లకు మితిమీరిన సర్వీస్ చేస్తున్నారు. ఇలా అయితే మీ ఆరోగ్యం ఏంకాను డాక్టర్?! ఫీజులు కూడా మరీ తక్కువగా తీసుకుంటున్నారు. ఇలా అయితే మన ప్రొఫెషన్ చులకన కాదా?" అంటూ తోటి డాక్టర్లు సలహాలివ్వబోయే వారు.

"ఆకలి బాధ, నిజమైన ఎమర్జెన్సీ అంటే ఏమిటో మీకేం తెల్సు!" అంటూ నెరసిన జుత్తును సవరించుకుంటూ నవ్వేవాడు ఆ పెద్ద డాక్టర్!

***సెల్: 94407 47768***



## మళ్ళీ అతగాడి లవ్‌లో కత్రినా?

కత్రినాకు హీరోయిన్‌గా లైఫ్ ఇచ్చింది కండల వీరుడు సల్మాన్‌ఖాన్ అన్న విషయం జగద్విదితం. ఒకప్పుడు ఇద్దరూ పీకల్లోతు ప్రేమలో పడ్డారు కూడా! అదంతా గతం. మధ్యలో ఇద్దరూ చాలా మంది లవర్స్‌ని మార్చారు. ఊయల ఎక్కడ మొదలవుతుందో తిరిగి అక్కడికే వచ్చి ఆగినట్టు ఇప్పుడు ఇద్దరూ ఒకేగూటికి చేరారు అంటున్నారు సినీజనాలు. ప్రస్తుతం ఇద్దరూ కలిసి ఓ సినిమాలో నటిస్తున్నారు. షూటింగ్ కోసం విదేశాలకు వెళ్ళిన ఈ జంట షూటింగ్ పని అయిపోగానే ప్రేమించుకునే పనిలో పడ్డారట! ఇద్దరూ మునుపటి కన్నా బాగా క్లోజ్ అయ్యారన్నది బాలీవుడ్ టాక్. రణబీర్‌తో బ్రేకప్ తరువాత కత్రినా ఇంతవరకూ ఎవరితోనూ జత కట్టలేదు.



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 26

(గతవారం తరువాయి)

**ఇన్నేళ్ళ నా అనుభవం నాకు నేర్పింది ఏమిటంటే, సినిమా పరిశ్రమలో మాటామాటా అనుకుంటూ ఉంటారుగానీ అది శాశ్వతం కాదు. ఎన్నో మాటలు వస్తూ ఉంటాయి, పోతూ ఉంటాయి, ఇది మామూలే. పెద్దపెద్దవాళ్ళు చాలామంది కూడా ఇలాంటివి ఇంకెంత ఫేస్ చేసి ఉండాలి?**

## నాకు ఆ ముగ్గురంటే చాలా ఇష్టం

వివాదాల సంగతి పక్కనపెడితే నేను నటుడినే అయినప్పటికీ నాకు నచ్చే నటులు కూడా కొందరు ఉంటారుగా. నాగార్జునగారు, వెంకటేశ్‌గారి తరాన్ని పక్కన పెడితే ఈ తరంలో నేను మెచ్చే నటులు ముఖ్యంగా ముగ్గురు. వారిలో ఎన్టీఆర్ ఒకరు. తారక్ నన్ను బాబాయ్ అంటాడు. నా దృష్టిలో అతను సంపూర్ణ నటుడే. నేను గమనించిన బలాలు అతనిలో మూడు ఉన్నాయి. అందులో మొదటిది భాష. అతని ఉచ్చారణ చాలా స్పష్టంగా ఉంటుంది.

తెలుగు మాట్లాడుతుంటే ఎంత పెద్ద డైలాగుకైనా వన్స్‌మోర్ కొట్టాలనిపిస్తుంది. అంత స్వచ్ఛంగా చెబుతాడు. పైగా అతను చెబుతుంటే పిల్లకాయ మాట్లాడుతున్నట్టుగా ఉండదు. ఓ పద్ధతి, వ్యవహారం ఉన్న ఓ వ్యక్తి చెబుతున్నట్టు ఉంటుంది. శ్రోతకు అలాంటి భావన కలిగిందంటే వక్త సక్సెస్ అయినట్టే. రెండో ప్లస్ పాయింట్ అతని చలాకీతనం. చాలా కలుపుగోలుగా ఉంటాడు. ఎప్పుడూ ఎనర్జిటిక్‌గా ఉంటాడు. డీలాపడటం, నీరసపడటం వంటివి అతనికి చేతకాదు. హీరో అనే వ్యక్తి యాక్టివ్‌గా ఉంటే సెట్‌లోనూ ఆ వాతావరణం ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఇక నేను గమనించిన మూడో విషయం, ప్రధానమైన అంశం అతని నటన. ఎదుటివారిని నమ్మించగలడు, నవ్వించగలడు, కంటనీరు పెట్టించగలడు, డ్యాన్సులు, ఫైట్లు ఈజ్‌తో చేయగలడు. ఇవన్నీ అతనికి బలాలే. ఇన్ని బలాలకు తోడు అతనిలో అణకువ ఉంది. పెద్దలంటే గౌరవం ఉంది. ఒకసారి ఓ సభలో మాట్లాడుతూ "కోట శ్రీనివాసరావుగారు గొప్ప నటుడని చెప్పడానికి నేను ఇక్కడికి రాలేదు. ఆయన సెట్లో ఉంటే నేను చాలా అలర్ట్‌గా ఉంటానని చెప్పడానికి వచ్చాను. సెట్లో మామూలుగా మాట్లాడే కోటగారు, కెమెరా ముందు నిలుచుంటే విజృంభిస్తారు. ఆయన టైమింగ్ పట్టుకోవడం ఎదుటి ఆర్టిస్ట్‌కి ఒక రకంగా సవాలులాంటిదే" అన్నాడు. చిన్నవాడైనా అంత బాగా ఎప్పుడు గమనించాడా అని ఆశ్చర్యపోవడం ఆ వేదికమీద నా వంతయింది.



### పెద్దల కోసం...

బన్ని ఏం చేసినా నాకు ప్రత్యేకంగా అనిపిస్తుంటుంది. 'సాధనమున పనులు సమకూరు ధరలోన..' అనే మాటను సాధన చేశాడేమో అనిపిస్తుంది. ప్రతి సినిమాకూ ఎదుగుతున్నాడు. యువతలో తనకంటూ ఓ ప్రత్యేకత, పాపులారిటీ సంపాదించుకుని కొనసాగుతున్నాడు. కొన్నిసార్లు అతను నటిస్తుంటే 'అతనిలో అంత శక్తి ఉందా?' అని అనుమానం వస్తుంటుంది. వర్క్ విషయంలో చాలా కమిటెడ్‌గా ఉంటాడు. చేసే ప్రతిదాన్నీ చాలా జాగ్రత్తగా చేస్తాడు. 'నేను ఫలానా అల్లు రామలింగయ్యగారి మనవడిని, అల్లు అరవింద్‌గారి అబ్బాయిని, చిరంజీవిగారి మేనల్లుడిని... నేను చేసే పనుల వల్ల వారికి చెడ్డపేరు రాకూడదు. నేనేం చేసినా మా వాళ్ళందరికీ మంచి పేరు తీసుకురావాలి. అందుకోసం అహర్నిశలు కష్టపడటానికైనా సిద్ధంగా ఉండాలి' అనే ఆలోచన ఉన్న వ్యక్తి బన్ని. అతని డ్యాన్సులకు చిన్నపిల్లల నుంచి ఎంతో మంది ఫ్యాన్స్ ఉన్నారు. డైలాగులు నేటితరానికి కనెక్ట్ అయ్యేలాగా చెప్పడంలో సిద్ధహస్తుడు. అందుకే బన్ని ఈ జనరేషన్ బోయ్. ఒకసారి వాళ్ళ తాతగారు అల్లురామలింగయ్యగారి అవార్డు నాకు ఇస్తూ ఆ వేదిక మీద "ఇన్నాళ్ళకి మా తాతగారి పేరు మీద ఇస్తున్న ఈ అవార్డుకు గౌరవం వచ్చింది, శ్రీనివాసరావుగారికి ఇవ్వడం వల్ల" అన్నాడు. అతని మనసులో నా పట్ల ఉన్న గౌరవానికి చాలా ముచ్చట అనిపించింది.

### హ్యాండ్సమ్ మహేశ్

మహేశ్‌బాబు పేరు గుర్తుకురాగానే ప్లెజెంట్‌గా అనిపిస్తుంది. అందరూ మెచ్చుకునే లవబుల్ బోయ్ అతను. చూడ్డానికి చక్కగా, నీట్‌గా ఉంటాడు. కృష్ణగారి అబ్బాయిగా అతను నాకు చిన్నప్పటి నుంచి తెలుసు. తెరమీద ఫైట్లూ అవీ చేసినా మనిషి పొడుగ్గా ఉంటాడు కాబట్టి అదో స్పెషల్‌గా అనిపిస్తుంటుంది. స్క్రీన్‌మీద ఎంతమంది ఉన్నా అతనుంటే మిగిలిన వాళ్లు కనిపించడం కాస్త కష్టమే.

అందగాడు కాబట్టి పిల్లలకి, ఆడవాళ్లకి, మగవారికి అనే తేడా లేకుండా అందరికీ నచ్చుతాడు. అతను నటించిన 'పోకిరి' సినిమాకి, 'శ్రీమంతుడు' సినిమాకి ఎక్కడైనా సంబంధం ఉంటుందా? రెండు సినిమాల్లోనూ తనదైన మార్కు నటన చూపించాడు. 'సీతమ్మవాకిట్లో సిరిమల్లె చెట్టు' అయితే ఎన్నిసార్లు చూసినా తనివితీరదు.

అందుకే ఈ ముగ్గురు నాకు చాలా బాగా ఇష్టం. మిగిలిన వాళ్లల్లో అంత పొటెన్షియాలిటీ ఉన్నట్టున్నా ఎక్కడా బయటికి వచ్చినట్టు నాకు అనిపించదు. ఏదో వస్తున్నారు.. చేస్తున్నారు.. కాదనట్లేదు. ఇప్పటికిప్పుడు పరిశ్రమలో హీరోలను లెక్కబెడితే ఎంత లేదన్నా 30, 40 మంది ఉన్నారండీ. కానీ చటుక్కున ఎవరి పేరు కూడా మనకి గుర్తుండదు. అందులోనూ ఇప్పుడేమో కాస్త ఫ్యాషన్ గోల ముదిరింది కదా... ప్రతి ఒక్కరూ గడ్డాలు, మీసాలు పెంచుకుని యాక్ట్ చేస్తుంటారు. గబుక్కున వారిని చూసి గుర్తుపట్టలేం. వయసు మీదపడి నేనూ కాస్త పెద్దవాడిని అయ్యాననుకోండి. ఇలా అంటున్నానని కాదండీ.. ఇవాళ ఉన్నటువంటి ఈ ఫ్యాషన్ గోల (గడ్డాల గోల) వల్ల ఎవరూ సరిగా ప్రేక్షకులకు రిజిస్టర్ కావడం లేదని నా అభిప్రాయం.

### త్రివిక్రమ్ సో స్పెషల్!

హీరోల సంగతి పక్కనపెడితే దర్శకుల్లో త్రివిక్రమ్ అంటే నాకు బాగా ఇష్టం. ఒకప్పుడు ఆత్రేయగారు, మొన్నటిదాకా జంధ్యాలగారు రాసేవారు కదా. ఆ కోవలో రాయగల రచయిత త్రివిక్రమ్. ఏమీ అన్నట్టే ఉండదు, భాషను పలికినట్టే అనిపించదు గానీ అతని మాటల్లో భావం అక్షరాల్లో పెడితే పేజీల కొద్దీ రాసుకోవచ్చు. అలతి అలతి పదాలు అంత గొప్ప భావాన్ని మోస్తాయని మనం కూడా ఊహించం. తీరా త్రివిక్రమ్ సినిమాల్లో విన్న తర్వాత 'భలే చెప్పాడురా' అనుకుంటాం. త్రివిక్రమ్ గొప్ప సంస్కారవంతుడు. అంతే చదువరి. గాల్లోనుంచి ఏదో సృష్టించేయాలని అనుకునే వ్యక్తిత్వం కాదు. ఏం చెప్పినా, ఏం రాసినా దానికో పద్ధతి ఉండాలనుకుంటారు. అదే లేకుంటే ఇంతమంది చేత 'శభాష్' అనిపించుకోవడం ఎంత కష్టమో కదా? ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే...

నేను ఒకసారి అమెరికా వెళ్లా. తానాకో, ఆటాకో సరిగా గుర్తులేదు. కానీ వాళ్ల ఆహ్వానం మీదే వెళ్లా. రిటర్న్ ఫ్లైట్ తెల్లారుజామున 5.15కి అనుకుంటా, హైదరాబాద్‌లో ల్యాండ్ అయింది. బయటికి రాగానే ప్రొడక్షన్ మేనేజర్ ఎదురొచ్చి 'సార్, కారు రెడీగా ఉంది. రామోజీ ఫిల్మ్‌సిటీలో షూటింగ్' అన్నాడు. సరే, ఇక ఇంటికొచ్చి మరలా ప్రయాణం చేయడం ఎందుకని అటు నుంచి అటే రామోజీ ఫిల్మ్‌సిటీకి వెళ్లా. ఆ రోజును నేను జీవితంలో మర్చిపోలేనండీ.

నేను వెళ్లేసరికి అప్పుడప్పుడే అంతా షూటింగ్ స్పాట్‌కి చేరుకుంటున్నారు. ప్రొడక్షన్ మేనేజర్ వచ్చి, "త్రివిక్రమ్ సినిమా అండీ... 'అత్తారింటికి దారేది' అనే పేరు అనుకుంటున్నారు. పెద్ద వేషం కూడా ఏమీ కాదు. త్రూ అవుట్ ఉండదు. సెకండాఫ్‌లో



ఉంటుంది. కానీ ప్రాధాన్యం ఉన్న పాత్ర" అని చెప్పాడు.

అంతలో మేకప్‌మేన్ వచ్చాడు. అతనిచ్చిన పంచె కట్టుకుని, టీ షర్టు వేసుకుని, పైన కోటు తొడుక్కుని, నెత్తికి తలపాగా పెట్టుకుని అద్దంలో చూసుకుంటే గమ్మత్తుగా అనిపించింది. త్రివిక్రమ్ కనిపించి విష్ చేసి, 'చాలా బావుందండీ' అని వెళ్లారు.

పవన్ కల్యాణ్, అలీ, నదియా, రావు రమేశ్, డా.భరత, ప్రణీత అందరూ స్పాట్‌కు చేరుకున్నారు. అంతలో, 'నీ బిడ్డ పేవంటే (ప్రేమంటే) అంత గౌరవిస్తున్నావు. నా బిడ్డ పెళ్లంటే గుడ్డెంటుకంత

**కోట శ్రీనివాసరావుగారు ఎంతటి నటుడైనా ఆయనకూ ఇష్టాయిష్టాలు ఉంటాయిగా. ఆయనకు ముగ్గురు హీరోలంటే చాలా ఇష్టం. మిగిలిన వాళ్లలో అంత పొటెన్షియాలిటీ ఉన్నట్టున్నా ఎక్కడా బయటికి వచ్చినట్టు అనిపించదంటారాయన. ఎంత లేదన్నా ఇండస్ట్రీలో 30, 40 మంది హీరోలున్నా గానీ ఫ్యాషన్‌గోల వల్ల ఎవరూ సరిగా ప్రేక్షకులకు రిజిస్టర్ కావడం లేదంటారు కోట. ఇంతకూ ఆ ఫ్యాషన్ గోలేమిటి?**

గౌరవం లేదు ఈడికి... దాని పెండ్లికొండిన పలావు వాసన పదూళ్ళకి తగలాలనుకున్యా. ఇప్పుడీ గొడవ నూరూళ్ళకి తెలిసింది. ఎంత బైశాట్ల్యా. ఈడబ్బ కట్నం దొబ్బె, ఈడు నన్ను దొబ్బె. నా బతుకు దూదికంటె సులకన, నీటికంటె పలసన అయిపోయె.. నువ్వు పెద్ద లాయరువంటగదా! నువ్వే న్యాయం జెప్పు స్వావే.. చెప్పూ..!' అనే డైలాగున్న కాగితాన్ని తెచ్చిచ్చాడు సుధాకర్. అతను త్రివిక్రమ్ దగ్గర కో డైరెక్టర్‌గా పనిచేస్తున్నాడు.

తనిచ్చిన కాగితాన్ని చూస్తూ ఉంటే, 'చూడు కోటయ్యా... త్రివిక్రమ్ ఈ సీన్ నీకు ఊరికే తమాషాకి పెట్టలేదు. మాటలు కూడా చాలా ప్రత్యేకమైన యాసలో రాశారు. అవి ఎవరో మాట్లాడుతుంటే పట్టుకున్నవి కాదు, ఈ పాత్ర కోసం కొన్ని పుస్తకాలు తెప్పించి, చదివి అందులోని పదాలు పట్టుకుని వాటిని డైలాగుల్లో పెట్టి నీకోసం రాశారు. అటు నెల్లూరు కాదు, ఇటు చిత్తూరు కాదు... అదో టైపులో ఉంటుంది యాస. నీకే తర్వాత్తర్వాత అర్థమవుతుంది" అన్నాడు.

తను అటు వెళ్లగానే ఇంకోసారి డైలాగ్ చదువుకున్నా.

'ఎంత బైశాట్ల్యా.. పలావ్ వాసన పది జిల్లాలు కొట్టాలి..' అనే పదాలు నాకు బాగా నచ్చాయి. బైశాట్ల్యా అంటే అర్థం కాలేదు. కనుక్కుంటే 'అవమానం' అనే అర్థం వస్తుందని చెప్పారు.

'షాట్ రెడీ' అనగానే వెళ్ళి చేసొచ్చా.

త్రివిక్రమ్ నా దగ్గరికొచ్చి 'మీరున్నారనే ధైర్యంతోనే అలాంటి డైలాగులు రాశానండీ' అన్నారు.

అదేంటండీ అని అంటే 'మీరనీ, మీరైతేనే చెప్పగలుగుతారనీ రాశాను' అన్నారు.

ఆ సినిమా ఇప్పుడు టీవీలో వచ్చినా చాలా మంది ఫోన్లు చేసి 'సీమ యాస'ను ఎంత బాగా పట్టుకున్నారండీ అంటుంటారు. క్రెడిట్ మొత్తం త్రివిక్రమ్‌దేనండీ అని చెబుతుంటాను నేను. ఎన్ని పాత్రలు చేసినా కొన్ని మనసుకు దగ్గరగా ఉంటాయి. 'అత్తారింటికి దారేది'లో పాత్ర అటువంటిదే. ఆ వేషం విషయంలో నిజంగా త్రివిక్రమ్‌కి చాలా రుణపడి ఉన్నా. ఇంత పెద్ద మాట ఎందుకంటున్నానంటే సోషల్ పిక్చర్‌లో అలా వెరైటీగా గెటప్ పెట్టి, అంతటి ఇంపాక్ట్‌తో పాత్ర రాయడమంటే మాటలు కాదు. అనుకున్నప్పుడల్లా అలాంటి పాత్రలు కూడా పడవు.

బన్నితో నటించిన 'జులాయి' కూడా అంత మంచి చిత్రమే. బనియన్ వేసుకుని, పంచె కట్టుకుని మెడలో రుద్రాక్షతో నల్లదారం వేసుకుని చాలా బావుంటుంది ఆ పాత్ర. దాని గురించి వచ్చే వారం చెబుతా.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**

# మహానంది




-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

**కుబేరవర్మ కొలువు కూటం నగర ప్రజలతో కిక్కిరిసి ఉంది. పురుషులూ, యువతులూ, యువకులూ, బాలబాలికలూ, -అన్ని వయసుల వాళ్ళూ- అదృశ్యమైపోయి మళ్ళీ సురక్షితంగా ప్రత్యక్షమైన తమ ప్రియమైన యువరాణిని దర్శించడానికి తండోప తండాలుగా వచ్చారు.**

**ఎత్తుగా ఉన్న స్వర్ణాసనాల మీద మహారాజూ, మహారాణీ కూర్చున్నారు. వాళ్ళ మధ్య మరో స్వర్ణాసనం మీద యువరాణి లాలస కూర్చుంది. సభాంగణంలోని వేలాది నేత్రాలు లాలస మీదనే ఉన్నాయి. రాజదంపతులకు కొంచెం దూరంలో ధగధగ మెరిసిపోతున్న కాషాయ వస్త్రాలలో ఉన్న నంది కూర్చుని ఉన్నాడు. క్షేమంగా తిరిగి వచ్చిన లాలసనూ, ఆమెను సురక్షితంగా తీసుకు వచ్చిన నిత్యనిర్మలానంద యోగినీ మార్చి మార్చి చూస్తున్నారు.**

"సాగరామాత్యా..." అన్నాడు అర్థవంతంగా కుబేరవర్మ.

సాగరామాత్యుడు లేచి నిలుచున్నాడు. సభలో ఉన్న వాళ్ళందరినీ కలియజూశాడు. "స్వయంవరం నాడు అదృశ్యమైన మన యువరాణిగారిని అనుక్షణమూ కాపాడుతూ మన మధ్యకు తీసుకువచ్చి, మన రాజ్యానికి బహూకరించిన మహానుభావులు శ్రీశ్రీశ్రీ నిత్యనిర్మలానందుల వారు. ఆ యోగి పుంగవులను మహారాజుగారూ, మహారాణిగారూ, యువరాణిగారూ, రాజోద్యోగులూ పూలమాలలతో సత్కరిస్తారు." మహామంత్రి ప్రకటనను హర్షధ్వానాలు స్వాగతించాయి. ముగ్గురు పరిచారికలు పూలదండలున్న బంగారు పళ్ళేలతో రాజదంపతులను సమీపించారు. మహారాజు లేచి ఒక దండను అందుకుని నందివైపు నడిచాడు. మహారాణి మహిమాదేవీ, లాలసా పూలదండలు తీసుకుని కుబేరవర్మను అనుసరించారు.

కుబేరవర్మ పెద్ద పూలదండను వినయ విధేయతలతో నంది మెడలో వేశాడు. చేతులు జోడించి నమస్కరించాడు. హర్షధ్వానాలు సభాంగణంలో ప్రతిధ్వనిస్తున్నాయి. మహారాణి తన చేతుల్లోని దండను భక్తితో నందికి చూపించి, మహారాజుకు అందించింది. కుబేరవర్మ ఆ దండను నంది మెడలో వేశాడు. మహారాణి నందికి నమస్కరించింది. లాలస తన చేతుల్లోని దండను కుబేరవర్మకు అందించింది. కుబేరవర్మ లాలస మాలికను నంది మెడలో వేశాడు. లాలస చేతులు జోడించి చిరునవ్వుతో నందికి నమస్కరిస్తోంది. నంది దీవిస్తున్నాడు.

తదనంతరం రాజోద్యోగుల వంతు వచ్చింది. రాజగురువు సులోచనాచార్యుడు, సాగరామాత్యుడు, సమరసేనుడు, భద్రకుడు, అర్చకుడు కాత్యాయనాచార్యుడు వరుసగా నంది మెడలో



దండలు వేసి నమస్కరించారు. మహామంత్రి నందికి ఒక్కొక్కరినే పరిచయం చేశాడు. తన మెడలో వాలుతున్న పుష్పమాలలను నంది ఎప్పటికప్పుడు తీసివేసి, దగ్గరలో నిలుచున్న సేవకుడికి ఇస్తున్నాడు. ఆస్థాన లేఖరి నందకుడు పూలమాలతో నందిని సమీపించాడు. సాగరామాత్యుడు అతన్ని నందికి పరిచయం చేశాడు. నందకుడు భక్తితో తల వాల్చి, మాలను నంది మెడలో వేశాడు. క్షణంలో నంది ముఖం మీద చిరునవ్వు మాయమైపోయింది.

"అబ్బా!" అంటూ అరిచి, నందకుడు వేసిన దండను తీసి, పామును విసిరివేసినట్టు దూరంగా విసిరేశాడు నంది. అప్పటిదాకా ఆపకుండా వినిపించిన హర్షధ్వానాలు ఒక్కసారిగా ఆగిపోయాయి.

"మంట!మంట!" నంది బిగ్గరగా అన్నాడు.

నందకుడు, ఇతర రాజోద్యోగులూ, రాజదంపతులూ, లాలసా అందరూ అర్థం కానట్టు చూస్తున్నారు.

"స్వామీ..." మహారాజు ఆశ్చర్యంగా అన్నాడు.

"ఇతను వేసిన దండ అగ్నిలతలా నా శరీరాన్ని కాల్చింది!" మెడను చేత్తో రుద్దుకుంటూ అన్నాడు నంది.

"పూలదండ మంటపెట్టిందా? ఏమిటీ విచిత్రం?" అంటూ కుబేరవర్మ నందకుడి వైపు తీక్షణంగా చూశాడు. "నందకా! ఏమిటిది?"

"ప్రభువులు మన్నించాలి. నా భార్య స్వయంగా స్వామి వారికి అలంకరించడానికి భక్తితో ఈ



మాలను గుచ్చింది..." నందకుడు చేతులు కట్టుకుంటూ అన్నాడు.

కుబేరవర్మ నందివైపు అయోమయంగా చూశాడు.

"ఆ సతీమణి గుచ్చిన మాల ఇతని స్పర్శతో మలినమైంది మహారాజా.." నంది నందకుడి కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

"మలినమైందా? అందుకు కారణం చెప్పగలరా స్వామీ?" కుబేరవర్మ అడిగాడు.

నంది కళ్ళుమూసుకుని కుడిచేతి చూపుడు వేలును నుదురు మీద కనుబొమల మధ్య ఉంచుకున్నాడు. అందరూ ఆశ్చర్యంగా నందినే చూస్తున్నారు. నంది చేతిని తీసివేసి కళ్ళు తెరిచి, కుబేరవర్మను చూశాడు.

"కారణం ఇతని ప్రవర్తనాస్థాలిత్యం! మనసు, వాక్కు, కర్మ ఆలోచన, అభివ్యక్తీకరణ, ఆచరణ అనే త్రికరణాలతో ఇతగాడు మహాపాపం చేశాడు."

నందకుడు నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడు.

"అంటే..." కుబేరవర్మ అనుమానిస్తూ అన్నాడు.

"ఇతను తన వృత్తిని కించపరుస్తూ, తప్పిదం చేశాడు. ఈ వ్యక్తి ఆస్థాన లేఖకుడు అన్నారు. పరమ శివుడికి ఢమరుక నాదం నుంచి ఉద్భవించినవీ, క్షరం అంటే నాశనం అనేది లేనివీ అయిన అక్షరాలను అపవిత్రం చేశాడు. లిఖించే చేయి అక్షరాలకు అపచారం చేసింది. అపరాధం చేసింది!"

"నందకా!" కుబేరవర్మ గంభీరంగా అన్నాడు.

"ప్రభూ...నేను ఏ పాపం ఎరుగను. నేనే అపరాధం చేయలేదు" నందకుడు తడబడుతూ అన్నాడు.

"స్వామివారు త్రికాలజ్ఞులు. జ్ఞాననేత్రాలతో చూసి చెప్తున్నారు.." కుబేరవర్మ అన్నాడు.

"మహారాజా! ఇతగాడిని మీరు శిక్షించాల్సిన అవసరం లేదు. సంతానప్రాప్తి లేకుండా చేస్తూ విధి శిక్షిస్తోంది!" అంటూ నంది నందకుడి వైపు తీక్షణంగా చూశాడు. "లేఖరీ, నీకు సంతానం లేదు, నిజమేనా?"

"నందకుడి తల కిందకు వాలిపోయింది. "చిత్తం.."

"వెళ్ళు! ఆత్మపరిశీలనతో పాప ప్రక్షాళన చేసుకో!" నంది గంభీరంగా అన్నాడు.

నందకుడు వెనక్కి తిరిగి, తలవాల్చుకుని వెళ్ళిపోయాడు.

"స్వామీ, తమరు ఒక్కసారి సభాంగణంలో పాదయాత్ర చేయాలి. తమ మీద పుష్పవర్షం కురిపించి, తరించాలని మా ప్రజలు ఆశిస్తున్నారు" మహారాజు కుబేరవర్మ అభ్యర్థించాడు.

"నన్ను దైవంలా ఆరాధిస్తున్నారు. కానీ, నేను మీలాగే మానవుణ్ణి. మీ ముచ్చటను కాదనలేను" అంటూ నంది జనం వైపు వెళ్ళాడు. మహా

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుడిని రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు. స్వయంవరం రోజున యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. తనను అపహరించిన కళింగరత్న చెర నుంచి తప్పించుకున్న లాలసను నంది రక్షిస్తాడు. మార్గంలో ఎదురవుతున్న ఆపదల నుంచి తప్పించుకుంటూ, తమ రాజ్యానికి పొరుగురాజ్యమైన కేదారిక రాజ్యంలోకి ప్రవేశిస్తారు. అక్కడినుంచి ఇద్దరూ సన్యాసి వేషాల్లో, కామరూప రాజ్యానికి బయలుదేరతారు. రాజ్యంలోకి ప్రవేశించి, తన తల్లిదండ్రులను చేరుకుంటుంది లాలస. జరిగినదంతా వివరంగా చెబుతుంది వారికి. విషయం తెలుసుకున్న కుబేరవర్మ, ఆలయానికి దారితీసే సొరంగమార్గాన్ని మూయించి వేస్తాడు. కళింగరాజు వద్దకు మహామంత్రిని, సర్వసైన్యాధ్యక్షుడిని రాయబారానికి పంపిస్తాడు.

ఆ తర్వాత....

రాజూ, మహామంత్రీ, గౌరవసూచకంగా వెంట నడిచారు.

జనం చేతుల్లోని రంగురంగుల పూలు నంది పైన వర్షిస్తున్నాయి.

***

నంది రాజమందిరంలోంచీ సింహద్వారం వైపు నడుస్తున్నాడు. తారసిల్లిన రాజోద్యోగులూ, పరిచారకులూ, ద్వారపాలకులూ అతనికి వినయంగా నమస్కరిస్తున్నారు.

సింహద్వారం వద్ద అశ్వికదళ సైన్యాధిపతి భద్రకుడు ఎదురయ్యాడు. పక్కకు జరిగి వినయంగా చేతులు జోడించాడు. "స్వామీ... ఒంటరిగా...ఎక్కడికో" అన్నాడు.

"ఆలయానికి నాయనా. అమ్మవారి దర్శనం చేసుకుని అలా నగర వీధుల్లో సంచారం చేసి వస్తాను. నిత్యసంచారానికి అలవాటు పడిన కాళ్ళు కదా!" నంది చిరునవ్వుతో అన్నాడు.

"తోడుగా రమ్మంటారా? లేకపోతే భటులను పంపించమంటారా స్వామీ?"

"అవసరం లేదు నాయనా...సన్యాసులకు సహాయకులు దేనికి?" అంటూ నంది సింహద్వారం దాటాడు.

భద్రకుడికి అనుమానం రాకుండా ఆలయానికి వెళ్ళే మందిర మార్గంలోకి తిరిగాడు. నమస్కారాలు చేస్తున్న వాళ్ళను చిరునవ్వుతో దీవిస్తూ, కుడివైపు తిరిగి వెళ్తే తను వెళ్ళాలనుకున్న గమ్యస్థానం చేరుకోవచ్చని నందికి తెలుసు.

తన గమ్యాన్ని సమీపించిన నంది తటాలున ఆగి, దాని పక్కనే ఉన్న చెట్టు చాటుకి వెళ్ళాడు. తల కొద్దిగా వాల్చి చూస్తూ ఉండిపోయాడు. ఇంటి ఆవరణలోకి వెళ్ళిన ఆ వ్యక్తి గుర్రం దిగి, గుర్రాన్ని వదిలివేసి, ఇంటి ముందున్న మెట్లు ఎక్కుతున్నాడు. కాస్సేపట్లో తలుపు తెరుచుకుంది. ఆ వ్యక్తి లోపలికి వెళ్ళాడు. తలుపు మూసుకుంది.

నంది అటూ ఇటూ చూశాడు. మార్గం నిర్మానుష్యంగా ఉంది. నంది ఆ ఇంటి వైపు చకచకా అడుగులు వేశాడు. ఆవరణలోకి ప్రవేశించాడు. మెట్ల

పైన ఉన్న ద్వారం వైపు వెళ్ళకుండా ఇంటి వెనుక వైపు నడవసాగాడు. నంది ఇంటిని ప్రదక్షిణం చేస్తూ, పడమటి దిక్కు చేరుకున్నాడు. వాతాయనం తెరిచి ఉంది. నంది చప్పుడు చేయకుండా వాతాయనం దగ్గరగా వెళ్ళి మునివేళ్ళ మీద నిలుచుని లోపలికి చూశాడు. గది మధ్యలో పట్టె మంచం ఉంది. శయనాగారం. తలగడ వైపు, గోడవారగా భోషాణం ఉంది. శయనాగారం తలుపులు చప్పుడు చేస్తూ లోపలికి తెరుచుకుంటున్నాయి. స్త్రీ లోపలికి వస్తోంది. ఆమె వెనకే అతను గుమ్మం దాటి, లోపలికి వస్తున్నాడు. ఆమె ముఖంలో ప్రసన్నతగానీ, సంతోషం గానీ లేవు. అతను కూడా దిగాలుగా ఉన్నాడు. అతను... ఆస్థాన లేఖకుడు నందకుడు.

"నీరసంగా కనిపిస్తున్నావు. భోజనం చేశావా?" నందకుడు ప్రశ్నిస్తున్నాడు.

"లేదు. కొలువు కూటంలో నీకు 'సన్మానం' జరిగినప్పుడే నా కడుపు నిండిపోయింది!"

"లవంగీ!"

"సంతానప్రాప్తి లేకుండా విధి శిక్షిస్తోంది! అన్నారు ఆ యోగి. నెల తప్పిన ప్రతీసారీ గర్భస్రావం ఎందుకవుతుందో ఇప్పుడు అర్థమవుతోంది..."

"లవంగీ...."

"చెప్పండి! మనసుతో, మాటతో, చేతతో తప్పిదాలు చేస్తున్నారా? నిజం చెప్పండి! నా మీద ఒట్టు!" లవంగి తీక్షణంగా అంది.

వాతాయనం చాటున నక్కి దాక్కున్న నంది చెవులు రిక్కించాడు.

"నేను చేస్తోంది రాజోద్యోగం. పైవాళ్ళు చెప్పేవన్నీ, తప్పులైనా, ఒప్పులైనా చేయాలి, తప్పదు.."

"హూ! పాపాలు చేసే ప్రతీవాడూ ఇలాగే తప్పించుకునే ప్రయత్నం చేస్తాడు!" లవంగి కోపంగా అంది.

"మొన్న ఆ వజ్రాలహారం ధరించిన నాడే గర్భస్రావం అయింది తెలుసా?"

"మూఢనమ్మకం!" నందకుడు అన్నాడు.

"పాడు వజ్రాలహారం కోసం సర్వసైన్యాధ్యక్షుడికి అన్యాయం చేశారు. నిజం చెప్పండి! ఆ వజ్రాలహారాన్ని రుద్రాక్షుడిగారి ఇంట్లో నుంచి మీరే కాజేశారుగా?" లవంగి ప్రశ్నించింది. "మళ్ళీ నా మీద ఒట్టు! నిజం చెప్పకపోతే రేపే పుట్టింటికి వెళ్ళిపోతాను!"

"లవంగీ!"

"ఆడది ఆభరణాలను ఇష్టపడొచ్చు. కానీ నగలకన్నా సంపదలకన్నా అధికంగా సంతానాన్ని కోరుకుంటుంది. మీ పాపాలు నా మాతృత్వ వాంఛను చంపేస్తున్నాయి. చెప్పండి...వజ్రాలహారం..."

**సభాంగణం జనంతో కిక్కిరిసి ఉంది. మహారాజు, మహారాణి, లాలస... నిర్మలానందులయోగిని పూలమాలలతో సత్కరించారు. ఇక రాజోద్యోగుల వంతు. వరుసగా ఒక్కొక్కరు పూలమాలలు వేస్తున్నారు. ఆస్థాన లేఖరి నందకుడు కూడా మాలవేశాడు. ఆ మాలను తీసి దూరంగా విసిరేశాడు యోగి. ఎందుకలా చేశారాయన?**

"చెప్తాను. రుద్రాక్షుడిగారి ఇంట్లోంచి నేను తస్కరించి తెచ్చుకున్నాను. ఆయనే బహూకరించినట్టు రాజుగారికి చెప్పాను." నందకుడు నీరసంగా అన్నాడు.

"ఆయన...రుద్రాక్షుడుగారు...మీకు ఏదైనా అపకారం చేశాడా?" లవంగి కంఠం గంభీరంగా ధ్వనించింది.

"...లేదు.."

"అయితే ఆ తప్పుడు లేఖ ఎందుకు రాశారు? ఎవరు రాయించారు? చెప్పండి!"

"క్షమించు లవంగీ! అది అతి రహస్యం. ప్రాణాంతకమైన రహస్యం. చెప్పను...చెప్పలేను.."

నంది గుండె వేగంగా కొట్టుకుంటోంది. తన ఊహ నిజమని స్పష్టమవుతోంది. తన కుటుంబానికి విధించబడిన శిక్షలో లేఖకుడి హస్తలాఘవం ఉంది! ఆ దారుణ నాటకం నందకుడి లేఖనంతో ప్రారంభమైంది."

"ఇంకా ఏమేం పాపాలు చేశారో చెప్పండి!" లవంగి కంఠస్వరం నందికి వినిపించింది.

"నాకు అప్పగించబడిన కార్యం మాత్రం చేశాను" నందకుడు అన్నాడు. "ఆ రుద్రాక్షుడు వ్రాయించినట్టుగా కల్పిత విషయాలతో లేఖ రాశాను. ఆయన చేవ్రాలు నేనే చేశాను. వజ్రాలహారం తీసుకున్నాను."

"తీసుకోలేదు...దొంగిలించారు!"

"అది నా శ్రమకు ఫలితం. నీకు బహుమానం. నేను ఆ హారాన్ని వెదుక్కుంటూ వెళ్ళలేదు. అదే నన్ను వెదుక్కుంటూ వచ్చింది. చెప్పానుగా లవంగీ...."

"ఆ వజ్రాలహారం నా మాతృత్వ వాంఛను వజ్రాయుధంలా ఖండించి వేస్తోంది. దాన్ని నా ఇంట్లోంచి తీసుకెళ్ళిపొండి! ఆనాడు దురాశతో, మూర్ఖంగా వ్యవహరించాను. హారాన్ని నవ్వుతూ తీసుకున్నాను. అందుకు సిగ్గుపడుతున్నాను!"

"మనకు సంతానం కలగకపోవడానికి ఆ హారం.."

"కారణం కాదు అంటారు. అనండి; అనుకోండి!" లవంగి అడ్డొస్తూ అంది. "నేను ఆ స్వామి వారి వాక్కునే విశ్వసిస్తాను! అంతే! ఈ క్షణం నుండీ పాపకార్యాలు మానేయండి! చేసిన పాపాలన్నీ కడిగేసుకోండి!" లవంగి కంఠంలో నిష్కర్షణ ధ్వనించింది.

నంది వాతాయనం ముందు నుండి కదిలాడు. తను వినాల్సినదంతా విన్నాడు, చాలు!"

***

లాలసా, చెలికత్తెలు చంచలా, చపలా నంది ఉన్న విడిదిలోకి ప్రవేశించారు. చెలికత్తెల చేతులలో ఆహార పదార్థాలున్న పళ్ళేలున్నాయి. నంది వాళ్ళ వైపు చిరునవ్వుతో చూశాడు.

"అక్కడ పెట్టి వెళ్ళండే. గురుదేవులకు నేను స్వయంగా వడ్డిస్తాను" అంది లాలస.

చెలికత్తెలు పళ్ళేలను పీఠం మీద పెట్టి వెళ్ళిపోయారు.

"నగర సందర్శనానికి వెళ్ళావటగా?" లాలస తగ్గుస్వరంతో అంది.

"నగర సందర్శనం పేరుతో 'నందక సందర్శనాని'కి వెళ్ళాను..." అన్నాడు నంది. చాటు నుంచి తాను విన్న నందక దంపతుల సంభాషణను వినిపించాడు.

లాలస ఆశ్చర్యంగా చూసింది. "నందకుడిని ఎలా అనుమానించావు? ఎప్పుడు అనుమానించావు?"

"పొరుగు రాజుతో చేతులు కలిపి, తన రాజును బలిచేసే ఆలోచన కలలో కూడా మా నాన్నకు రాదు. లేఖలోని అంశాలే నాన్నను అపరాధిగా నిలబెట్టాయి. ఆ లేఖ మానాన్న స్వహస్త లిఖితం కాదు. అది నందకుడి లేఖనం. అసత్యాలతో లేఖ రూపొందించి, నందకుడు మా నాన్న చేవ్రాలును తనే చేసి ఉండాలి అని ఊహించాను. నాటకానికి నాంది ఆ లేఖాస్త్రం కదా! రత్నకటక నగరంలో ఉన్నప్పుడే ఊహించాను.."

"నందకుడు ఆ పాడు పని ఎందుకు చేసి ఉంటాడు?"

"అది తెలిస్తే, అపరాధి ఎవరో తెలిసినట్టే!" నంది నవ్వాడు. "మొట్టమొదటి అనుమానితుడు తెరమాటున నక్కి దాక్కుని నందకుడి చేత నాటకం ఆడించిన వ్యక్తి. ప్రస్తుత సర్వసైన్యాధ్యక్షుడు సమరసేనుడు. మా నాన్న పదవిని అతను అలంకరించాడు. అందుకే నా అనుమానం అతని వైపే వెళ్తోంది. అయితే దానిని నిర్ద్వంద్వంగా మనం నిరూపించాలి."



"ఏ విధంగా?" లాలస సందేహం వ్యక్తం చేసింది.

"నందకుడిని నేను వ్యతిరేకిస్తున్నాను. ద్వేషిస్తున్నాను. నా కన్నా బలమైన వ్యక్తి వ్యతిరేకత ఉంది అతని పట్ల..."

"ఎవరా వ్యక్తి?"

"అతని భార్య లవంగి" నంది నవ్వాడు. "అతను చేసిన నేరాలు, పాడు పనులను పాపాలుగా, తన సంతాన వాంఛను చంపివేస్తున్న ఆయుధాలుగా ఆమె భావిస్తోంది. నా వ్యతిరేకత కన్నా ఆమె వ్యతిరేకత శక్తిమంతమైంది. ఆమెను, ఆమె సంతాన వాంఛను మనం ఒక ఆయుధంగా ఉపయోగించుకోవాలి."

"ఎలా?" లాలస అడిగింది.

"ఆలోచిస్తున్నాను...త్వరలో చెప్తాను."

***

మహారాజు కుబేరవర్మ, మహారాణి మహిమాదేవి, యువరాణి లాలస సమాలోచన మందిరంలో కూర్చున్నారు. వాళ్ళకు ఎదురుగా నంది కూర్చున్నాడు. తమ కుమార్తెను రక్షించిన సందర్భంలో నంది చేసిన సాహసాలను మెచ్చుకున్నారు రాజదంపతులు. సన్యాసి అయిన ఆయనకు ఆ శక్తి సామర్థ్యాలూ, ధైర్యమూ ఉండడం తనకు ఆశ్చర్యం కలిగిస్తోందన్నాడు కుబేరవర్మ. తను బౌద్ధమతాన్ని అవలంబిస్తున్న తరుణంలో హీనయాన శాఖలు ఆత్మరక్షణ కోసం 'వజ్రముష్టి' అనే యుద్ధ విధానాన్ని నేర్చుకున్న వైనాన్నీ, దాని మూలంగా తనలో నెలకొన్న ధైర్యసాహసాల గురించీ వర్ణించి చెబుతున్నాడు నంది. అతని కల్పనా చాతుర్యాన్ని చిరునవ్వుతో అభినందిస్తూ మౌనంగా కూర్చుంది లాలస.

ద్వారపాలకుడు తలుపు తోసుకుని ప్రవేశించి, వినయంగా నిలుచున్నాడు. "ప్రభువులకు మనవి. సర్వసైన్యాధ్యక్షులు తమ దర్శనం కోసం వచ్చారు.."

"ప్రవేశపెట్టు.." కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

ద్వారపాలకుడు నిష్క్రమించాడు. సమరసేనుడు ప్రవేశించి, రాజదంపతులకూ, నందికీ నమస్కరించాడు.

"రత్నకటక నగరం నుండి ఇప్పుడే తిరిగి వచ్చాం."

"ఏం జరిగింది అక్కడ? మా సందేశం, హెచ్చరికా..."

"చిత్తం! ప్రభువులు చిత్తగించాలి. మాతో బాటు కళింగరాజ్య పాలకులు శక్తిరత్న మహారాజుగారు సతీసమేతంగా నగరానికి విచ్చేశారు. తమ దర్శనం కోసం..."

"అలాగా!" కుబేరవర్మ ఆశ్చర్యంగా అన్నాడు.

"చిత్తం ప్రభూ. కామరూపాంబిక ఆలయంలో ఉన్నారు. మహామంత్రిగారు తోడుగా ఉన్నారు..."

"రాజగురువుగారిని తీసుకువెళ్ళి, పూర్ణకుంభంతో కళింగ దంపతులకు స్వాగతం చెప్పి, సగౌరవంగా తీసుకురండి!" కుబేరవర్మ ఆజ్ఞాపించాడు.

"ఆజ్ఞ!" అంటూ సమరసేనుడు గుమ్మం వైపు నడిచాడు.

"కళింగరాజు స్వయంగా రాయబారానికి వచ్చినట్టున్నాడు.." కుబేరవర్మ సాలోచనగా అన్నాడు.

"కన్నకొడుకును శిక్షించమని మీరు హెచ్చరించారు. అంతపని చేయలేడుగా! అందుకే సర్దుబాటు చర్య కోసం వచ్చి ఉంటాడు!" మహారాణి అంది.

కుబేరవర్మ మౌనంగా తల పంకించాడు.

***

కళింగరాజ దంపతులను కామరూపరాజ దంపతులు సాదరంగా ఆహ్వానించి, మందిరం లోపలికి తీసుకెళ్ళారు.

"శ్రమపడి మా నగరానికి విచ్చేశారు. మీ రాకతో మమ్మల్నీ, మా రాజ్యాన్నీ గౌరవించారు!" కుబేరవర్మ అన్నాడు.

"అది మా బాధ్యత! ధర్మం కూడా!" శక్తిరత్న మహారాజు అన్నాడు.

"వీరు నిత్యనిర్మలానంద యోగేంద్రులు. మా పుత్రికను సురక్షితంగా తీసుకువచ్చిన పుణ్యాత్ములు.." కుబేరవర్మ పరిచయం చేశాడు.

కళింగరాజ దంపతులు ఆసనాల మీద నుండి లేచి నిల్చొని, వినయంగా చేతులు జోడించి నమస్కరించారు.

"పరమేశ్వరార్పణం!" నంది ఆశీర్వాదపూర్వకంగా అన్నాడు.

"చూడగానే ఊహించి ఉంటారు... మా పుత్రిక లాలస!" కుబేరవర్మ పరిచయం చేశాడు.

## ఉగాది ప్రత్యేకం




ఏ ఒక్కటిని ఒక్కటిగా వుండనివ్వదు
రెండుగా విడగొడుతుంది

అది రోడ్డు కావచ్చు
అది లోకం కావచ్చు

రోడ్డు ఎడారిలా ఉంది
వివాదాల లోకం
పెద్ద శోకంలా ఉంది

ఎదుగుదలకు తన ఎదురొచ్చిన
ఎన్ని ఎదిగిన చెట్లను
నామరూపాలు లేకుండా చేసింది

## డివైడర్

అప్పుడే బ్యూటీ పార్లర్ నుంచి
వచ్చినట్టు వంకరలతో
వయ్యారాలతో సిగ్గు మెలికలు తిరిగిపోతుంది

ఏమి ఎరుగని అమాయకత్వంతో
డివైడర్ మధ్య రంగుల కాగితం పూల
మొక్కలతో
తనను తను ప్రమోట్ చేసుకుంటుంది

దుమ్ము పేరుకుపోయిన అద్దంలా
దారి పక్కన మసకబారిన పల్లెతల్లులు

తన మీది నుంచి పారిన
ప్రతి దాని తోలు ఒలుస్తున్న టోల్‌గేట్లు

అది ఇల్లు కావచ్చు
వాళ్ళు తల్లిదండ్రులు కావచ్చు

ఎవరూ అనుకోరు

ప్రమాదాలు జరుగుతూనేవుంటై
జరిగిందని ఎవరూ ఆగిపోరు
ప్రయాణాలు సాగుతూనేవుంటై

ఎద్దుపుండు కాకికి ముద్దు
పొడుచుకు తింటూనే ఉంటుంది
ఏడ్చేటోడు ఏడుస్తూనే వుంటాడు
సుఖపడేటోడు సుఖపడుతూనే ఉంటాడు.

ఎంత చెమట నెత్తురును తాగినా
పెట్టుబడికి దూపతీరదు



ఒక్కటిగా ఉన్న ప్రతిదాన్నీ
పంచుకొని అంచుకుతింటది

ఇంతకు ముందు
ఈ తొవ్వ పొంటి వచ్చినప్పుడు
రోడ్డుపక్కన పచ్చని పొలం ఉండేది
ఎవరి కండ్లు మండినయో
జె.సి.బి.తో చదును చేసి
హద్దు రాళ్ళు పాతిండ్రు

వెనుకకు మర్రి వస్తామన్నా
అందుబాటులో లేని 'యు' టర్న్

ఏ రెండునూ అగ్రరాజ్యంలా
ఒక్కటిగా కలువనివ్వదు
ఒక్కచోటా ఉండనివ్వదు

**—జూకంటి జగన్నాథం**
**సెల్: 94410 78095**

కళింగ రాజదంపతులు లాలస వైపు విచారంగా చూశారు.

"మా కుమారుడి వల్ల నీకు తీరని అపచారం జరిగింది. మమ్మల్ని క్షమించు తల్లీ!" కళింగ మహారాణి అపర్ణాదేవి అంది.

"అవును తల్లీ. మా అధమ పుత్రుడి అకార్యాన్ని మా అపరాధంగా భావిస్తున్నాం!" శక్తిరత్న మహారాజు అన్నాడు.

"లాలసా, రాజదంపతులు పెద్దలు. వాళ్ళ ఆశీస్సులు అందుకో!" కుబేరవర్మ అన్నాడు.

మహారాణి మహిమాదేవి వెళ్ళమన్నట్టు లాలస వైపు చూసింది. లాలస లేచి వెళ్ళి కళింగ రాజదంపతుల పాదాలకు నమస్కరించింది.

"కల్యాణమస్తు!" శక్తిరత్న మహారాజు దీవించాడు.

"మీ పుత్రిక చక్కని చుక్క. మా వాడు సరి జోడు కాడు!" అపర్ణాదేవి అంది.

"మహారాణిగారు దాపరికం లేకుండా మాట్లాడుతున్నారు!" మహారాణి మహిమాదేవి అంది.




"దాపరికాలు ఉండకూడదన్న ఆశయంతోనే తమ దర్శనానికి వచ్చాం" శక్తిరత్న అన్నాడు. "తమ సందేశం అందగానే, మా కుమారుడినీ, వాడి అనుచరుడు ఉలూకుడినీ చెరలో వేయించాం. నేను రాజ్యపాలన చేసినంత కాలం, జీవించి ఉన్నంత కాలం మా వాడు చెరలోనే ఉంటాడు.."

"ఆర్యా..."

"ఔను మహారాజా! మా అనంతరం ఎవరు ఏమవుతారో మాకు అవసరం లేదు. మరొక విషయం కూడా మీకు మనవి చేయాలి.." కళింగ మహారాజు అన్నాడు, తన సతీమణి వైపు చూస్తూ.

"మీ అమ్మాయిని మా వాడు చెరపట్టాడని తెలిసిన వెంటనే నేను స్పందించాను. మావాడిని మందలించాను. హెచ్చరించాను. ఆ కల్యాణిని క్షేమంగా విడిచిపెట్టమన్నాను. అయితే నా ఆదేశాన్ని మావాడు పెడచెవిన పెట్టాడు. మరో పన్నాగం పన్నేలోగా మీ యువరాణి తప్పించుకుంది. అప్పుడే ఆ విషయం మీకు తెలియజేయాల్సింది కానీ, కొన్ని దినాల తరువాత కానీ అమ్మాయి పర్వత మందిరం నుండి పారిపోయిన సంగతి మాకు తెలిసిరాలేదు.." అపర్ణాదేవి అంది.

"అంతేకాదు...అపరాధ భావం, ఆత్మన్యూనతా భావం మమ్మల్ని మౌనంగా ఉంచేశాయి" శక్తిరత్న అన్నాడు. "మా స్పందనను ఆలస్యంతో బంధించాయి. అందుకు మీరు మా దంపతులను మన్నించాలి."

"మీరు జ్ఞాన వృద్ధులు; వయో వృద్ధులు. అంత మాట అనకండి. కన్నకొడుకు అని ధృతరాష్ట్ర ప్రేమ ఒలకబోయకుండా, కారాగారంలో పడవేయించారు. ఆ వార్త వినిపించడానికి ఇంత దూరం వచ్చారు.."

"మా రాకకు మరొక ముఖ్య కారణం ఉంది, మహారాజా.." కళింగరాణి అపర్ణాదేవి అంది.

"ఏమిటది మహారాణీ?" మహిమాదేవి ప్రశ్నించింది.

అపర్ణాదేవి కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయింది.

"అపర్ణా, అనుమానించడం దేనికి? దాపరికాలను దహనం చేయాలన్న లక్ష్యంతో కామరూప ప్రభువుల ముందుకు వచ్చాం. సంకోచించకుండా వివరించు!" శక్తిరత్న మహారాజు అన్నాడు.

అపర్ణాదేవి నిట్టూర్పు విడిచి, ప్రారంభించింది. "కామరూప రాజవంశంలో జన్మించిన కన్యకను కళింగ రాజవంశంలో జన్మించిన పురుషులు అపహరించడం ఇది మొదటిసారి కాదు.."

"మహారాణీ!" కుబేరవర్మ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఇది రెండవసారి. మొదటిసారి కామరూప రాచకన్య అపహరణ కూడా కామరూపాంబికా దేవి ఆలయంలో నుండే జరిగింది. ఆ అక్రమకార్యం జరిగి శతాబ్దాలు దాటింది. మీ వంశంలో జన్మించిన ఆ సుందరాంగి పేరు 'మహాశ్వేతాదేవి'. రాక్షస వివాహం చేసుకోవాలని ఆమెను అపహరించి తెచ్చిన స్వార్థపరుడి కోరిక తీరలేదు. ఆ తల్లి మా రాజభవనంలోనే, బంధించబడిన కక్ష్యలోనే ఆత్మహత్య చేసుకుంది..."

"నిజమా?" మహారాణి మహిమాదేవి నిర్భ్రాంతపోతూ అంది.

"ఔను మహారాణీ! ఆ కక్ష్యను ఎవ్వరూ ఉపయోగించరు. మహాశ్వేతాదేవి ఆత్మ శతాబ్దాల పాటు మా మందిరంలో సంచరించేది. శాంతి హోమం ద్వారా ఆ ఆత్మ ఒక స్వర్ణకలశంలో నిక్షిప్తం చేయబడింది. పూజాగృహంలో ఆ స్వర్ణకలశానికి నిత్యార్చన చేయడం మా ఆచారంగా మారింది!"

"ఆశ్చర్యంగా ఉంది" కుబేరవర్మ అన్నాడు.

లాలసా, నందీ ఆశ్చర్యప్రతిమల్లా మారిపోయి వింటున్నారు.

"కామరూప రాజవంశ కన్యకు మరోసారి అన్యాయం జరగడం మాకు ఇష్టం లేదు. అందుకే మా కుమారుడిని తీవ్రమైన హెచ్చరికలతో బెదిరించాను. వాడు అహంకారి, మూర్ఖుడు. లాలసను మీకు అప్పగించే ప్రయత్నం చేయలేదు.." అపర్ణాదేవి ఆగింది.

"అందుకే మీ ప్రతిపాదనను గౌరవించాం. అపరాధిని శిక్షించాం. కామరూపాంబిక ఆలయంలోని రహస్య ద్వారం గుండా, సుకర్మ అనే యువకుడు లాలసను అపహరించి, మా పుత్రుడికి అప్పగించాడు. సుకర్మ ఆలయశిల్పి వంశానికి చెందిన వాడు. మీ నగరవాసి. మా నగరానికి వలస వచ్చాడు. ఈ వివరాలన్నీ మావాడి ఆంతరంగిక సేవకుడు ఉలూకుడు చెప్పేశాడు. ఆ సుకర్మను మా వాడు చంపివేశాడట! ఆ రహస్య మార్గాన్ని మూసివేయించండి!" శక్తిరత్న మహారాజు అన్నాడు.

"స్వామివారు రహస్య మార్గం ఉనికిని ఊహించారు. దానిని మూయించివేశాం" కుబేరవర్మ అన్నాడు.

"మా వంశకన్యక మహాశ్వేతాదేవిగారి అపహరణ గురించి మీరు వినిపించిన కథనం ఆశ్చర్యాన్నీ, ఆవేదననూ కలిగిస్తోంది.." మహారాణి మహిమాదేవి అంది.

"మా వంశం మూలంగా మీ వంశానికి రెండు పర్యాయాలు దుఃఖం సంభవించింది. అందుకు సిగ్గుపడుతున్నాం..." శక్తిరత్న మహారాజు అన్నాడు.

"మీ పుత్రుడు చేసిన పాపాన్నీ, మీ పూర్వీకులలో ఎవరో చేసిన పాపాన్నీ మీ ప్రవర్తనతో ప్రక్షాళన చేసుకున్నారు మహారాజా. ఇంక విచారించకండి" కుబేరవర్మ అన్నాడు.

"మమ్మల్ని అర్థం చేసుకున్నారు. సంతోషం. మీ పుత్రికారత్నం వివాహానికి వస్తాం" అపర్ణాదేవి అంది.

"చాలా సంతోషం. ప్రత్యేకంగా ఆహ్వానిస్తాం. దయచేయండి; దీవించండి!" కుబేరవర్మ అన్నాడు. "మా మహాశ్వేతాదేవిగారి స్వర్ణకలశాన్ని దర్శించాలని పిస్తోంది."

"ఆహా! ఇదే మా ఆహ్వానం. మీ ఇష్టం వచ్చినప్పుడు విచ్చేయండి! నిత్యనిర్మలానందుల వారినీ తీసుకురండి. పాదస్పర్శతో మా రాజ్యాన్ని పావనం చేస్తారు" శక్తిరత్న మహారాజు అన్నాడు.

"నేను ఎప్పుడు ఎక్కడ ఉంటానో నాకే తెలియదు. మీ ఆహ్వానానికి ధన్యవాదాలు" నంది చిరునవ్వుతో అన్నాడు.

**(ఇంకా వుంది)**






## ఒకే రకం

కవలలకు ఒకేరకమైన దుస్తులు వేసి, ఒకే రకంగా అలంకరణ చేసి మురిసిపోతుంటుంది తల్లి. పిల్లల సంగతి పక్కనబెడితే ఆ జంట కూడా ఒకేరకంగా దుస్తులు వేసుకుంటూ అందరినీ ఆశ్చర్య పరుస్తోంది. జపాన్‌కి చెందిన ఈ జంటకు ముప్పై ఏడేళ్ళ క్రితం వివాహమైంది. అప్పటినుంచి ఇప్పటి వరకు ఒక్కరోజు కూడా వీరిద్దరూ వేరువేరు దుస్తులు వేసుకోలేదట.

ఒకే రంగు, ఒకే డిజైన్ దుస్తులు వేసుకోవటం మొదలుపెట్టారు. కొద్దికాలంగా ఇన్‌స్టాగ్రామ్‌లో బొన్‌పొన్ 511 పేరుతో ఖాతా తెరిచి, అందులో తమ ఫొటోలు పోస్ట్ చేస్తున్నారు. వీరిమధ్య ఉన్న అన్యోన్యత, అవగాహన చూసి నెటిజన్లు లైకుల మీద లైకులు కురిపిస్తున్నారు. కామెంట్లు విసురుతున్నారు. అలా ఇప్పటివరకు వీరి అకౌంట్‌కు లక్ష వరకు అనుచరులు ఉన్నారు.



## అందమైన చిట్టిల్లు !

ఆ చక్కని పొదరింట్లోకి అడుగు పెడితే, బుల్లిబుల్లి ఫర్నీచర్, చిన్న బెడ్, బుజ్జి బుజ్జి అతిథులు కూర్చోవడానికి అనువైన సోఫాలు దర్శనమిస్తాయి. లోపలికి తొంగిచూస్తే, ఆరాంగా సేదదీరుతూ, తనకిష్టమైన ఆహారం తింటూ కనిపిస్తుంది చీజ్. ఇంతకీ ఈ చీజ్ ఎవరనుకుంటున్నారు? టిఫనీ ఝంగ్ పెంచుకుంటున్న ఓ బుల్లి చిట్టెలుక!

మాంచెస్టర్‌కు చెందిన టిఫనీ ఝంగ్ తన పెంపుడు చిట్టెలుక చీజ్‌కి ఈ చక్కని అందమైన ఇల్లు ఏర్పాటుచేసింది. అంతేకాదు తన బెడ్‌ని నీట్‌గా ఉంచుకోవటం, ఆహారం తినటం ఇతరత్రా పనుల్లో శిక్షణ కూడా ఇచ్చిందట. ఈ క్యూట్ పెంపుడు చిట్టెలుకకి ప్రత్యేక ఇల్లు, ఇంట్లో సర్వ హంగులూ ఏర్పాటుచేసింది.

దాని సైజుకు తగ్గట్టుగా పెట్ హౌస్ కొని, దానికి సరిపోయే ఫర్నీచర్, బెడ్, సోఫాలు అన్నీ అమర్చేసరికి చాలా ఖర్చే అయ్యిందంటోంది టిఫనీ. మినీ కుషన్స్, ప్లేట్లు, స్పూన్లు, బౌల్స్ జపాన్ నుంచి తెప్పించిందట. బావుంది కదూ చీజ్ గారి ఇల్లు.



## పయనీర్ టౌన్

తలమీద పెద్ద టోపీ పెట్టుకొని, పెద్ద పెద్ద బూట్లతో, చేతిలో గన్‌తో, గుర్రం మీద... అని చెప్పగానే వెంటనే ఏదో ఓ రూపం మదిలో మెదులుతోంది కదూ! కౌబోయ్...! సినీప్రేక్షకులకు ఆ పేరు వింటే చాలు పూనకం వచ్చేస్తుంది. అంతటి ఫేమస్ కౌబోయ్‌లకి ఓ ఊరు ఉంది. ఊరంటే ఆ ఊర్లో అందరూ కౌబోయ్‌లే ఉంటారనుకుంటే పొరపాటు. ఎందుకంటే ఆ ఊర్లో ఉండేది కౌబోయ్‌లు కాదు, కౌబోయ్‌లను తలపించే వస్తువులు, కౌబోయ్ వాతావరణమే!

అమెరికా, కాలిఫోర్నియా సమీప ఎడారిప్రాంతంలో ఉందీ ఊరు. పేరు పయనీర్ టౌన్! ఇలాంటి ఊరు నిర్మించాలన్న ఆలోచన కౌబోయ్ చిత్రాల నటుడు రాయ్‌రోగర్స్‌ది. 1946లో దీన్ని నిర్మించారు. ఊళ్ళో అన్నీ కొయ్యతో నిర్మించిన ఇళ్ళు, దుకాణాలు, ఇసుకతో నిండిన వీధులు.. అన్నీ కౌబోయ్ సినిమాల్లోలాగానే ఉంటాయి.

రెండొందలకు పైగా సినిమాలు, వందల కొద్దీ టీవీ షోలు ఈ ఊర్లో చిత్రీకరణ జరుపుకున్నాయి. అయితే తర్వాతి కాలంలో ఇక్కడ చిత్రీకరణలు తగ్గిపోవడంతో ఆ ఊరు పర్యాటక స్థలంగా మారిపోయింది. ఇప్పటికీ అక్కడ వినోదం కోసం కౌబోయ్ శైలిలో గన్ షూటింగ్‌లు ప్రదర్శిస్తుంటారు.

## ప్రచార పక్షి!

ఫొటో చూడండి... పెద్ద చిలుకలాంటి పక్షి ఇల్లంతా అలా అలా తిరుగుతున్నట్టు ఉందికదూ!

అలా ఓ పక్షి ఇల్లంతా.. బెడ్‌రూం, బాల్కనీ, కిచెన్, లివింగ్‌రూం అని తేడా లేకుండా ఆఖరికి బాత్‌రూమ్‌లో కూడా రౌండ్స్ కొడుతుంటే ఎవరూ పట్టించుకోరే? అలా అనుకుంటే, పప్పులో కాలేసినట్టే మీరు. ఎందుకంటే అది పక్షి కాదు. పక్షి కాస్ట్యూమ్స్ వేసుకున్న మనిషి! తన పేరు చెప్పకుండా, తననెవరూ గుర్తుపట్టకుండా ఆ ఇంటి అమ్మకానికి ప్రచారం కల్పిస్తున్నాడు. ఆ ఇంట్లో ఉన్న వసతులను చూపిస్తూ కొనుగోలుదారులను ఆకర్షించడానికి తనవంతు మోడలింగ్ చేస్తున్నాడు. ఇదొక కన్సల్టెన్సీ చేపట్టిన బిజినెస్ ట్రిక్. బోల్టన్‌లో ఉన్న త్రీబెడ్‌రూమ్ ప్రాపర్టీని అమ్మటానికే ఈ ప్రయత్నమంతా. ఐడియా బాగుంది కదూ.



## భలే ఐడియా!

ఇక రైలు మిస్సవుతామేమో అనే భయం అక్కర్లేదు. ఎందుకంటే మీ రైలు మీ ఫ్లాట్ ముందుకొచ్చి మరీ ఆగుతుంటే ఇక చింత ఏల? అదేంటో చూడాలంటే చైనా వెళ్ళాల్సిందే! చైనాలోని షాంగ్‌కింగ్ నగరాన్ని 'మౌంటెన్ సిటీ' అని కూడా పిలుస్తారు. ఈ నగరంలో రైళ్ళు అపార్ట్‌మెంట్స్‌లో నుంచి దూసుకొస్తూ, ఫ్లాట్ ముందుకొచ్చి మరీ ఆగుతాయి. జనాభా పెరిగిపోయి నగరంలో రోడ్లు, రైల్వే ట్రాక్‌లు నిర్మించేందుకు స్థలం లేక, 19 అంతస్తుల భవనంలోనుంచి ఆరు, ఎనిమిది బ్లాకుల మధ్య రైల్వే ట్రాక్‌లు నిర్మించారు. చుట్టుపక్కల భవనాల్లో నివసించేవారు కూడా అక్కడికే వచ్చి రైలు ఎక్కేస్తారు. మరి ఆ రైళ్ళ మోతలు, శబ్దాల సంగతేంటి? అన్న అనుమానం రావచ్చు. దానికీ ఓ ఏర్పాటు చేశారు. రైలు వెళుతుంటే గిన్నెలు కడుగుతున్న శబ్దం వచ్చేలా దీనిని నిర్మించారు.



–నర్మద వాసిరెడ్డి



# సినీవాలి

25



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**నేను పోలీస్ స్టేషన్‌కి వెళ్ళేసరికి అంతా కోలాహలంగా ఉంది. విమానాల్లాంటి కార్లలో నుంచి దిగిన తెల్లబట్టలు ధరించిన ముష్కరులతో ఆవరణ అంతా నిండి ఉంది.**

**నన్ను ఎవ్వరూ గుర్తు పట్టలేదు. నేను లోపలకు వెళ్ళి ఇన్‌స్పెక్టర్‌ని కలిశాను. ఆయన నన్ను లోపలికి సెల్ దగ్గరకు తీసుకెళ్ళాడు. సెల్లు లోపల కూర్చున్న ఆ డైరెక్టర్‌ని 'అరేయ్!' అని పిలిచాడు.**

'ఎవరూ....?' అంటూ వచ్చిన ఆ డైరెక్టర్ నన్ను "నువ్వా....." అంటూ ప్రశ్నార్థకంగా చూశాడు.

నేను ఆ డైరెక్టర్‌ని ప్రత్యక్షంగా చూడడం అదే మొదటిసారి. అతన్ని చూసి నిజంగా ఆశ్చర్యపోయాను. 'నవతరం డైరెక్టర్లలో మేధావిగా పేరుగాంచిన ఇతనా.... నా శ్రావణికి ఈ దుర్గతి కలిగించింది' అనుకున్నాను.

ఆ డైరెక్టర్ నన్ను 'నువ్వ' అనడం ఇన్‌స్పెక్టరుకు కోపం తెప్పించింది.

"నువ్వ ఏంది బే, నువ్వా! లం.... కొడకా! 'సార్' అని పిలువ్! శ్రావణి మేడంకు కాబోయే హజ్బెండ్. ఫిలిం డైరెక్టర్" అన్నాడు.

ఆ డైరెక్టర్ నా దగ్గరకు రాబోయాడు. నేను జుగుప్సగా అతణ్ణి చూసి దూరంగా జరిగాను.

"సార్! తప్పయిపోయింది సార్! క్షమించండి. కేస్ వాపస్ తీసుకోండి. ఇందులో నాదేం తప్పు లేదు సార్! శ్రావణితో కమిట్‌మెంట్ తీసుకున్నందుకు మీరు నవీన్‌ను ఉద్యోగంలో నుంచి తొలగించారని, వాడు నా దగ్గరకు వచ్చి మీ గురించి లేనిపోనివన్నీ చెప్పి నన్ను ఉసిగొల్పాడు. కమిట్‌మెంటు విషయం మీకు చెప్పి, తన ఉద్యోగం పోవడానికి కారణమైందని శ్రావణి మీద పగ తీర్చుకోవడానికి నన్ను వాడుకున్నాడు. వాడే ఆ గోపాల్‌గాణ్ణి తీసుకొచ్చి సుపారీ మాట్లాడాడు. నాకు వాళ్ళు చెప్పిన ప్లానులో శ్రావణి మేడం రోల్ లేదు సార్! కేవలం హార్డ్ డిస్క్ తెమ్మని మాత్రమే సుపారీ ఇచ్చాను. మధ్యలో, ఈ నవీన్ దూరి స్నేక్‌గ్యాంగ్‌తో కలిసి శ్రావణిని టార్చర్ చేశారన్న విషయం పోలీసులొచ్చి అరెస్ట్ చేసేవరకు నాకు తెలియదు సార్!" అని భోరుమని ఏడ్చాడు.

"నేను మన టాలీవుడ్‌కే చెందిన హీరోయిన్‌ని గ్యాంగ్ రేప్ చేయించేంత నీచానికి దిగజారలేదు సార్!" అన్నాడు.

నా తల తిరిగిపోయింది. స్తబ్దుగా నిలబడిపోయాను.

నేనేం మాట్లాడాలి? శ్రావణి మీద అటాక్ అతను ప్లాన్ చేయకపోవచ్చు కానీ, హార్డ్ డిస్క్ దొంగిలించుకు రమ్మనడంలో మాత్రం ఆయనదే ముఖ్య పాత్ర కదా! పక్క డైరెక్టర్ సినిమాను నాశనం చేయాలనుకోవడం మాత్రం గొప్ప విషయమా?

"సార్! సార్! కేసు వాపస్ తీసుకోండి సార్! నా జీవితం నాశనమైపోతుంది సార్! అసలు నాకా ఉద్దేశమే లేదు. ఆ నవీన్‌గాడే నా పంచన చేరి దివారాత్రాలు చెవిలో జోరీగలా పోరుతుంటే ఏదో ఒక వీక్ మూమెంటులో

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికయిన సందర్భంగా అమెరికా వెళుతూ, గతం గుర్తుచేసుకున్నాడు ఆ తెలుగు దర్శకుడు. డీసీపీ పుష్పాకిరణ్ సహాయంతో సినిమా నిర్మించేందుకు సిద్ధమవుతాడు. హీరోయిన్ శ్రావణిని ప్రేమిస్తాడు. తన గతాన్ని చెప్పి, దర్శకుడికి దూరంగా వెళ్ళిపోతుంది శ్రావణి. డైరెక్టర్ ఇంట్లో హార్డ్‌డిస్క్ దొంగిలించిందన్న నెపంతో శ్రావణిని అరెస్ట్ చేస్తారు. దీనంతటికీ కారణమైన స్నేక్‌గ్యాంగ్‌ను అరెస్టు చేయటం, డీసీపీ మేడం శ్రావణికి బెయిల్ ఇచ్చి, డైరెక్టర్ ఇంటికి తీసుకురావటం... అన్నీ చకచకా జరిగిపోతాయి. ఆమెని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు. ఈలోపు దర్శకుడి ఆఫీసుపై ఐటీ రెయిడ్ జరుగుతుంది. దర్శకుడు ఆ విషయం తెలుసుకుని, హార్డ్‌డిస్క్ జాగ్రత్త చేస్తాడు. ఐటీవో ద్వారా ప్రొడ్యూసరే రెయిడ్ చేయించినట్టుగా తెలుసుకుని చకచకా ఆర్థిక లావాదేవీలన్నీ చక్క బెట్టేస్తాడు దర్శకుడు. హార్డ్‌డిస్క్ దొంగతనం వెనకున్న వారిని కలుసుకోవాలని పోలీస్ స్టేషన్‌కి వెళతాడు. **ఆ తర్వాత.....**

ఈ పని చేశాను. ప్లీజ్ బిలీవ్ మీ సార్!" అన్నాడు.

నాకు ఆయన మాటలు నమ్మశక్యంగానే అనిపించాయి. ఇంకాసేపు అక్కడే ఉంటే నా మనసు కరుగుతుందేమోనని నాకు భయం వేసింది.

నేను మౌనంగా అక్కడి నుంచి ముందుకు నడిచాను.

***

ఇన్‌స్పెక్టర్ ఇంకో సెల్ దగ్గరకు తీసుకెళ్ళాడు. అందులో నవీన్ ఉన్నాడు. పోలీసులు బాగానే సత్కరించినట్టుంది. ముఖం పగిలింది. ఒంటి నిండా గాయాలు, బట్టల మీద రక్తపు మరకలున్నాయి.

మమ్మల్ని చూసిన నవీన్ సెల్ మూలకు చేరి ముడుచుకుని కూర్చున్నాడు. కానిస్టేబుల్ ఎన్ని సార్లు పిలిచినా రాలేదు. ఆ కానిస్టేబుల్ తలుపు తాళం తీయగానే మేం ముగ్గురం లోపలికి వెళ్ళాం.

"అరేయ్! లేచి నిలబడు, లే రా!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ కర్కశంగా.

నవీన్ భయం భయంగా చూశాడు. లేచి నిలబడ్డాడు.

నా ముందు ఒక విషసర్పం, ఒక విషవృక్షం నిలబడ్డట్టనిపించింది, వాణ్ణి చూస్తుంటే.

వాణ్ణి ఎముకలు విరిగేలా తన్నాలని మనసులో చాలా కోరికగా ఉంది. కానీ, అందుకు వాణ్ణి ముట్టుకోవాలి. వాడి నీడ కూడా భరించలేని స్థితిలో ఉన్న నేను వాడిని తాకాలంటేనే అసహ్యంగా అనిపించింది. నా మనసులోని ఆలోచన గమనించినట్టుగా ఇన్‌స్పెక్టర్ వాణ్ణి లాఠీతో కుళ్ళబొడిచాడు. నవీన్ ఏడుస్తూ, నీళ్ళు నిండిన కళ్ళతో నా వైపు చూశాడు. నేను తల తిప్పుకుని అక్కడి నుంచి బయటికొచ్చేశాను. లోపలి నుండి హాహాకారాలు వినిపిస్తూనే ఉన్నాయి.

ఐదు నిమిషాల తర్వాత ఇన్‌స్పెక్టర్ బయటకు వచ్చాడు. ఇద్దరం కలిసి ఆయన ఆఫీసు రూములో కూర్చున్నాము.

"సార్! మాకు చాలా ఒత్తిళ్ళు వస్తున్నాయి. మీతో కాంప్రమైజ్ చేసుకుంటున్నామని, ఇవ్వాళో రేపో అంతా సర్దుబాటు అవుతుందని, అంతవరకు కేసు ఫైల్ చేయవద్దని చెబుతున్నారు. నిజమేనా? మీరు కాంప్రమైజుకు ఒప్పుకుంటున్నారా? మీరు చెబితే ఫర్దర్‌గా ఏం చేయాలో ఆలోచిద్దాం!" అన్నాడు.

"అదేం లేదు సార్! అసలు కాంప్రమైజ్ సమస్యే లేదు. నిన్న నన్నెవరూ కలవలేదు, నాతో మాట్లాడలేదు. నేను నిన్నంతా మా ఆఫీసులో జరిగిన ఐటీ రెయిడ్‌తోనే బిజీగా ఉన్నాను." అని నేనన్నాను.

ఇంతలో నా బుర్రలో ఒక ఆలోచన మెరిసింది. 'వాళ్ళు కాంప్రమైజ్ అంటున్నారంటే, ప్రొడ్యూసరే మా ఆఫీసుమీద ఐటీ రెయిడ్ చేయించాడంటే, నన్ను ఏదోవిధంగా ఆ ఐటీ కేసులో ఇరికించి, దానికీ ఈ కేసుకూ ముడిపెట్టే ప్రయత్నమేనా?'

'వహ్వారే! రాజకీయమా!' అనుకుని నేను నోరు విప్పి నాలోని ఆలోచనను ఇన్‌స్పెక్టర్‌కు చెప్పబోయేంతలోనే, నా ఫోన్ మోగింది. అది మా ప్రొడ్యూసర్ దగ్గర నుంచే! నేను ఇన్‌స్పెక్టర్‌కు ఫోన్ చూపించాను. ఆయన 'స్పీకర్ ఆన్ చేసి మాట్లాడండి. రికార్డు బటన్ కూడా నొక్కండి' అని చెప్పాడు.

"సార్! నేను మీ ప్రొడ్యూసర్‌ని మాట్లాడుతున్నాను. ఆ పోలీసు కేసేదో ఉందంట కదా సార్! దాన్ని వాపసు తీసుకోండి. నాకు కౌన్సిల్ నుండి ఫోన్లు వస్తున్నాయి. వాళ్ళంతా పెద్దవాళ్ళు. ఇండస్ట్రీలో పదికాలాల పాటు నిలదొక్కుకోవాలంటే వాళ్ళతో శత్రుత్వం మంచిది కాదు..." అని ఏదో చెప్పబోతుండగానే, నేను మధ్యలోనే అతన్ని ఆపి,

"అవును సార్! వాళ్ళంతా చాలా పెద్దవాళ్ళు. ఎంత పెద్దవాళ్ళంటే, వాళ్ళు చెప్పినట్టు వినకుంటే మన సినిమా కంపెనీ మీద మనమే ఐటీ రెయిడ్ చేయించుకునేంత పెద్దవాళ్ళు. చెప్పు తీసుకుని....." అని నేను ఇంకా ఏదో అనబోతుండగా, ఇన్‌స్పెక్టర్ స్పీకర్ చూపించి మాట్లాడవద్దన్నట్టుగా సైగ చేశాడు.

ఇంతలో ప్రొడ్యూసర్ ఫోనులో నుంచి, "జరిగిందేదో జరిగిపోయింది. ఇక్కడితో వదిలెయ్!" అంటున్నాడు, కొంత రూడ్‌గా.

నాకు కోపం నసాళానికి ఎక్కింది. ముక్కుపుటాలు అదురుతున్నాయి. వాడు నా కళ్ళ ఎదుట ఉంటే తన్నాలనిపిస్తోంది. కోపాన్ని అదుపులోకి తెచ్చుకుంటూ మౌనంగా ఉండిపోయాను.

టేబుల్ మీద ఉన్న స్పీకర్ లోంచి మాటలు వినబడుతున్నాయి.

"ఇప్పుడు నీ ఇంకో లవర్... అదే డీసీపీ కూడా ఇక్కడ లేదు. దాని అండ చూసుకునే నువ్వు పేట్రేగిపోతున్నావ్? కేసు వాపసు తీసుకో. లేకపోతే..." అని హూంకరించాడు.




డీసీపీ మేడం ప్రస్తావన తీసుకొచ్చి ఆమెను చులకనగా మాట్లాడేసరికి ఇన్‌స్పెక్టర్‌కు తిక్క రేగింది.

ఫోన్ దగ్గరకు తీసుకుని,

"ఒరేయ్ కుక్కా! పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. నువ్వు మాట్లాడిన మాటలన్నీ రికార్డు అవుతున్నాయి ఇక్కడ. అరేయ్, సార్ మీద ఈగ వాలినా, శ్రావణి మేడం మీద అటాక్ జరిగినా, డీసీపీ మేడం గురించి ఇంకొక్క మాట చెడుగా మాట్లాడినా, ముందు నిన్ను లాక్కొచ్చి ఇక్కడే చెక్కభజన చేయిస్తా. ఇప్పుడు చెప్తున్నా విను. నువ్వు డీసీపీ మేడంను ఇంత ఇన్సల్ట్ చేశావు కాబట్టి, సారు కాంప్రమైజుకు ఒప్పుకున్నా నేనొప్పుకోను. అరేయ్ సాలే! డీసీపీ మేడం ఇవాళ ఇక్కడ లేకపోవచ్చు. లేదా రేపే ఇక్కడికి మళ్ళీ రావచ్చు. మేడంను కామెంట్ చేసేంత మొగోడివైనావురా? పోయినసారి మర్డర్ కేసులో ఇరుక్కున్నప్పుడు ఇదే పోలీస్ స్టేషన్లో బట్టలిప్పి మక్కెలిరగ కొడుతుంటే లాగులు తడుపుకున్న సంగతి మర్చిపోయినావురా? మేడం వదిలేసింది కాబట్టి బతికి పోయినవ్! లేకపోతే ఇప్పుడు చంచల్‌గూడా జైల్లో చిప్పకూడు తింటుండెటోడివి. ఛల్! ఫోన్ రక్!" అంటూ ఫోన్ కట్ చేశాడు.

ప్రొడ్యూసర్ టక్కున ఫోన్ పెట్టేశాడు.




## ఉగాది ప్రత్యేకం

మిట్ట మధ్యాహ్నం
మర్రి చెట్టు
నీడల్ని అక్కున జేర్చుకొంటోంది
నిలువుగా పడుతున్న కిరణాలతో

## వాక్యాల వ్యాకులం

చెరువు అడుక్కుపోయిన నీళ్ళు మెరుస్తున్నాయి!
ఎండకి డస్సిపోయిన దాహార్తితో
నీరసపడిన సముద్రం
మహామృగంలా ఉంది!
పక్షులన్నీ ఆకాశాన్ని ఖాళీచేసి
చెట్లకొమ్మల చెంతకు చేరాయి!
చెట్టు ఆకులు మాత్రం
ఎండని ఆత్రంగా తాగుతున్నాయి!
కాలిపోతున్న భూతలంపై
వడలి వాలిపోయింది దినసుమం
స్వేదంతో కలిసి ప్రవహిస్తోంది
శ్రమజీవుల నిర్వేదం!
నిన్న నీవు అతిగా ఆశపడిన నేడు
నిన్నగా మారలేక చేస్తున్న ఆర్తనాదం!

విశ్వాస రహిత నిశ్వాసంలా
దీర్ఘవేదనల దీనాలాపన!
సాధారణ వాక్యనిర్మాణానికి
వ్యాకరణం కావాలి!
వ్యాకుల వాక్యాల వక్తవ్యానికి



వ్యాకరణంతో పనేముంది?
వ్యధితల పరివేదనలు
వ్యాకరణాల సంకెళ్ళు
తెంచుకొని అలముకొంటున్నాయి
అన్ని చిక్కుముడులూ విడివడ్డాయి
ఎప్పటికీ వీడనివి రెండే
బ్రతుకూ, చావూ!

**–శశికాంత్ శాతకర్ణి**
**సెల్:98853 89759**

నాకు ఇన్‌స్పెక్టర్ విశ్వరూపం చూసి మనసు చల్లబడింది.

ఇన్‌స్పెక్టర్ నా వైపు చూసి "యూ డోంట్ వర్రీ! ఐ విల్ టేక్ కేర్ ఆఫ్ ఇట్!" అన్నాడు.

నేను "థాంక్స్!" అని బయటకు రాబోతుంటే,

"మీరు నన్ను గుర్తు పట్టలేదు కదూ?" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయి చూస్తూ "లేదే! మనం ఎప్పుడూ కలిసినట్టుగా కూడా గుర్తుకు రావడం లేదు" అన్నాను.

"మనం కలిశాం. దాదాపు రెండు గంటల పాటు కలిసి తిరిగాము" అన్నాడు.

నేను "రియల్లీ!" అని విస్తుపోయాను.

ఆయన నవ్వుతూ,

"అఫ్‌కోర్స్ సార్! యాదగిరిగుట్ట నుండి మేడం ఇంటికి బైక్ మీద మిమ్మల్ని తీసుకొచ్చింది నేనే. కానీ, అప్పుడు హెల్మెట్ పెట్టుకోవడం వల్ల నన్ను మీరు గుర్తు పట్టలేకపోయారు. ఆ కేస్ తర్వాత, మేడం గారి దయ వల్ల ఔట్ ఆఫ్ టర్న్ ప్రమోషన్ వచ్చింది. ఇక్కడే ఇన్‌స్పెక్టర్‌గా మూడు నెలల నుంచీ చేస్తున్నాను" అన్నాడు.

"ఓ మై గాడ్! ఐయాం సారీ! నిజంగా గుర్తుపట్ట లేకపోయాను" అంటూ అతన్ని కౌగలించుకున్నాను.

నిజంగా, ఒక్కోసారి ప్రపంచం చాలా చిన్నదని పిస్తుంది.

పెద్దగా పని లేకపోవడంతో ఇంట్లోనే పడుకుని జెఫ్రీ ఆర్చర్ రాసిన 'This was a Man' నవల చదువుతున్నాను. పుస్తకంలో మునిగిపోయిన నాకు టైమే తెలియలేదు. ఉదయం కాఫీ మాత్రం తాగాను. ఆకలి వేస్తుండడంతో లేచి చూశాను.

టైం రెండయింది.

హోటల్లో కూర్చుని భోజనం చేస్తుండగా దూరంగా ఒక అడ్వర్టయిజ్‌మెంట్ హోర్డింగ్ కనిపించింది.

ఒక అందమైన అమ్మాయి 'బ్రైడల్ కలెక్షన్' అంటూ ఒక నగను మెడలో వేసుకుని కారులో కూర్చుని ఉంది.

ఆ అందమైన అమ్మాయి కంటే ఇంకా అంద మైన అమ్మాయి నా సొంతం. ఆమె కూడా త్వరలోనే పెళ్ళికూతురు కాబోతుంది. అందుకని తనకు కూడా మంచి నగలు కొనాలనిపించింది.

నా దగ్గర డబ్బులుంటే ఆగవు. ఏదో విధంగా వాటిని ఖర్చు చేయాల్సిందే. లేకపోతే అంతవరకు నాకు మనశ్శాంతి దొరకదు.

కానీ, శ్రావణితో హైదరాబాదు షాపుల్లో షాపింగ్ చేయడమంటే కష్టమే. నేనంటే ఎవరికీ పెద్దగా పరి చయం లేదు కానీ శ్రావణి అప్‌కమింగ్ హీరోయిన్‌గా, చాలా కాకున్నా, పాపులర్.

ఆమెతో కలిసి షాపింగ్‌కి వెళితే ప్రజలు గుర్తు పట్టి గోల చేస్తారు. కానీ, పెద్ద పెద్ద షాపుల్లో ఖరీద యిన కస్టమర్లు ఉండే చోట అయితే కొంచెం ఫర్లేదు.

ఎందుకో, వెంటనే శ్రావణికీ, అమ్మకూ నగలు కొనాలనిపించింది. వెంటనే, శ్రావణికి ఫోన్ చేసి,

"ఫ్రీగా ఉన్నావా! బయటకు వెళ్దామా?" అని అడిగాను.

"నాకు ప్యాకప్ చెప్పారు. ఇప్పుడే మేకప్ తీసే స్తున్నాను" అంది.

"గుడ్! నేనొస్తున్నాను" అని తను 'నో' అని చెప్పే అవకాశం ఇవ్వకుండానే ఫోన్ పెట్టేశాను. ఇంటికెళ్ళి డబ్బులు తీసుకుని కృష్ణానగర్ నుండి 'అన్నపూర్ణ ఏడెకరాల స్టూడియో మీదుగా, జూబ్లీహిల్స్ చెక్ పోస్ట్ నుండి ఫిల్మ్‌నగర్ మీదుగా, బైక్ మీద కాబట్టి, పదిహేను నిమిషాల్లో రామానాయుడు స్టూడియోకు చేరుకున్నాను.

నాలుగో ఫ్లోర్లో ఉన్న శ్రావణిని తీసుకుని బయట కొచ్చి బైక్ దగ్గరకు నడుస్తుంటే,

"అమ్మో బైకా?" అంది గుండెలమీద చేతులు వేసుకుంటూ.

నాకు తెలుసు బైక్ మీద వెళ్తుంటే అందరూ గుర్తుపడతారని తన భయం. అందుకని, జేబులో నుంచి 'స్కార్ఫ్' తీసి ఇచ్చి,

"ముసుగు ధరించు చెలీ!" అన్నాను నవ్వుతూ.

మబ్బుల చాటుకు మాయమయిన జాబిల్లిలా శ్రావణి ముఖం ముసుగులో మాయమయింది.

శ్రావణి ఎక్కగానే బైక్‌ని ముందుకు పరిగెత్తిం చాను. ఎంత పడవలాంటి కారు ఉన్నా బైక్‌లోని మజా, థ్రిల్లే వేరు. అదీ ప్రియురాలు పక్కన ఉంటే, హైదరాబాదు గుంతల రోడ్లన్నీ స్వర్గానికి రహదా రులే అనిపిస్తుంది. ఆ ఝలక్‌లు; ఆ 'వామ్మో' అనే ఆశ్చర్యార్థకాలు; ఆ టచ్చులు; వెనుక ఒడిసి పట్టుకుని కూర్చున్న ప్రియురాలి ఆపసోపాలు అనుభవించా ల్సిందే గానీ మాటల్లో వర్ణించలేము.

నాక్కూడా, బైక్ నడుపుతున్నప్పుడైనా, వేరే ఎప్పు డైనా సరే శ్రావణి తోడుంటే ఏదో సాధించినంత గర్వం కలుగుతుంది. ఎవరో సుదూరంగా నిలబడి ఒక అనంత, ఆనంద ప్రేమగీతం ఆలపిస్తున్నట్టుగా, దానికి నా హృదయం పరవశించి నాట్యమాడుతున్నట్టుగా అనిపిస్తుంది.

నేను ఆమె మీద జాలితోనో, దయతోనో ఆమెను ప్రేమించడం లేదు. ఇంకా మాట్లాడితే, తను నా

**మీరు కాంప్రమైజ్ అవుతున్నారని, అంతా సర్దుకుంటుందని, అప్పటిదాకా కేసు ఫైల్ చేయవద్దని అంటున్నారు సార్. మాపై చాలా ఒత్తిళ్ళు వస్తున్నాయి. ఏం చేద్దామంటారు సార్? దర్శకుణ్ణి అడిగాడు ఇన్‌స్పెక్టర్. మరి ఆ దర్శకుడు ఏం చెప్పాడు? నిజంగానే ఆయన కాంప్రమైజ్ అయ్యాడా?**

పక్కనుంటే, ఆమెతో మాట్లాడుతుంటే నాకే ధైర్యం కలుగుతుంది. కానీ, శ్రావణే నన్ను ఇంకా పూర్తిగా నమ్మడం లేదు. తనకు నమ్మకం కలగాలంటే ఏదో ఒకటి చేయాలి. ఏం చేయాలో నాకు తెలుసు.

స్పీడ్ బ్రేకర్స్ ప్రేమికుల పాలిట దేవదూతలు. స్పీడ్ బ్రేకర్ రాగానే ప్రియురాలు, ప్రియుడి మీద పూర్తిగా ఆధార, పడి, పోతుంది. అది ప్రియుడికి బాగా నచ్చుతుంది. అందుకే, రెగ్యులర్ బైక్ రైడర్లు, అక్కడ కూడా స్పీడ్ బ్రేకర్లకు పూజలు చేస్తుంటారు, తెల్లవారు జామున్నే లేచి.

అలాంటి ఒక స్పీడ్ బ్రేకర్ రాగానే, శ్రావణి నా భుజం మీద ఒక చెయ్యి, నడుం చుట్టూ మరో చెయ్యి వేసింది. ఆ చేతులు ఎంత సుకుమారంగా ఉన్నాయంటే... ప్రబంధ కవులు ప్రణయ కావ్యాలు రాసేటప్పుడు అందులోని శృంగార నాయికలను వర్ణించేటప్పుడు, చేతులను తామర తూండ్లతో పోలుస్తారట... అంత లేతగా ఉన్నాయి.

ఆ చేయి నా నడుంపైన వేయడమనే చేష్టలో నా పట్ల తనకు ఎంత ఆప్యాయత, అభిమానం ఉందో వ్యక్తమైంది, చెప్పకనే చెపుతోంది. పసిడి రంగు చేతి వేళ్ళు, వేళ్ళ కొసన పండిన ముద్ద గోరింటాకు, సప్త వర్ణాల చేతి గాజులతో ఆ ఒక్క చెయ్యే ఎంతో భువనైక సౌందర్యంతో అలరారుతోంది. ఆ చేయిని చూసుకుంటూ జీవితమంతా నిశ్చింతగా బ్రతికేయొచ్చు. తను అలా కూర్చోవడంలో, ఆమె దేహం నుండి సన్నగా వీస్తున్న లేత పున్నాగ పూల పరిమళం మత్తెక్కిస్తోంది. తను కదిలినప్పుడల్లా, ఆ

## సినీవాలి
## కూపన్ నెం.23 విజేత

**ఇండ్లూరు క్రిష్ణవేణి**
**సున్నపురాళ్ళపల్లె, రాజంపేట**

కూర్చున్న భంగిమ మూలంగా, ఒక వక్షం నాకు అలవోకగా తాకుతోంది.

సిగ్నల్ దగ్గర బండి ఆగినప్పుడు వెనుకకు తిరిగి తనను చూశాను. 'ఏమిటన్నట్టుగా' కొంటెగా కళ్ళెగరేస్తూ అడిగింది, ముసుగు లోంచి. నేను ఏమీ లేదన్నట్టుగా తలూపి చిరునవ్వు నవ్వాను. ఏం లేదనడం మాత్రం అబద్ధమే!

"గుండెల్లో వలపుగంధపు వనాలు తగలబడుతూ, ఆ మోహావేశంలో నేను పరవశించి పోతున్నానని చెప్పలేను కదా!"

గ్రీన్ లైటు వెలిగింది. బైకును పంజాగుట్టలోని అత్యంత, అంగరంగవైభోగంతో అలరారుతున్న జ్యూయలరీ షాపు ముందు ఆపాను. శ్రావణి ఆశ్చర్యంగా చూసింది.

ఇద్దరమూ లోపలికి వెళ్ళాము.

ఒక పసిడివనంలోకి అడుగు పెట్టినట్టయింది. ఎటుచూసినా దేదీప్యమానమైన, ధగద్ధగాయమైన షాండ్లియర్స్ వెలుతురులో జిగేలుమంటున్న నగలు. మయసభలో మొదటిసారిగా ప్రవేశించిన దుర్యోధనునిలా నేనూ నోరెళ్ళబెట్టాను. ఒక్కో నగ ఒక్కో వింత శోభను విరజిమ్ముతోంది. బంగారు, వజ్ర, వైఢూర్యాల ఆభరణాలతో మెరిసిపోతోంది.

శ్రావణి ముఖానికున్న ముసుగు తీసింది. శ్రావణి ముందు ఆ పసిడి నగలన్నీ వెలవెలబోయాయి.

మమ్మల్ని చూసి ఒక సేల్స్‌మేన్ వచ్చాడు.

శ్రావణి నన్ను పక్కకు పిలిచి, "ఎందుకు? ఇప్పుడు ఏం కొందామని?" చిరుకోపంతో అడిగింది.

అప్పటికే ఆమెను కొంతమంది గుర్తుపట్టడంతో చిన్న కదలిక మొదలయింది. పది నిమిషాలు అయ్యే సరికి ఆమె చుట్టూ చాలామంది చేరారు. షాపు యజమాని కూడా శ్రావణిని గుర్తుపట్టి మా ఇద్దరినీ లోపలి ఛాంబర్‌లోకి తీసుకెళ్ళాడు.

నాకైతే, ఇందాక హోర్డింగులో చూసినటువంటి కంఠాభరణం శ్రావణి వేసుకుంటే చూడాలనిపించింది. ఆ విషయమే చెప్పాను. ఒక్కో నగను, అటెండెంట్ అమ్మాయి సుతారంగా, శ్రావణి మెడను అలంకరిస్తుంటే, ఆ నగకే, అంతకుముందు లేని అందమొచ్చినట్టయింది. ఆ వెలుతురుల్లో ఏ నగ లేకున్నా శ్రావణి మెరిసి పోతుంది.

తను నగ మార్చినప్పుడల్లా నేను చకచకా రెండు మూడు యాంగిల్స్‌లో ఫోటోలు తీసుకున్నాను. నాకే గనుక శక్తి ఉంటే ఆ కంఠాభరణాలన్నీ కొని శ్రావణిని రోజుకొక నగతో అలంకరించి అర్చించే వాణ్ణి.

అన్నింటిలోకి ఒక నెక్లెస్ శ్రావణికి బాగా సూటయింది.

---

పసిఫిక్ సముద్రపు సైకత తీరాల్లో దొరికే శంఖువు లాంటి పలుచటి శ్రావణి మెడ మాయమై, ఒక మణిమయ రత్న మంజూష ప్రత్యక్షమైంది.

నాకు బాగా నచ్చింది. దాన్నే తీసుకుందామని నిర్ణయించుకున్నాను. కానీ, రేటు చూసి "అమ్మో! ఎనిమిది లక్షలా?" అంది శ్రావణి.

షాపు యజమాని, శ్రావణి 'అమ్మో!' అనడం చూసి,

"ఏంటి మేడం? మీరు సినిమా హీరోయిన్. ఈ మాత్రానికే భయపడితే ఎలా?" అన్నాడు.

శ్రావణి అతనివైపు నిరసనగా చూసింది.

శ్రావణి ఆర్థిక పరిస్థితి నాకు తెలుసు. ఆమె చూడ్డానికి స్వర్గలోకపు రాకుమారిలా ఉంటుంది గానీ, నాకు తెలుసు, తనకు లక్ష్మీ కటాక్షం లేదు. కానీ ఆమె కున్న గ్రేస్‌ను బట్టి ఆమె దగ్గర కోట్లు మూలుగుతున్నా యని ప్రజలు అనుకుంటారు.

నేను దాన్ని ప్యాక్ చేయమన్నాను. శ్రావణి ఒప్పుకోలేదు.

"ఉహుఁహుఁ! వద్దు. అన్ని లక్షలు పెట్టి ఇప్పుడు నగ కొనడం ఎందుకు? అస్సలే వద్దు" అని తల అడ్డంగా ఊపింది.

ఇంతలో షాపు యజమాని కుమారుడు, కీర్తి లాల్ మా దగ్గరకు వచ్చాడు. తండ్రీకొడుకులు ఏదో గుసగుసలాడుకుని నా దగ్గరకొచ్చి, శ్రావణిని నేను తీసిన ఫోటోలు చూపించమన్నారు. నేను ఆదుర్దాగా "ఎనీ ప్రాబ్లెం?" అన్నాను.

అలా ఫోటోలు తీయడం తప్పేమోనని నాకు అనిపించింది. కానీ, ఆ ఫోటోలు తీస్తున్నప్పుడు షాపు యజమాని కూడా అక్కడే ఉండి ఎందుకు అడ్డుకోలే దన్న అనుమానం కూడా వచ్చింది.

కీర్తిలాల్ నవ్వుతూ "అదేం లేదు సాబ్!" అని అన గానే నేను ఫోటోలు చూపించాను. వాళ్ళిద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. పక్కకు వెళ్ళి ఏదో మాట్లాడుకున్నారు. ఇద్దరూ చేతులు కట్టుకుని, నవ్వు కుంటూ మా దగ్గరకు వచ్చి,

"మాదీ ఒక ప్రపోజల్ ఉంది సాబ్!" అన్నారు.

మేమిద్దరమూ ఆశ్చర్యపోయాము.

శ్రావణి నా వైపు ఏమిటన్నట్టుగా చూసింది. నేను 'ఏమో' అని భుజాలు ఎగరేశాను. అందుకే వాళ్ళను చూసి,

"చెప్పండి!" అన్నాను.

"మేం ఇంతవరకు ఎంతోమంది మోడల్స్‌తో, సినిమా యాక్టర్స్‌తో యాడ్స్ చేశాము. కానీ, మేడంకు నప్పిన ట్లుగా ఎవ్వరికీ నెక్లెస్‌లు సూట్ కాలేదు. త్వరలోనే కూకట్‌పల్లిలో మా బ్రాంచ్ ఒకటి ఓపెన్ చేస్తున్నాము. మేడం ఒప్పుకుంటే తనతో మా యాడ్ కాంపెయిన్ చేయాలని మా ఆలోచన" అని, కీర్తిలాల్ ఒక్క క్షణం ఆగి,

"మూడేళ్ళ కాంట్రాక్టు. ఇయర్లీ టూ టైమ్స్, టూ డేస్ చొప్పున షూటింగ్. మొత్తం రెమ్యునరేషన్ వేరే మోడల్‌కు ఇరవై ఐదు లక్షలు ఇవ్వాలని అనుకున్నాం. మీకూ అదే మొత్తం ఆఫర్ చేస్తున్నాం. ఫస్ట్ ఇయర్ పది లక్షలు, సెకండ్ ఇయర్ పది లక్షలు, థర్డ్ ఇయర్ ఐదు లక్షలు పే చేస్తాం."




వాళ్ళ ప్రపోజల్ విని మేమిద్దరమూ నోరెళ్ళ బెట్టాము. మేం ఎందుకోసం వచ్చామో, ఇక్కడేం జరుగుతుందో, ఒక్క క్షణం, మాకు అర్థం కాలేదు.

నేను శ్రావణిని మాట్లాడవద్దని సైగ చేశాను.

"మీరు మాట్లాడుకోండి. మీకు ఓకే అయితే మా డిజైనర్‌ను, కెమెరామెన్‌ను పిలుస్తాము" అంటూ ఆ రూములో మా ఇద్దరినీ వదిలేసి వెళ్ళారు. తలుపు మూత పడగానే, మేమిద్దరమూ ఫక్కున నవ్వుకున్నాం.

"మనం వచ్చేటప్పుడు పంజాగుట్టలో నక్క తోక తొక్కి వచ్చినట్టుంది" అన్నాను.

"ఇరవై ఐదు లక్షలు ఎక్కువ కదా?" అంది శ్రావణి.

"ష్! వాళ్ళు మనని సీసీటీవీలో కెమెరాల్లో అబ్జర్వ్ చేస్తుంటారు. డబ్బుల విషయం వదిలేయ్! ఈ యాడ్ షూట్ నీకిష్టమేనా?" అడిగాను.

"అబ్బో, ఎన్ని నగలో... అవన్నీ ఫ్రీగా పెట్టుకోని వ్వడమే కాకుండా అలా పెట్టుకున్నందుకు ఎదురు డబ్బులిస్తానంటే చేదా? నాకిష్టమే. పైగా బోలెడు పబ్లిసిటీ కూడా వస్తుంది" అంది.

"సరే! అయితే, నా ఫ్రెండుకు ఒకడికి ముంబైలో యాడ్ ఏజెన్సీ ఉంది. వాణ్ణి అడుగుదాం" అని అత నికి మెసేజ్ పెట్టాను. ఫోన్లో మాట్లాడలేని పొజిషన్లో ఉన్నానని, కాబట్టి మెసేజ్ రూపంలోనే సమాధానం ఇవ్వమని చెప్పి నేను ఈ ప్రపోజల్ గురించి అతని అభిప్రాయం అడిగాను.

వాడు, "ఎన్ని హోర్డింగులు పెడతారు, ఎక్కడెక్కడ పెడతారు, ఎంత కాలం పెడతారు, ఏయే భాషల్లో పెడతారు, రెన్యువల్ అప్పుడు రెమ్యునరేషన్ పెంచు తారా? వైటెంత, బ్లాకెంత? షూట్ ఎక్కడ ఉంటుంది? అప్పుడు ఇద్దరికీ అకామడేషన్, కన్వీయెన్స్, అసి స్టెంట్ల బేటాలు" వంటి అంశాలతో చాంతాడంత లిస్ట్ పంపించాడు.

చివరగా "బార్గెయిన్ ఫర్ ఫిఫ్టీ లాక్స్. సెటిల్ ఫర్ ఎనీ అమౌంట్ బిట్వీన్ ట్వంటీ ఫైవ్ అండ్ ఫార్టీ" అని సలహా ఇచ్చాడు.

నేను వాళ్ళను పిలిచి, "ఇన్ ప్రిన్సిపుల్‌గా మాకు ఓకే. కానీ, ఈ విషయాలన్నింటిపై క్లారిటీ కావాలి" అని లిస్టు చూపించాను.

కీర్తిలాల్ నవ్వుతూ, "సార్! చాలా ఫాస్టుగా ఎంక్వైరీ చేశారు. అన్ని వివరాలూ అగ్రిమెంటులో టైప్ చేయించి మీకు మెయిల్ చేస్తాను" అని శ్రావణి వైపు తిరిగి,

"మేడం యూ ఆర్ లుకింగ్ గార్జియస్ ఇన్ జ్యూయలరీ. మీతో యాడ్ షూట్ చేసి రిలీజ్ చేస్తే, మా కొత్త బ్రాంచికి లక్ష్మీకటాక్షం గ్యారంటీ!" అన్నాడు.

మస్కా కొట్టడంలో వ్యాపారస్థులను మించిన వాళ్ళుండరు.

ఇంతలో వాళ్ళ సేల్స్‌మేన్ వచ్చి,

"సార్! మేడంను చూడ్డానికి బయట జనం గుమికూడుతున్నారు సార్!" అని చెప్పాడు.

మాంచి బిజినెస్ డీల్ జరుగుతున్నప్పుడు, తురుపు ముక్కలా వచ్చిన సేల్స్‌మేన్‌ను మనసులోనే అభి నందించాను.

కీర్తిలాల్ ఆందోళనగా బయటకు వెళ్ళి ఐదు నిమిషాల తరువాత తిరిగొచ్చి,

"మేడం! మీరొకసారి వచ్చి అందరికీ కనిపించి వెళ్ళండి" అని రిక్వెస్ట్ చేశాడు. ఎక్కువ రెమ్యునరేషన్ కోసం బార్గెయిన్ చేయడానికి అవకాశం కల్పించిన ట్టయింది.

పెద్ద సేఠ్ గారు, శ్రావణిని తీసుకుని బయటకు వెళ్ళారు. నేనూ, కీర్తిలాల్ మిగిలాము.

"ఒక్కమాట. మీరు చెప్పిన ఇరవై ఐదు లక్షలు మూడేళ్ళకు ఓకే. కానీ, ముందు ఒక సంవత్సరానికి పది లక్షల చొప్పున అనుకుందాము. మొదటి సంవ త్సరం తరువాత, అప్పటి పరిస్థితులను బట్టి మరో అగ్రిమెంటు చేసుకుందాము. బట్, మా ఫస్ట్ ప్రిఫ రెన్స్ మీకే. ఈ పది లక్షల మొత్తానికి ఇప్పుడు సెలెక్ట్ చేసిన నెక్లెస్ తీసుకుంటాము. సరేనా?" అన్నాను. నేను కూడా వ్యవహారాల్లో కొంచెం రాటుదేలిపోయాను, ముఖ్యంగా మొన్న ఐటీ రెయిడ్ జరిగినప్పటి నుండి.

**(ఇంకా వుంది)**




## మూడు కప్పుల టీతో మతిమరుపు మాయం?

**టీ,** కాఫీల సేవనం మీద రోజుకొక కొత్త పరిశోధన వెలుగు చూస్తూనే ఉంది. టీ సేవించడం వలన కలిగే లాభాల మీద తాజాగా మరో పరిశోధనా ఫలితం తెలియ వచ్చింది. ప్రతిరోజూ మూడు కప్పుల టీ తాగితే మతిమరుపును అధిగమించవచ్చన్నది ఆ పరిశోధనా సారాంశం.

టీ ఆకుల్లో ఉండే క్యాటెచిన్స్, థియోఫ్లోవిన్స్ పోషకాల వలన మెదడులో వాస్క్యులార్ డ్యామేజ్, న్యూరో డీజనరేషన్ తగ్గుతాయని పరిశోధకులు చెబుతున్నారు. ఏ రకం టీ తాగినా 50 శాతం డెమెన్షియా వచ్చే అవకాశాలు తగ్గుతాయన్న విషయం వీరి పరిశోధనలో వెల్లడైంది.

అయితే మూడు కప్పుల టీకి మించకూడదని వీరు చెబుతున్నారు. అంతకు మించి తాగితే మంచి కన్నా చెడు జరిగే అవకాశం లేకపోలేదని వారు హెచ్చరిస్తున్నారు.

## బి విటమిన్‌తో కాలుష్యం నుంచి రక్షణ!

**వా**యు కాలుష్యం వలన జరిగే అనర్థాలు ఇన్నీ అన్నీ కావు. ఈ కాలుష్యం మన శరీరంలోని పలు అవయవాల మీద ప్రభావం చూపుతోందన్న విషయం తెలిసిందే! వాయుకాలుష్యం వలన కలిగే అనర్థాల గురించి తెలిసినా బయట తిరగకుండా ఉండలేని పరిస్థితి. బయటకు వెళ్ళే సమయంలో ఈ కాలుష్యం బారిన పడకుండా ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఫలితం శూన్యం. ఈ జాగ్రత్తలు తీసుకోకుండానే విటమిన్-బితో కాలుష్య ప్రభావం నుంచి తప్పించుకోవచ్చు అంటున్నారు అమెరికా పరిశోధకులు. కొంతమందికి బి-12 విటమిన్ ఇచ్చిన అనంతరం వాయుకాలుష్యం అధికంగా ఉండే ప్రాంతానికి పంపించారు. అనంతరం వీరిని పరిశీలించగా వాయుకాలుష్యం వీరి జన్యువుల మీద ఎలాంటి ప్రభావం చూపించలేదు. అయితే బి-విటమిన్ వాయుకాలుష్యం నుంచి రక్షణ కల్పిస్తుందన్న విషయం మొదటిసారి రుజువైంది. దీని మీద కచ్చితమైన నిర్ధారణకి ఇంకా కొన్ని పరిశోధనలు నిర్వహించాల్సి ఉంటుంది అంటున్నారు పరిశోధకులు.





## స్త్రీలలో జ్ఞాపక శక్తి ఎక్కువే!

**స్త్రీ**ల కన్నా పురుషులు తెలివి కలవారనీ, జ్ఞాపక శక్తి ఎక్కువ కలిగి ఉంటారన్న అభిప్రాయం చాలామందిలో ఉంది. అయితే ఇది తప్పు అంటున్నారు పరిశోధకులు. వాస్తవానికి స్త్రీలలోనే జ్ఞాపక శక్తి ఎక్కువగా ఉంటుందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనలో వెల్లడైంది. మెనోపాజ్ దశలో ఉన్న స్త్రీలలో కొంత జ్ఞాపకశక్తి మందగించినా, పురుషులతో పోలిస్తే స్త్రీలలో మెరుగ్గా ఉంటుందని పరిశోధకులు చెబుతున్నారు. ఇందుకు గానూ 45 సంవత్సరాల నుంచి 55 సంవత్సరాల మధ్య వయస్సు గల స్త్రీ పురుషుల జ్ఞాపకశక్తిని పరిశీలించారు. స్త్రీలలో కొందరు మెనోపాజ్ దశకు చేరుకున్నవారు ఉన్నారు. ఆ దశలో సహజంగా కలిగే మతిమరుపు వారిలో కనపడినా, కొత్త విషయాలు నేర్చుకోవడానికీ, నేర్చుకున్న విషయాలు గుర్తు పెట్టుకోవడానికీ ఉత్సాహం చూపడాన్ని పరిశోధకులు గుర్తించారు. పురుషులలో కొందరు ఎలాంటి ఆరోగ్య సమస్యలు లేనప్పటికీ కొత్త విషయాలు నేర్చుకోవడానికీ, నేర్చుకున్న వాటిని గుర్తు పెట్టుకునే విషయంలో పెద్దగా ఆసక్తి చూపించలేదు. కొన్ని రోజుల అనంతరం వీరికి పరీక్ష పెట్టగా విషయ గ్రహణలో స్త్రీలే ముందు నిలిచారు. చదువులలో ఆడపిల్లలు ముందుండడానికి కూడా వారిలో ఉండే జ్ఞాపకశక్తే కారణమని పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు.

## వ్యాయామంతో మెనోపాజ్ సమస్యలు దూరం!

**ప్ర**తి స్త్రీ తన జీవితంలో తప్పనిసరిగా ఎదుర్కొనే దశ మెనోపాజ్. ఈ దశలో స్త్రీ శరీరంలో పలు మార్పులు చోటు చేసుకోవడమే కాదు, కొన్ని అనారోగ్య సమస్యలు కూడా తెలుస్తాయి. అకారణంగా బరువు పెరగడం, హార్మోన్ల అసమానతలు, చెమట అధికంగా పట్టడం, అకారణ కోపం తదితర సమస్యలు కనిపిస్తాయి. కొంత కాలం కనిపించే ఈ సమస్యల కారణంగా స్త్రీలు మానసిక వేదన అనుభవిస్తారు. ఈ సమస్యల నుంచి తప్పించుకోవాలంటే ప్రతి రోజూ వ్యాయామం చేయాలని సూచిస్తున్నారు పరిశోధకులు. మెనోపాజ్‌కి దగ్గరగా ఉన్న సుమారు 234 మంది స్త్రీలను వీరు పరిశీలించారు. వీరిలో 166 మంది చేత క్రమం తప్పకుండా వ్యాయామం చేయించారు. అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించగా, అకారణంగా చెమటలు పట్టడం, బరువు పెరగడం, కోపం వంటి సమస్యలు తగ్గుముఖం పట్టడాన్ని గమనించారు. కేవలం వ్యాయమం వలనే సాధ్యమైందా, మరేదైనా కారణం ఉందా? అన్న విషయం మీద ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.

—అవినాష్






**కాళ్ళు కదల్చటానికి ప్రయత్నిస్తున్నాడు అక్షయ్.**

**శరీరం తన స్వాధీనంలో లేనట్లుంది.**

**అంతా మసక మసగ్గా కనిపిస్తోంది.**

**'అమ్మో...మ్మా!' అరవటానికి ప్రయత్నిస్తున్నాడు. నోట్లో నుంచి మాట బయటికి రావటం లేదు. మూలుగులా వినిపిస్తోంది అతని అరుపు.**

**సడన్‌గా మెలకువొచ్చిందతనికి.**

గభాల్న లేచి కూర్చున్నాడు.

ఒళ్ళంతా చెమటలు కారుతున్నాయి.

కల తాలూకు జ్ఞాపకాలతో మనసంతా ఆందోళనగా, దిగులుగా ఉంది.

అప్పుడు గమనించాడు.

పక్కబెడ్ మీద కూర్చుని ఆదుర్దాగా తనవైపే చూస్తున్న పదిహేనేళ్ళ పిల్లవాడిని.

కొద్ది క్షణాల్లో తేరుకున్నాడు అక్షయ్.

పలకరింపుగా నవ్వాడు.

ఆ పిల్లవాడి మొహం విప్పారింది.

కాసేపటికి ఆ పిల్లవాడి వివరాలు రాబట్టాడు అక్షయ్.

తొమ్మిదో తరగతి చదువుతున్నాడట. పేరు ఉజ్వల్. తండ్రి ఆర్టీసి బస్‌డ్రైవర్‌గా చేసేవాడట. సంవత్సరం క్రితం జరిగిన ఏక్సిడెంట్‌లో అతను చనిపోయాడు. భార్యకి అతని స్థానంలో ఏదైనా ఉద్యోగం ఇప్పించుకునేందుకు ప్రయత్నాలు జరుగుతుండగా తెలిసింది, ఆమెకి కేన్సర్ వ్యాధి రెండో దశలో ఉందని. అది కూడా అత్యంత ప్రమాదకరమైన లంగ్ కేన్సర్. వెంటనే సర్జరీ చేయకపోతే ప్రాణానికి ప్రమాదమని డాక్టర్లు చెప్పారన్నాడతను.

అందుకు అవసరమైన డబ్బు ఎలా సమకూర్చుకోవాలో ఆలోచిస్తుండగా బ్రోకర్ ఉజ్వల్‌ని కలిశాడు. కిడ్నీకి మూడు లక్షలు ఇస్తానన్నాడు. ఎటూ పాలుపోని పరిస్థితిలో తల్లిని రక్షించుకోవటానికి వేరే దారి లేక అందుకు ఒప్పుకున్నాడు ఉజ్వల్.

తాతగారి ఊరికి వెళ్తున్నానని తల్లికి అబద్ధం చెప్పి, వచ్చి హాస్పిటల్లో చేరాడు.

అక్షయ్ జాలిగా చూస్తుండగా అన్నాడు ఉజ్వల్.

"లైబ్రరీకి వెళ్ళి బాగా రీసెర్చ్ చేశానన్నా! ఏమీ భయంలేదు. ఒక్క కిడ్నీతో తొంభై ఏళ్ళు బతికిన వాళ్ళు కూడా ఉన్నారు."

"ఒరేయ్ పిచ్చి కన్నా! అన్నీ ఉన్నవాళ్ళ సంగతిరా అది. నువ్వు ఈ హాస్పిటల్ నుంచి బయట పడిన మరుక్షణం నిన్ను పట్టించుకునే వారుండరు. ఏదైనా ఇన్‌ఫెక్షన్ వస్తే ఏమైపోతావురా?" అక్షయ్ మనసులోనే ఆక్రోశిస్తున్నాడు.

అక్షయ్ మొహం చూస్తుంటే అర్థమైందేమో మళ్ళీ అతనే అన్నాడు.

"నాకు ఏమయినా పర్వాలేదన్నా. అమ్మకి ఏదైనా అయితే తమ్ముడు, చెల్లి అందరూ రోడ్డున పడాలి."

కదిలిపోయాడు అక్షయ్.

ఏం మాట్లాడాలో అర్థం కాలేదు.

ఇంతలో ఆ గదికి ఉన్న ఇనుప డోర్ కిర్రున శబ్దమైంది. కొద్దిగా తెరిచి కుతూహలంగా లోపలికి చూస్తున్న కళ్ళు.

అక్షయ్ స్నేహపూర్వకంగా నవ్వగానే తలుపు తోసుకుని లోపలికొచ్చింది ఒక అయిదారేళ్ళ పాప. గులాబీరంగు ఫ్రాక్ వేసుకుని ఉంది. నున్నగా దువ్వి కట్టిన పోనీటెయిల్. గుండ్రటి మొహం. బంగారు రంగులో ఉందామె. కళ్ళు కొద్దిగా లోపలికి పోయి నల్లటి వలయాలు కళ్ళ చుట్టూ కనబడుతున్నాయి.

చెవులకి ధగధగా మెరుస్తున్న డైమండ్ స్టడ్స్.

చిన్నపిల్లలకి కూడా ఈ నగలేమిటో! వాటి కోసం పిల్లల్ని ఎత్తుకుపోయే వాళ్ళ దృష్టిలో పడటానికి. తప్పు అనిపించింది అక్షయ్‌కి.

ముందుకు నడిచి అక్షయ్ ఎదురుగా నిలబడింది.

"హాయ్ అంకుల్" చేయి చాచింది.

"హలో బేబీ!"

షేక్‌హాండిచ్చి చేయి వదులుతున్నప్పుడు చూశాడు అక్షయ్, నీలం రంగులో ఉన్న చేతివేళ్ళనీ, గోళ్ళనీ.

"హార్ట్ ప్రాబ్లమ్!" బాధగా మూలిగిందతని మనసు.

"నా పేరు సోనీ!" చెప్పింది.

అప్పుడర్థమయింది అక్షయ్‌కి.

ఈ అమ్మాయే ఆ బిలియనీర్ బిజినెస్‌మేన్ మనవరాలు. ఈ పిల్లకే హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్. పెట్టి పుట్టిన ఈ పిల్లకోసమే మరెవరో అమాయక ప్రాణి బలవబోతోంది. ఒక్కక్షణం ద్వేషించాలనిపించింది అక్షయ్‌కి సోనీని. నీరసంగా, జబ్బు వల్ల లోతుకుపోయిన కళ్ళతో అమాయకంగా తన వైపే చూస్తున్న సోనీని చూస్తే జాలేస్తోంది.

తలుపు తోసుకుని బిలబిలమంటూ పరివారమంతా సోనీ కోసం వచ్చారు.

డాక్టర్ని, నర్స్‌ని ఆమెని అనుక్షణం అటెండ్ చేయటానికి పెట్టినట్లున్నారు.

పది, పన్నెండేళ్ళ పనిపిల్లను సోనీని చూసుకోవటానికి నియమించుకున్నట్లు ఉన్నారు. సన్నగా, తిండిలేక ఎండిపోయినట్లుగా ఉంది. బ్లడ్‌గ్రూప్ మ్యాచ్ అవలేదేమో! లేకపోతే ఈ పిల్లని ఎక్కడ బతకనిచ్చేవారు? ఎప్పుడో ట్రాన్స్‌ప్లాంట్ కోసం హార్ట్ లాగేసుకునేవారనిపించింది అక్షయ్‌కి.

"డాక్టర్, సోనీకి ఏమైంది?" అడిగాడు అక్షయ్.

"కార్డియోమయోపతీ" చెప్పాడు డాక్టర్.

"గుండె కండరానికి వచ్చే అంతుచిక్కని వ్యాధి. ఎందుకొస్తుందో ఎవరికీ తెలీదు. గుండె కండరం ఉన్నట్లుండి ఉబ్బిపోయి గట్టిపడుతుంది. గుండె చుట్టూ ఉండే టిష్యూ కణజాలం దెబ్బతింటుంది. మరీ తీవ్రంగా ఉన్న వాళ్ళలో గుండె చాలా బలహీనంగా తయారై బ్లడ్‌ని పంప్ చేయలేకపోతుంది. దీనివల్ల హార్ట్ ఫెయిలవటం, హార్ట్ బీట్ నార్మల్‌గా లేకపోవటం జరుగుతుంది".



**జరిగిన కథ**

అక్షయ్, కావ్య, సీమ, హర్ష ఓ మల్టీ నేషనల్ కంపెనీలో పనిచేస్తుంటారు. అక్షయ్ వాళ్ళ అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోవడంతో, వారి కూతురు నైరాని తన సంరక్షణలోకి తీసుకుంటాడు అక్షయ్. ఒకరోజు నైరా కనిపించకుండా పోతుంది. పోలీస్ ఇన్వెస్టిగేషన్ మొదలవుతుంది. పేపర్లలో వచ్చిన వార్తల ఆధారంగా, సీసీ ఫుటేజ్‌ల ద్వారా, ఇన్‌స్పెక్టర్ శ్రీకాంత్ ఇచ్చిన సమాచారం ఆధారంగా నైరా ఆచూకీ కోసం రకరకాలుగా ప్రయత్నిస్తుంటాడు అక్షయ్. ఆ ప్రయత్నాల్లో భాగంగా ఎంతోమంది చిన్న పిల్లలను కాపాడతాడు. నైరా ఆచూకీ కోసం కావ్య ఒక ఆన్‌లైన్ డిటెక్టివ్ ఏజెన్సీని కాంటాక్ట్ చేస్తుంది. ఓ పెద్ద బిజినెస్ మాగ్నెట్ మనవరాలికి హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ చేస్తున్నారని తెలుసుకొని, డోనర్‌లా అతుల్‌షా ఆఫీసుకి వస్తాడు అక్షయ్. కిడ్నీ ఇచ్చేందుకు బేరం కుదుర్చుకుంటాడు.

*ఆ తర్వాత...*

"సోనీ విషయంలో ఇది చివరివరకూ బయట పడలేదు. ఎడమచేతి చిటికెన వేలుకి స్పర్శ తెలీటం లేదనీ, మాటిమాటికీ తిమ్మిరెక్కుతుందనే కారణంతో డాక్టర్‌కి చూపించారు. చిటికెనవేలులో ఏమీ తేడా లేదనీ, అయితే గుండెచప్పుడులోనే ఏదో అబ్‌నార్మాలిటీ ఉందన్నాడు డాక్టర్. టెస్ట్‌లు అన్నీ చేయిస్తే చివరికీ జబ్బుని తేలింది".

"సాధారణంగా మందులతో ట్రీట్‌మెంట్ చేయొచ్చు. కొన్ని సందర్భాల్లో పేస్‌మేకర్ పెట్టడం, లేదా గుండె కండరంలో కొద్ది భాగాన్ని తొలగించటం కూడా చేయవచ్చు. అయితే సోనీది ఎక్స్‌ట్రీమ్ కేస్. నెల రోజుల్లో హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్ చేయకపోతే బ్రతకదు. చివరివరకూ బయటపడకపోవటం కొద్దిగా ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నా, కొన్ని కేసుల్లో ఇలా కూడా జరుగుతుంటుంది".

"ఇండియాలో పది లక్షల డోనర్ హార్ట్‌ల అవసరం ఉంది. అంటే వెయిటింగ్ లిస్ట్‌లో ఇంతమంది ఉన్నారన్నమాట. వీరిలో నెల రోజుల్లో గుండె మార్పిడి అవసరమయ్యేవాళ్ళు కొందరయితే, నెల కంటే ఎక్కువ రోజులు టైమ్ ఉన్నవాళ్ళు మరికొందరు."

"మిగతా అవయవ మార్పిడిలా అంత సులభం కాదిది. బ్లడ్‌గ్రూప్, హార్ట్‌సైజ్ మ్యాచ్ అవ్వాలి. డోనర్ బాడీలో నుంచి తీసిన నాలుగు గంటల లోపల ట్రాన్స్‌ప్లాంటేషన్ జరిగిపోవాలి. యాక్సిడెంట్ కేసుల కోసం ఎదురు చూసేంత టైమ్ లేదు ఈ కేస్‌లో".

"అందుకని మీరే వేరేవాళ్ళని చంపేసి గుండె కొట్టేస్తారన్నమాట" మనసులో అనుకున్నాడు అక్షయ్.

సోనీని చూస్తుంటే బాధగా ఉన్నా, మరొకరి ప్రాణం తీసి ఆమెకి గుండె అమర్చాలనే వాళ్ళ ప్రయత్నాన్ని ఆమోదించలేకపోతున్నాడు అక్షయ్.

ఉజ్వల్ ఆశ్చర్యంగా అంతా వింటున్నాడు.

సోనీ అటూఇటూ తిరుగుతూ ఆడుకుంటోంది. అయితే ఆమె విపరీతంగా అలసిపోతుండడం కనిపిస్తోంది. రెండు నిమిషాలకి ఒకసారి రెస్ట్ తీసుకోవాల్సి వస్తోందామె.

అప్పటికి దాని గురించి ఎన్నిసార్లు విని ఉంటుందో, లేకపోతే ఆమెకి తనకి జబ్బుందని తెలీటం లేదో... వేరే వాళ్ళగురించి మాట్లాడుకుంటుంటే విన్నంత నార్మల్‌గా ఉంది.

"ట్రాన్స్‌ప్లాంట్ వల్ల ఎన్నాళ్ళు లైఫ్ పొడిగించవచ్చు సాధారణంగా?" అడిగాడు అక్షయ్.

"కొంతమందికి సంవత్సరం, మరికొందరికి పదేళ్ళ వరకూ పొడిగించవచ్చు. కానీ అసలు సమస్య మన ఒంట్లోని ఇమ్యూన్ సిస్టమ్ గుండెని రిజెక్ట్ చేసే ప్రమాదం ఉంది. రెగ్యులర్‌గా దీనికోసం బయాప్సీ చేస్తుండాలి. ఒకవేళ శరీరం కొత్తగా అమర్చిన గుండెను తిరస్కరిస్తుంటే ఇమ్యూన్ సిస్టమ్ పని చేయకుండా ఆపేసే మందులివ్వాలి. సర్జరీ తర్వాత వచ్చే ఇన్ఫెక్షన్స్, లేదా ఇమ్యూన్ సిస్టమ్‌ని ఆపేయటం వల్ల వచ్చే ఇన్ఫెక్షన్స్‌తోనే పేషెంట్ మరణించే అవకాశాలున్నాయి" చెప్తున్నాడు డాక్టర్.

జబ్బు రావటమనేది, అందులోనూ చిన్నపిల్లలకి... ఎవరి విషయంలో అయినా బాధాకరమే అయినప్పటికీ డబ్బున్నవాళ్ళ జీవితకాలం పొడిగించడానికి మరొకళ్ళని చంపేయటానికి కూడా వెనుకాడకపోవటం ఆశ్చర్యంగానే అనిపిస్తోంది అక్షయ్‌కి.

ఏం చేయాలో ఆలోచిస్తున్నాడతను.





## అబ్బే...అలాంటిదేమీ లేదు!

త్రిష, రానాల మధ్య ఏదో నడుస్తోందన్న వార్తలు సోషల్ మీడియాలో బాగా హల్‌చల్ చేస్తుండడంతో చివరకు త్రిష నోరు విప్పాల్సి వచ్చింది. తమ మధ్య స్నేహం తప్ప మరేదీ లేదనీ, తను రానాను గాఢంగా ముద్దు పెట్టుకుంటున్న సందర్భం కూడా వేరని వివరణ ఇచ్చుకుంది. కాకపోతే వీరిద్దరి గురించి తెలిసిన వారు మాత్రం త్రిష మాటలు నమ్మడం లేదట! ఏదో వివరణ ఇవ్వాలి కనుక ఇచ్చినట్టు ఉంది తప్ప నిజం చెప్పినట్టు లేదని సోషల్ మీడియాలో కామెంట్లు మొదలయ్యాయి.

లంచ్ తర్వాత అతుల్‌షాని కలిశాడు అక్షయ్.

సాధారణంగా అతను ఎవరినీ అంత త్వరగా కలవటానికి ఒప్పుకోడు. కానీ అక్షయ్‌ని చూస్తుంటే అతనికి ఆ ఏజ్‌లో తనున్న రోజులు గుర్తొస్తున్నాయి. పైగా అక్షయ్‌తో కుదుర్చుకున్న ఒప్పందం అతనికి కంటిమీద కునుకులేకుండా చేస్తోంది. ఎవరికీ మూడు లక్షలకి మించి పరిహారం ఇవ్వడతను. అక్షయ్‌కి ఎనిమిది లక్షలు ఒప్పుకోవటం తనకే ఆశ్చర్యంగా ఉంది.

పక్కా బిజినెస్‌మేన్ అతను.

అక్షయ్‌ని చూస్తూనే తన నెగోషియేషన్ నైపుణ్యానికి పదును పెట్టాడు.

"బోరు కొడుతోందా హాస్పిటల్‌లో వెయిట్ చేయడం?" అడిగాడు.

"కొద్దిగా అటూఇటూ తిరుగుతూ టైమ్‌పాస్ చేస్తున్నాను" చెప్పాడు అక్షయ్.

"మనకి కిడ్నీకి అయిదు లక్షలకి మించి కొనేవాళ్ళెవరూ దొరకలేదు ఇంకా. కొన్నాళ్ళు వెయిట్ చేయాల్సి రావచ్చు" చెప్పాడు అతుల్.

ఫర్వాలేదన్నాడు అక్షయ్.

అతుల్ మొహం మాడిపోయింది. రేటు తగ్గిస్తాడనుకుంటే జిడ్డుగాడిలా వెయిట్ చేస్తానంటాడేమిటి?

అక్షయ్ అతణ్ణి మెల్లగా మాటల్లో పెట్టాడు.

"మేడమ్ ఏం చేస్తారు?" అడిగాడు.

"ఏ మేడమ్?" కొద్దిగా విసుగ్గా ఉందతని స్వరం.

"మీ వైఫ్" అమాయకంగా అన్నాడు అక్షయ్.

అతుల్ మొహం ఎర్రగా అయింది.

కళ్ళలో కోపం.

"వదిలేసి వెళ్ళిపోయింది. పెళ్ళికి ముందే" అన్నాడు.

"ఏంటి సర్ జోకులు? ఇంత అందంగా ఉన్నారు. బాగా చదువుకుని, ఇంత సంపాదించిన మిమ్మల్ని ఎలా వదిలేస్తారు?" నవ్వుతూ అన్నాడు అక్షయ్.

"నాకు కిడ్నీ ప్రాబ్లమ్ మొదలవగానే నా నుంచి దూరమవటం మొదలెట్టింది నా ఫియాన్సీ. అప్పటికే మాకు ఎంగేజ్‌మెంట్ అయిపోయింది. అంతకుముందు మూడేళ్ళ నుంచీ ప్రేమిస్తున్నానని నా వెంటపడేది. మరో డబ్బున్నవాడు దొరికాడు. నేను జబ్బులతో బాధ పడుతున్న టైమ్‌లో నన్నొదిలేసింది, అంతే."

"డబ్బు చపలమైంది అంటారు. కానీ డబ్బుకాదు. డబ్బు చుట్టూ తిరిగే మనుషులు చపలచిత్తులు."

"వదిలేస్తే వదిలేసింది. వెళ్ళే ముందు నన్నొక మాట అని పోయింది. 'హాఫ్‌మేన్' అని. ఒక కిడ్నీనే ఉన్నంత మాత్రాన అంతమాట అంటుందా? ఆడవాళ్ళంటేనే అసహ్యం ఏర్పడింది అప్పటి నుంచీ నాకు" చెప్తున్నాడు.

జాలేసింది అక్షయ్‌కి.

"మీరేమీ అనలేదా?" అడిగాడు.

"అన్నిటికీ దేవుడున్నాడు. ఏక్సిడెంట్‌లో చనిపోయింది. ఆమె అవయవాలన్నీ మా హాస్పిటల్లోనే అవసరమైన రోగులందరికీ అమర్చాము" తన్మయంగా చెప్పాడు అతుల్.

"వేయించేసినట్టున్నాడు" గొణుక్కున్నాడు అక్షయ్.

"ఇంకో రెండు రోజులు వెయిట్ చేయాలి నువ్వు, రోగి దొరికేవరకూ" డిమాండ్ - సప్లయ్ సూత్రం వాడుతూ అన్నాడు అతుల్.

అంత డబ్బు పెట్టి తీసుకునేంత డిమాండ్ కిడ్నీకి లేదంటే అక్షయ్ దిగి వస్తాడని అతని ప్రయత్నం.

అక్షయ్ తలూపి బయటపడ్డాడు.

బిల్డింగ్ ఆవరణలో లాన్, చిన్న పూలమొక్కలు, క్రోటన్స్, వాటర్ ఫౌంటెన్‌తో పార్క్‌లా ఉంది.

అటుగా వెళ్తున్న అక్షయ్ అక్కడే కూర్చున్న సోనీని చూశాడు.

"హాయ్ బేబీ!" పలకరించాడు.

"హాయ్" చెప్పింది.

"మా తాత!" అక్కడే కూర్చుని ఉన్న పెద్దాయనకి పరిచయం చేసింది.

అతణ్ణి చూసి ఆశ్చర్యపోయాడు అక్షయ్.

ఎత్తులకి పైఎత్తులు వేస్తూ ప్రత్యర్థి కంపెనీలని నేలకు రప్పించటంలో దిట్టగా పేరుపొందిన బిజినెస్‌మేన్. దేశ విదేశాల్లో ఎన్నో వ్యాపారాలున్నాయి అతనికి. పోలీసు వ్యవస్థ, పొలిటికల్ సిస్టమ్ అంతా అతని కనుసన్నల్లోనే నడుస్తుంది. ఇదివరకు టీవీలో ఎన్నోసార్లు ఇంటర్వ్యూలలో చూశాడతణ్ణి. ఎవరినైనా లెక్కచేయకపోవడం, తనకి తిరుగులేదనే ఆధిక్యతా భావం అతనిలో అణువణువునా కనిపిస్తుంటుంది.

దేవుడు వేసిన ఎత్తుకి చిత్తయినట్లున్నాడు. కుంగిపోయినట్లుగా కనబడుతున్నాడు.

అయినా అహం తగ్గినట్లు లేదు. అక్షయ్‌ని చూసి ముభావంగా తల ఊపాడు. తర్వాత అతను అక్షయ్‌ని నిలువెల్లా స్కాన్ చేసినట్లుగా చూశాడు.

వీలయితే, అతనికి సర్జరీ చేయటం వచ్చి ఉంటే అక్కడే తనమీద పడి, గుండె కొట్టేసి మనవరాలికి పెట్టేసుండే వాడనిపించింది అక్షయ్‌కి.

సోనీ పక్కనే నిలబడి ఫౌంటెన్‌కేసి వింతగా చూస్తోంది, ఆమెని చూసుకోవడానికి నియమించుకున్న పనిపిల్ల.

"డబ్బున్న వాళ్ళకి ప్రేమలు ఉండవు. అందుకే సోనీ తల్లిదండ్రులు దగ్గర లేరనుకుంటున్నావేమో! బహుశా తల్లి క్లబ్‌లో పేకాడుతూ ఉండి ఉంటుంది, తండ్రి మందుకొడుతుంటాడనుకుంటుండి ఉంటావు. మీరెలా ఆలోచిస్తారో నాకు తెలుసు" నిశ్శబ్దంలో గంభీరంగా వినిపించింది సోనీ తాత గొంతు.

"మీ గురించిన ఆర్టికల్స్ ఎన్నో చదివాను. మీ కొడుకు, కోడలు ఫ్లయిట్ ఏక్సిడెంట్‌లో చనిపోయారని తెలుసు. మీకున్నది ఒక్క మనవరాలే అనీ తెలుసు. మీ ఇంటర్వ్యూ చూసిన ప్రతిసారీ మీ కాన్ఫిడెన్స్‌కీ, తెలివితేటలకీ, ఆత్మస్థైర్యానికీ ఇన్‌స్పైర్ అయ్యేవాడిని. ఒకళ్ళేమను కుంటున్నారో ఆలోచించి, మిమ్మల్ని మీరు కించపరుచుకునే స్థాయికి దిగజారకండి" చెప్పి వెళ్ళిపోయాడు అక్షయ్.

తనకి కేటాయించిన రూమ్‌కి వెళ్తుండగా దారిలో అతనికా రూమ్ కనబడింది. లాక్ చేసి ఉంచినట్లున్నారు. చిన్న గాజుపలక లాంటి దాంట్లో నుంచి తొంగి చూస్తున్న అయిదారేళ్ళ పిల్లలు ముగ్గురు... ప్రయోగశాలలో కుందేళ్ళలా ఉన్నారు.

ఆ రాత్రంతా నిద్రలేదు అక్షయ్‌కి.

వాళ్ళనీ, ఉజ్వల్‌నీ బయటికి ఎలా పంపాలా అన్న ఆలోచనే సరిపోతోంది అతనికి. అందరి గురించీ ఆలోచించి నైరాని వెతకటంలో నిర్లక్ష్యం కనబరుస్తున్నాడా తను? తను వీళ్ళని రక్షించినట్లే వేరే ఎవరైనా నైరాని కూడా రక్షించవచ్చేమో!

బిల్డింగ్ అంతా తిరిగాడతను.

**ఆ నలుగురు పిల్లలని బయటకు ఎలా పంపాలా? అని ఆలోచిస్తున్నాడు అక్షయ్. అందరి గురించీ ఆలోచిస్తూ, నైరాని నిర్లక్ష్యం చేస్తున్నాడా తను? చిన్న అనుమానం. ఈ పిల్లలని తను రక్షించినట్టే వేరే ఎవరైనా నైరాని రక్షించవచ్చేమో! ఏదో ఆశ. ఎడతెగని ఆలోచనలతో సతమతమవుతున్నాడు. ఇంతకీ ఆ పిల్లలెవరు? అక్షయ్ వాళ్ళను బయటకు పంపించగలిగాడా?**

స్వచ్ఛందంగా డొనేట్ చేయటానికి వచ్చినవాళ్ళను మామూలు గదుల్లోనూ, ఎత్తుకొచ్చిన వారిని లాక్‌చేసిన గదుల్లోనూ ఉంచుతున్నారని అర్థమైంది అతనికి.

అతుల్ తమ సెక్యూరిటీ గురించి గొప్పగా చెప్పాడు కానీ ఎన్నో లొసుగులు ఉన్నాయనిపించింది అక్షయ్‌కి. అక్కడ వాళ్ళు చేస్తున్న పనులకి ప్రూఫ్‌లు లభించకపోవచ్చేమోకానీ, లోపలివాళ్ళని బయటికి పంపడం తేలికే.

మర్నాడు మధ్యాహ్నమే సోనీకి ఆపరేషన్.

ముగ్గురు పిల్లల్లో ఎవరి గుండె సరిపోతే వాళ్ళ జీవితం రేపటితో ఆఖరు. నైట్ షిఫ్ట్ డాక్టర్ కారు పార్క్ చేసుంది పార్కింగ్ లాట్‌లో. అప్పుడే కార్ దిగి లోపలికొస్తున్నాడు డాక్టర్. ఆ రోజతనికి మూడు కార్నియా రీప్లేస్‌మెంట్ సర్జరీలున్నాయట.

అతను సర్జికల్ వార్డ్‌లోకి వెళ్ళేవరకూ వెయిట్ చేశాడు. డాక్టర్ ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్ళగానే అతని రూమ్‌లోకి వెళ్ళి కార్ కీస్ తీసుకున్నాడు.

ఉజ్వల్‌కి నచ్చచెప్పడం మొదలెట్టాడు. అతని తల్లి ఆపరేషన్‌కి అయ్యే ఖర్చు తను పెట్టుకుంటా నని చెప్పినా ఒప్పుకోలేదతను. "నువ్వు తనకోసం కిడ్నీ ఇచ్చి బ్రతికించావని తెలిసిన మరుక్షణం మీ అమ్మ గుండె ఆగిపోతుంది" భయపెట్టాడు అక్షయ్.

"ఇప్పుడు వెళ్తానన్నా ఊరుకోరు. వీళ్ళు వెళ్ళని వ్వరు" నిరాశగా అన్నాడు ఉజ్వల్.

ఉజ్వల్‌ని తీసుకుని హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్ కోసం పిల్లల్ని ఉంచిన గదికి వెళ్ళాడు అక్షయ్. కోడ్ ఆపరే టెడ్ లాక్ అది. రకరకాల కాంబినేషన్స్ ప్రయత్నిం చాడు అక్షయ్. చివరికి అన్‌లాక్ అయింది.

అక్షయ్‌కి నవ్వొచ్చింది. మొదట ఇచ్చిన పాస్ కోడ్ మార్చినట్లు లేరు. పైన రూమ్‌లో కూర్చుని తమదొక గొప్ప సెక్యూరిటీ అని ఫీల్ అయిపోతాడు అతుల్‌షా. ఏదో అతని అదృష్టం బాగుండి ఇన్నాళ్ళూ దొరికినట్టు లేడు.

డోర్ ఓపెన్ చేసుకుని లోపలికెళ్ళారు.

పిల్లలు ముగ్గురూ అమాయకంగా నిద్రపోతున్నారు. తట్టి లేపగానే లేచి అక్షయ్‌నీ, ఉజ్వల్‌నీ భయం భయంగా చూస్తున్నారు వాళ్ళు. బయటికి వెళ్దామని సైగచేయగానే ఏడుపు లంకించుకున్నదొక పాప. వాళ్ళను బయటికి పంపే ఏర్పాట్లు చేస్తున్నానని నమ్మించేసరికి అతనికి తల ప్రాణం తోకకొచ్చింది.

నలుగురినీ కార్ డిక్కీలో కూర్చోబెట్టాడు. డాక్టర్ ఆ బిల్డింగ్ దాటి ఇంటికి వెళ్ళే దారిలో శ్రీకాంత్ పోలీ సులతో అక్కడికి చేరుకుని కారు ఆపుతాడు. సోదా నిర్వహించే టైమ్‌లో మీడియా అక్కడికి చేరుకునే ఏర్పాట్లు జరిగిపోయాయి.

మళ్ళీ కీస్ యథాస్థితిలో ఉంచి వచ్చాడు. తను కూడా వెళ్ళిపోవచ్చు. కానీ ఇంతమంది కార్ డిక్కీలో పట్టరు. తనే డ్రైవ్‌చేసినా బయట బయోమెట్రిక్ సిస్టమ్ ఉండటం వల్ల తనకి గేట్ ఓపెన్ అవదు. వేలిముద్రని వెరిఫై చేసి కానీ గేట్లు ఓపెన్ అవవు.

తన రూమ్ వైపు నడుస్తూ సోనీని ఉంచిన రూమ్‌కేసి యథాలాపంగా చూశాడు. ఆమె బెడ్ మీద మెలికలు తిరుగుతోంది. అటాక్ వచ్చినట్లుంది. పక్కనే కుర్చీలో ఆమె తాత నిద్రపోతున్నాడు. నేల మీద పనిపిల్ల కునుకు తీస్తోంది.

అక్షయ్‌కి ఏం చేయాలో అర్థం కాలేదు.

***

సీమ క్యాబ్ చుట్టూ అంతమంది ఎందుకు గుమికూడారో అర్థం కావటం లేదు కావ్యకి.

"ఏదయినా డెమో ఇస్తుందా?" ఆరాగా అడి గింది రోహిణిని.

"అక్కడున్న జనాలని చూశావా? ఒక్కడన్నా డెమోలకీ, ప్రెజెంటేషన్లకీ వెళ్ళే మొహంలేనా?" అంది వెటకారంగా రోహిణి.

కుతూహలంగా వాళ్ళు గమనిస్తుండగా లేచి నిలబడింది సీమ.

తెలుపురంగు షిఫాన్ చీర మీద ఫ్లోరల్ డిజైన్ పెయింట్ చేసినట్లుంది. డార్క్‌పింక్ స్లీవ్‌లెస్ బ్లౌజ్. సిల్వర్ కలర్‌లో మెరుస్తున్న హైహీల్స్. జుట్టు పైకి దువ్వి పోనీటెయిల్ కట్టినట్లుంది. మరింత స్లిమ్‌గా బార్బీడాల్‌లా కనబడుతోంది.

"వార్నీ! చీర కట్టేసరికి ఈ వెధవలంతా క్యాబ్ చుట్టూ చక్కర్లు కొడుతున్నట్లున్నారు" అంది రోహిణి.

"హాయ్!" కావ్య, రోహిణిలను చూసి చెయ్యూపి, పలకరింపుగా నవ్వింది సీమ.

## మనమీదేనర్రోయ్!

సరసి





"భలే ఉంది కదా!" అంది రోహిణి.

మూతి తిప్పింది కావ్య.

"ఆ మాట అనిపించుకోవాలనే మననిప్పుడు పలకరించింది" ఉక్రోషంగా అంది.

వాళ్ళని దాటుకుంటూ రాజేష్ క్యాబ్ దగ్గరికి వెళ్ళింది.

"రాజేష్, డిన్నర్‌కి వెళ్దామా?" అడిగింది.

కంప్యూటర్ వైపు తిరిగి పని చేసుకుంటున్నాడ తను అప్పుడు.

సీమ గొంతు వినపడితే చాలు నెత్తిమీద పిడుగు పడినట్లుగా ఫీలవుతున్నాడు.

అంతకుముందు రెండుసార్లు ఆమెతో డిన్నర్‌కి వెళ్ళినప్పటి సంఘటనలు అతని కళ్ళ ముందు రీల్‌లా పరిగెడుతున్నాయి.

"సారీ సీమా! పని.." అంటూ వెనక్కి తిరిగాడు.

నోట్లో నుంచి మాట రావటం లేదు.

గుడ్లప్పగించి చూస్తున్నాడు.

"సరే!" కదిలింది సీమ.

"పని ఉంది అంటాననుకున్నావా? తప్పకుండా వెళ్దాము" అన్నాడు రాజేష్.

కిలకిలా నవ్వింది సీమ.

"ధూ, రాజేష్ గాడికి సిగ్గులేదు" నవ్వుకున్నారు కావ్య, రోహిణి.

***

రాజేష్ మళ్ళీ తన మీటింగ్స్ పోస్ట్‌పోన్ చేశాడు. అతనిలో ఉన్న బలహీనత అతన్ని వేరే విషయాలు ఆలోచించనీయడం లేదు. సరిగ్గా ఆలోచిస్తే ప్రతిసారీ తన యూఎస్ మీటింగ్స్ పోస్ట్‌పోన్ చేయిస్తోందనీ, తన జాబ్‌కి ఎసరు పెడుతుందనీ అర్థమయ్యేదతనికి.

కానీ అతనేదీ ఆలోచించే స్థితిలో లేడు ప్రస్తుతం.

ట్రాన్స్‌లో ఉన్నట్లున్నాడు.

సాయంత్రం ఎనిమిదింటికి ఫైర్ వాటర్ రెస్టారెంట్‌లో ఉన్నారిద్దరూ.

నలుపు రంగులో గోడలు, రూఫ్, టేబుల్స్ ఉంటే మిగతా ఫర్నీచర్, ఇంటీరియర్స్ తెలుపు ఎరుపుల మిశ్రమంలా ఉంది.

"ఫైర్ అండ్ వాటర్ థీమేమో ఈ కలర్స్" అంది సీమ.

ఎదురెదురుగా కూర్చున్నారు.

"మైండ్ ఇఫ్ ఐ డ్రింక్?" అడిగాడు.

"లేదు. నేను కూడా ఆర్డర్ చేస్తాను" అంది సీమ.

రాజేష్ విస్కీ, సీమ మార్టినీ ఆర్డర్ చేశారు.

మెల్లిగా స్నాక్స్ తింటూ మాట్లాడుకుంటున్నారు.

"మొన్న నేను కావ్యని ఏమీ అనలేదు. అనవసరంగా హడావుడి చేశారు మీరంతా?" బుంగమూతి పెట్టి అన్నాడు రాజేష్ మాటల్లో.

సీమ నవ్వింది.

తనసలు ఎంత మంచివాడో, తన చదువు, ఉద్యోగంలో తన తెలివితేటలు గురించి చెప్పుకొస్తున్నాడతను.

సీమ తాగుతోందో లేదో అతనికి అర్థం కావటం లేదు.

అతను చూస్తున్నప్పుడు ఒక్క సిప్ కూడా చేయట్లేదు. పక్కకి తిరిగి మళ్ళీ ఇటు తిరిగేసరికి గ్లాస్ ఖాళీగా ఉంటోంది.

అతనికి మత్తు నషాళానికి అంటుతోంది.

సీమ కూడా బాగా మత్తు ఎక్కినట్లు కనబడుతోంది.

ఏదో తన చిన్నప్పటి సంగతి చెప్పాడు రాజేష్.

పెద్దపెద్దగా నవ్వటం మొదలెట్టింది సీమ.

అందులో అంతగా నవ్వేదేముందో అతనికి అర్థం కాలేదు. అదే అడిగాడు.

"నాటీ!" పెద్దగా నవ్వి, కాలితో తన్నింది. ఆమె హైహీల్ చివరిభాగం మోకాలికి గట్టిగా తగిలింది. జెర్క్ ఇచ్చినట్లుగా ఉంది కాలు. భరించలేని నొప్పి. విలవిల లాడిపోయాడు. ఒక నిమిషం మత్తంతా దిగిపోయిందతనికి.

"సారీ!" అమాయకంగా ఉందామె మొహం.

ఏది మాట్లాడినా పెద్దగా నవ్వి లాగిపెట్టి తంతోంది. ఎక్కడ తన్నేదీ చూసుకోవట్లేదు. చుట్టుపక్కల టేబుల్స్ వాళ్ళు వీళ్ళను చూసి నవ్వాపుకుంటున్నారు. బాగా తాగినట్లుంది అనుకుంటున్నారు వాళ్ళు.

"చీర కట్టుకుని ఎగిరెగిరి తంతుంటే చూడటానికి అసహ్యంగా ఉంటుంది. అలా చేయకు ఇక" ఆపుకోలేక చెప్పాడు.

"నన్ను... నన్ను అసహ్యంగా ఉన్నావంటావా? నీ మొహం ఎప్పుడైనా అద్దంలో చూసుకున్నావా?" కోపంతో ఊగిపోతూ లేచిందామె.

"ఇంకెప్పుడూ నీ వేస్ట్ మొహం నాకు చూపించకు" చెంప చెళ్ళుమనిపించింది. బయటికి నడిచింది.

నిర్ఘాంతపోయి చూస్తున్నాడు రాజేష్.

***(ఇంకా వుంది)***

---

## ఉగాది ప్రత్యేకం

**కవిత**

## వెతుకులాట

లెక్కకందని కాంతివత్సరాల ప్రయాణం
నన్ను నేను చేరుకోడానికి
తారల్ని మించిన మస్తిష్కపు తీగలు
ఏ తీగ గమ్యానికి చేరుస్తుందో
తేల్చుకోలేని అయోమయం

అగాధ లోకంలో ఎగరేసే జెండాల మీద
నీరెండల్లో పరుగులు తీస్తున్నప్పుడు
కలల అలలేవో తలపుల్ని నిద్రలేపి
జాగృతమ్మెట్లు దిగి వస్తుంటాను.

డేగరెక్కల్లో కుక్కల నీడను పొందుతూ
గువ్వల చిరుప్రయత్నాల్లో ఎదిగే
ఎగురుదలల యుద్ధారావానికి
సంధ్యారంగుల పావడాను
నెమ్మదిగా కాలచీకటి దాస్తుంది.

సముద్ర కెరటాల మీంచి
సూర్య కిరణాలు ఒడ్డును చేరి
ఇసుకలో కూరుకుపోతున్నాయి

బతుకు సందులలో
బరువుగా చెరువైన రాత్రుల మధ్య
వింత వేదనల మౌనం ఆక్రమిస్తుంది

ప్రాచీ దేహాల అంతరాత్మల
శీతల స్పర్శా ఉలికిపాట్లలో
శిథిల బావి ఊట వెగటు కురిపిస్తుంది.
గడచినవన్నీ పాతబడిపోయి
వర్తమానం వన్నెల్ని
భవిష్యత్తు గీటురాయై వెలికి తీస్తుంది.

మెరుపులు కరిగిపోతున్నప్పుడు
మబ్బులు గడ్డ కడుతుంటాయి.
వెలుగుల పంజాలో చిక్కేందుకు
గాలానికి తగలని చేపలై
ప్రవాహానికి ఎదురీదని వాళ్ళు

శ్వేత శ్మశాన గగనమ్మీద
సూర్యచంద్రుల పోలిక దొరకదు
అయినా ఆగినకాలం మళ్ళీ కదలదు.

నన్ను నేను వెతుక్కునే క్షణాల్లో
మత్స్యం నుండి మహామనిషి వరకూ
పరమాణువు కేంద్రకమై నిలుస్తుంది.

ఎనభై లక్షల Face Code లో
మళ్ళీ నన్ను చేరుకునేందుకు ఎడతెగని ఆరాటం.

ఒక జీవిత పూర్తి పాఠానికి
Synopsis (సినాప్సిస్) సిద్ధం చేసుకునేందుకు
కోట్ల చీకటి వత్సరాల ప్రయాణం
ఎక్కడి నుండి
చేరుకుంటున్నామో తెలియని
అనిర్దేశిత గమ్యం ఊరిస్తుంటుంది
మళ్ళీ తెల్లారిపోతుంది
లోపల నలనల్లగా...

**–ర్యాలిప్రసాద్, సెల్: 94945 53425**



## రోజులు సరిపోవడం లేదట!

బాలీవుడ్‌లో బిగ్‌బీ అమితాబ్‌బచ్చన్ ఇప్పటికీ, ఎప్పటికీ ఎవర్‌గ్రీన్ సూపర్ స్టారే! ఈ వయస్సులో కూడా ఆయనతో సినిమాలు చేయడానికి దర్శకనిర్మాతలు క్యూ కడుతూనే ఉన్నారు. ఇటీవలి కాలంలో దాదాపు పదిహేను కథలు విన్నారట అమితాబ్ బచ్చన్. అవన్నీ బాగా నచ్చేశాయట! ఈ సంవత్సరం అన్ని సినిమాల్లో నటించాలని తనకు ఉన్నా, రోజులు సరిపోవట! మొట్టమొదటిసారిగా సంవత్సరానికి 365 రోజులకు బదులు, 465 రోజులు ఉంటే బాగుండునని అనిపించిందట! ఈ విషయాన్ని అమితాబ్ స్వయంగా ఓ ఇంటర్వ్యూలో చెప్పుకొచ్చారు.




## ఎంత దమ్మున్నా అంత వసూలు చేస్తుందా?




'బాహుబలి 2' మీద అంచనాలు రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి. మొదటి భాగం కన్నా కూడా రెండవ భాగం మరింత ఎక్కువ వసూలు చేస్తుందంటున్నారు! అయితే ఎంత వసూలు చేస్తుంది అన్న విషయంలో ఎవరి లెక్కలు వారికున్నాయి. సినిమా యూనిట్ మాత్రం ఈ సినిమా రెండువేల కోట్లు వసూలు చేస్తుందన్న నమ్మకంతో ఉన్నారు. సినిమాలో ఎంత దమ్మున్నా, ఇంత మొత్తం వసూలు చేయడం అంటే మాటలు కాదని అంటున్నారు సినీజనాలు.

## సైకియాట్రిస్ట్ దగ్గరకి వెళ్ళిన పూరి!

ఇటీవలి కాలంలో విజయం అనేది పూరీ జగన్నాథ్‌కి మొహం చాటేసింది. వరుస ఫ్లాపులతో పూరి ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు! ఈ సమయంలో ఇద్దరు సీనియర్ హీరోలతో చేసే అవకాశం పూరికి వచ్చింది. సక్సెస్ అనేది ఆ హీరోలకన్నా పూరీకే ఎక్కువ కావాలి. దాంతో తీవ్రమైన మానసిక ఒత్తిడికి గురవుతున్నాడట! దీని నుంచి తప్పించుకోవడానికి పూరి ఓ సైకియాట్రిస్ట్‌ని ఆశ్రయించాడని అంటున్నారు. సినీరంగంలో చాలా మంది పలు సందర్భాలలో సైకియాట్రిస్ట్‌లను కలుస్తుంటారు.





## రవితేజ సినిమాలు చేయడా?

రవితేజ సినిమాలు మానేస్తాడని కాదు. వెండితెర మీద కాకుండా తెర వెనుక నుంచి పని చేస్తాడట! ప్రస్తుతం రవితేజ రెండు సినిమాలు చేస్తున్నాడు. వీటి తర్వాత యాక్టింగ్‌కి గుడ్‌బై చెప్పి దర్శకత్వ శాఖలో పనిచేయాలని అనుకుంటున్నాడట! ఇప్పటివరకూ తెర మీద వేసిన వేషాలు తెర వెనుక నుంచి చూపించాలన్నది రవితేజ ఆలోచనంటున్నారు అతని సన్నిహితులు. కాకపోతే ఈ విషయంలో రవితేజ నుంచి ఎలాంటి క్లారిటీ రాకపోవడంతో రవితేజ దర్శకత్వ శాఖవైపు పోకపోవచ్చని చెబుతున్నారు.

## రియల్ బ్రేకప్ కాదట!

రణవీర్, దీపికా పదుకొనె విడిపోయారన్న వార్త ఆ మధ్య బాగానే హల్‌చల్ చేసింది. ఇద్దరి ప్రవర్తన చూసి చాలా మంది అలాగే అనుకున్నారు కూడా! కానీ అదంతా నిజం కాదట! 'పద్మావతి' సినిమా కోసమే ఇద్దరూ అలా ప్రవర్తిస్తున్నారట! క్యారెక్టర్ పరంగా దీపికా ఆ సినిమాలో రణవీర్‌ను తిరస్కరించే పాత్ర చేస్తోంది. ఈ సినిమా మీద జనాల్లో అంచనాలు పెంచడానికే ఇద్దరూ విడివిడిగా ఉంటున్న బిల్డప్ ఇస్తున్నారట! ఈ విషయం తెలీని కొందరు మాత్రం ఇద్దరూ నిజంగానే విడిపోయారన్న భ్రమలో ఉన్నారట!





ఇంటర్వ్యూ

# అప్పటిలా ఇప్పుడు నటిస్తే అది ఓవర్ యాక్షనే!

**-భానుప్రియ**

**తన నటనతో ప్రేక్షకుల హృదయాలపై చెరగని ముద్రవేసిన నటి భానుప్రియ. మూడు న్నర దశాబ్దాలుగా 150 కి పైగా తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, హిందీ చిత్రాల్లో చేసిన నంది అవార్డుల నటి.**

**పాత కొత్త చిత్రాలను పోల్చి చెప్పలేమనీ, అప్పటిలా ఇప్పుడు నటిస్తే ఓవర్ యాక్షన్ అంటారనీ చెబుతున్న భానుప్రియ ఇంటర్వ్యూ...**

మా నాన్నగారు పట్టాభి రామన్న. అమ్మ లక్ష్మీ కాంతం. నేను పుట్టింది రాజమండ్రి. నా చదువు, పెరిగిపెద్దైనదీ అంతా చెన్నైలోనే. నా చెల్లెలు శాంతి ప్రియ. సినీ నటి. అన్నయ్య గోపాలకృష్ణ.

అమ్మా నాన్న నాకు మొదట పెట్టినపేరు ఆనంద భాను. ఆ తర్వాత వాళ్ళే నా పేరును భాను ప్రియగా మార్చారు.

చెన్నైలోని సరస్వతి విద్యాలయంలో ప్రాథమిక విద్య, హయ్యర్ సెకండరీ పాఠశాలలో మెట్రిక్యు లేషన్ వరకు చదువుకున్నాను. ఆ తర్వాత కూడా టెన్త్ వరకు ఇదే పాఠశాలలో చదువుకున్నాను. పాఠ శాల వార్షికోత్సవం సందర్భంగా నాటకాల్లో పాల్గొనే దాన్ని. ఎన్నో మెడల్స్ వచ్చాయి. చిన్నప్పటినుంచీ భరతనాట్యం నేర్చుకున్నాను. ప్రదర్శనలు ఇచ్చేదాన్ని.

### భారతీరాజా చిత్రం

ప్రముఖ తమిళ చిత్ర నిర్మాత, దర్శకుడు భారతీ రాజా, ఒకసారి చెన్నై వాణిమహల్‌లో నా నాట్య ప్రదర్శన చూశారు. మా చిత్రంలో నటిస్తావా? అని అడిగారు. అప్పుడు అక్కడేవున్న అమ్మా నాన్న సంతోషంగా ఒప్పుకున్నారు. ఆ విధంగా 'మెల్ల పేసుంగళ్' అనే చిత్రంలో మొదట నటించాను. వసంత్ హీరో. భారతీరాజా నిర్మాత. భారతీవాసు దర్శకత్వం. 1983లో విడుదలై విజయవంతం కావ డంతో తెలుగు దర్శకుల నుండి కూడా ఆఫర్లు వచ్చాయి.

### సితార చిత్రంతో దశ తిరిగింది

తమిళంలో నా మొదటిచిత్రాన్ని ఏడిద నాగేశ్వర రావుగారు చూసి 'సితార' చిత్రానికి నన్ను ఎంపిక చేసుకున్నారు. ఈ చిత్రం సూపర్ హిట్ కావడంతో నా దశ తిరిగింది. ఇళయరాజా సంగీతం సమ కూర్చిన 'కిన్నెరసాని వచ్చిందమ్మా వెన్నెల పైటేసి/ విశ్వనాథ పలుకై అది విరుల తేనె చినుకై.....అనే పాట ఆ రోజుల్లో అందరి నాలుకలపైనా నాట్య మాడేది. వంశీ ఎంపిక చేసుకున్న చక్కని కథ, హిట్ సాంగ్స్ అన్నీ కలగలిసిన హిట్‌చిత్రం. సుమన్, శరత్ బాబు, శుభలేఖ సుధాకర్ తదితరులు నటించారు. 1983లో ఈ చిత్రం విడుదలయ్యాక నాకు తెలు గులో వరుసగా ఆఫర్లు వచ్చాయి.

అలా 1983-1990 మధ్య 'రామాయణంలో భాగవతం', 'ఇల్లాలే దేవత', 'మొగుడూపెళ్ళాలు', 'ప్రతిభావంతుడు'... ఇలా అనేక చిత్రాల్లో చేశాను. వంశీగారి 'ఆలాపన', 'అనాదిగా ఆడది' వంటి ఎన్నో చిత్రాల్లో చేశాను. 'అనాదిగా ఆడది' ఇద్దరు స్నేహితుల మధ్య నడిచే రసవత్త రమైన విప్లవాత్మక చిత్రం.

### నటుల్ని తీర్చిదిద్దే శిల్పి విశ్వనాథ్

విశ్వనాథ్‌గారి దర్శకత్వంలో వచ్చిన 'స్వర్ణ కమలం'లో నా నాట్యాన్ని మెచ్చుకుని ఎంతో మంది అభిమానులు ఉత్తరాలు రాశారు. ఈ చిత్రంలో నా నటనకు పూర్తి న్యాయం జరి గిందంటే అదంతా విశ్వనాథ్‌గారి ఘనతే. ఆయన నటుల్ని తీర్చిదిద్దే ఒక శిల్పి మాత్రమే కాదు, ఆ శిల్పానికి ఊపిరిలూది ప్రతిసృష్టి చేసే అపర బ్రహ్మ లాంటివారు. ఆయన చెప్పిందాంట్లో మేం కొంతే చేసినాగానీ పాత్రకు పరిపూర్ణత చేకూరుతుంది. అలా మమ్మల్ని పాత్రలో నిమగ్నం చేయడమే విశ్వనాథ్‌గారి ప్రత్యేకత. నా అదృష్టం ఏమిటంటే వంశీగారి దగ్గర, విశ్వనాథ్ గారి దగ్గర పని చేయడం అంటే రెండు ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌లలో శిక్షణ పూర్తిచేసుకుని అంతర్జాతీయ పురస్కారం అందుకున్నట్టే. వారిద్దరూ ఏ బెంగాలీవారో అయి ఉంటే భారతీయ చలనచిత్ర రత్నాలుగా భాసిల్లే వారని ఖచ్చితంగా చెప్పగలను. ఆలాపన, స్వర్ణ కమలం, సితార, పెదరాయుడు, అనాదిగా ఆడది చిత్రాలు రానున్న తరాల నటులకు పాఠ్యాంశాలుగా ఉపయోగిస్తాయి. అభినయ సూత్రాలు నేర్పే అమూల్యమైన సిలబస్ చిత్రాలివి.

### మెగాస్టార్‌తో

మెగాస్టార్ చిరంజీవిగారితో నేను చేసిన చిత్రా లన్నీ కమర్షియల్ హిట్లే. జ్వాల, విజేత, దొంగ మొగుడు, జేబుదొంగ, ఖైదీనెంబర్ 786, త్రినే త్రుడు, స్టేట్‌రౌడీ.. ఇలా అన్నీ వంద రోజులకు పైగా ఆడినవే. మెగాస్టార్‌కు తగ్గట్టుగా నటించానని చాలామంది నన్ను అభినందించేవారు. 1984లో వచ్చిన అక్కినేని నాగేశ్వరరావుగారి కుటుంబ కథా చిత్రం 'ఇల్లాలే దేవత'. రాధిక, నేను ముఖ్యపాత్రలు. ఆయన చిత్రాల్లో ఎక్కువ నటించలేకపోవడం నాకు బాధ కలిగిస్తుంది. మహానటి సావిత్రి గారి ఆశీర్వాదాలు పొందానుగానీ ఆవిడతో నటించలేక పోయాను. ఆ బాధ నాలో మిగిలిపోయింది.

### ఎన్.టి.ఆర్ కోరినట్టు చెయ్యలేకపోయా

'బ్రహ్మర్షి విశ్వామిత్ర'లో నటించమని ఎన్.టి.

రామారావుగారు నాకు ఫోన్ చేశారు. ప్రత్యేకంగా రామారావుగారే నృత్యం చేసే సన్నివేశం ఉంది. మేనక పాత్రకు నువ్వే సరైన న్యాయం చేయగలవు, నటిస్తావా? అని అడిగారు. అప్పటికే ఆక్యుపైడ్ కాల్షీట్లున్నాయి.

భారతీరాజాగారి 'యార్కాడ్' చిత్రం షూటింగ్ చేస్తున్న విషయం ఎన్టీఆర్గారితో ఎంతో బాధగా చెప్పాను. దానికి ఆయన ఎంతో గౌరవంగా, 'పర్వాలేదమ్మా, ఇచ్చిన కాల్షీట్లు పూర్తిచేయాలను కున్న నీ దృఢనిశ్చయం గొప్పది' అని సున్నితంగా అనడం నాకెంతో సంతోషాన్నిచ్చింది. ఎన్టీఆర్ కోరి నట్టు మేనక పాత్ర చేయలేకపోయానే అని ఇప్ప టికీ బాధపడుతూ ఉంటాను.

## పెదరాయుడు

పెదరాయుడు చిత్రం నాకు మంచి పేరు తెచ్చింది. పెద్దరికం పాత్రలో, తమ్ముడి పాత్రలో కూడా మోహన్బాబుగారు అద్భుతంగా చేశారు. రజనీకాంత్ ఈ చిత్రంలో ఎంతో పోటీపడి చేశారు. మోహన్బాబుగారి భార్యగా పెద్దరికం పాత్రలో ఎంతో బాగా నటించానని నా అభిమానులు చెప్పడం నాకెంతో తృప్తి కలిగించింది. సౌందర్యకూడా ఎంతో బాగా నటించింది. వందరోజులకు పైగా ఆడినచిత్ర మిది.

పీపుల్స్ ఎన్కౌంటర్, అమ్మా దుర్గమ్మ, అన్న మయ్య, లాహిరి లాహిరి లాహిరిలో, కిరాయి గూండా, ఛత్రపతి చిత్రాలు నా సినీ కెరీర్లో ఎంతో ముఖ్యమైనవి. దాదాపు పదికిపైగా చిత్రాల్లో దేవత పాత్రల్లో నటించడం నా అదృష్టం. ఇలా ఇప్పటి వరకు 150 కిపైగా చిత్రాల్లో నటించాను.

## ఛత్రపతి

తల్లి పాత్రకు ఎంతో ప్రాధాన్యమిచ్చిన చిత్రం 'ఛత్రపతి'. ఇందులో నటించేందుకు రాజమౌళిగారు నన్ను ఒప్పించారు. కథ కూడా నాకు బాగా నచ్చింది. ప్రభాస్, శ్రేయాశరణ్, ప్రదీప్రావత్ తదితరులు నటించారు. రాజమౌళి దర్శకత్వంలో 2005లో విడుద లైంది. తమిళం, మలయాళం, హిందీల్లో కూడా డబ్ చేశారు.

నేను మరిచిపోలేని మరొక చిత్రం శోభన్బాబు గారి 'కార్తీకపౌర్ణమి'. మరో ఉత్తమ కథా చిత్రం 'పవిత్ర'. అదొక అద్భుతచిత్రం. రాజేంద్రప్రసాద్, చంద్రమోహన్ నటించారు. 'ఇనుగ్భుం ఒరుగంగై' తమిళచిత్రం ఆధారంగా తీశారు. కాగా తమిళంలో కమల్హాసన్తో మహారాసన్ చిత్రంలో చేశాను.

## కీకారణ్యంలో 'అన్వేషణ'

తలకోన కీకారణ్యంలో నిర్మించిన చిత్రం 'అన్వేషణ'. ఒక పులి మా షూటింగ్ ప్రదేశానికి వచ్చి మమ్మల్ని బెదిరించడమే కాదు, అదికూడా బెదిరిపోయింది. ఉదయం నాలుగు గంటల నుండి సాయంత్రం ఆరు గంటల వరకు షూటింగ్ జరి గేది. కరంటు, నీళ్ళు ఉండేవి కావు. కొండచిలువలు, పాములతో భయం వేసేది. దర్శకుడికి చెప్పి పారి పోదామన్నంత కోపం కూడా వచ్చింది. కానీ ఇలాం టివి షూటింగ్లో సర్వసామాన్యం అని నాకు నేనే సర్దిచెప్పుకున్నాను. అదొక గమ్మత్తైన అనుభవం. తెల్లారు జాముక కొవ్వొత్తులు పెట్టుకునేవాళ్ళం. ఎండా కాలంలో షూటింగ్. పగలు నిప్పులు చెరిగే ఎండలు, రాత్రి కారు చీకటి. మా యూనిట్లో పది మందికీ అదొక వింత అనుభవం. ఈ చిత్రంలో కార్తీక్ హీరో. కైకాల సత్యనారాయణ, శరత్బాబు, రాళ్ళపల్లి తదితరులు నటించారు. వంశీ దర్శకత్వంలో 1985లో వచ్చింది. తమిళ్లోకి కూడా డబ్ చేశారు.

## ఇప్పుడన్నీ ఎంటర్టైన్మెంట్ చిత్రాలే

జనరేషన్కు అనుగుణంగా చిత్రపరిశ్రమ మారుతూ వచ్చింది. ప్రస్తుత పరిస్థితుల్లో ఎంటర్టైన్మెంట్ ఎలా ఇవ్వాలో, ఎలా ఇస్తే బాగుంటుందో ఆలో చించి అలానే చిత్రాలు నిర్మిస్తున్నారు. అప్పటి చిత్రాలు బాగున్నాయి, ఇప్పటి చిత్రాలు బాగాలేవు అని చెప్పలేం. టెక్నాలజీ అప్గ్రేడ్ అవుతోంది. భవి ష్యత్తులో ఇంకా ఎన్నో మార్పులు రావొచ్చు. ఎప్పటి కప్పుడు కొత్తే. పాత, కొత్త చిత్రాలను కంపేర్ చేయలేం. కాకపోతే గతంలో ఒక క్వాలిటీ ఉండే చిత్రాల్ని చూశాం. ఇప్పుడు కూడా జనరేషన్కు తగ్గట్టు అలాంటి మంచి చిత్రాలొస్తున్నాయి. జన రేషన్కు తగ్గట్టే తీస్తున్నారు. ఆనాడూ, ఈనాడూ జనరేషన్కు తగ్గట్టే నటులు నటిస్తున్నారు. అప్పటి లాగా ఇప్పుడు నటిస్తే ప్రేక్షకులు 'ఓవర్ డ్రామా', 'ఓవర్ యాక్షన్' అంటారు. డాన్సులు కూడా మారి పోయాయి. ఇప్పుడూ మంచి నాట్యమున్న చిత్రా లొస్తున్నాయి. దర్శకుల టేస్టును బట్టే చిత్రాలు నిర్మి స్తున్నారు.

హీరోలందరూ నా అభిమానులే. సావిత్రి, వాణిశ్రీ, శ్రీదేవి, జయసుధ, వహీదారెహ్మాన్, హేమ మాలిని అప్పటి నా అభిమాన నటీమణులు.

## హిందీ చిత్రాలు

హిందీలో దాదాపు ఇరవై చిత్రాలు చేశాను. వాటిల్లో రజనీకాంత్ 'తమాచా', జితేంద్ర 'కసమ్ వర్దీకి', గోవిందా, జుహీచావ్లా నటించిన 'భాభీ', ధర్మేంద్ర, జితేంద్ర నటించిన 'ఇన్సాఫ్ కి పుకార్', జితేంద్ర, శత్రుఘ్నసిన్హా నటించిన 'బాడీగార్డ్'.. ఇలా ఎన్నో హిట్ చిత్రాల్లో నటించాను. దాదాపు నేను నటించినవన్నీ విజయవంతమైనవే. హిందీలో నా మొదటిచిత్రం 'దోస్తీ-దుష్మన్', రజనీకాంత్, జితేంద్ర, రిషికపూర్, పూనమ్ధిల్లాన్, అస్రాని, ఖాదర్ఖాన్ నటించారు. తాతినేని రామారావుగారి దర్శకత్వంలో 1986లో వచ్చింది.

మలయాళంలో నా మొదటిచిత్రం 'రాజశిల్పి'. ఇందులో మోహన్లాల్ హీరో. సుకుమార్ దర్శ కత్వం. బంపర్హిట్ చిత్రమిది. కన్నడంలో నా మొదటిచిత్రం 'రసిక'. కాల్షీట్లు లేక కొంతమంది దర్శకులను నిరాశపరచాల్సి వచ్చింది. మరికొంత మందైతే ఒప్పుకున్న చిత్రాలు పూర్తయ్యేవరకు ఆగే వారు. ఇలా ఒకే సమయంలో తెలుగు, తమిళ, మల యాళ, హిందీ చిత్రాల్లో ఫుల్ బిజీగా ఉండేదాన్ని.

## అవార్డులు

'స్వర్ణకమలం'లో ఉత్తమ నటిగా, 'ఛత్రపతి'లో ఉత్తమ సహాయ నటిగా ఉమ్మడి రాష్ట్రప్రభుత్వం నుండి నంది అవార్డులు అందుకున్నాను. 'స్వర్ణ కమలం' చిత్రానికి ఉత్తమ నటిగా ఫిలిమ్ఫేర్ అవార్డు లభించింది. 'పెదరాయుడు'లో నటనకు సినిమా ఎక్స్ప్రెస్ అవార్డు, 'ఆరారో ఆరిరారో', 'అళగన్', 'సుందరకాండమ్' తమిళ చిత్రాలకు తమిళ నాడు ప్రభుత్వం నుండి ఉత్తమ నటిగా మూడు అవార్డులు అందుకున్నాను. ఆరారో ఆరిరారో చిత్రా నికి ఫిలిమ్ఫేర్ అవార్డు లభించింది.



మావారి పేరు ఆదర్శ కౌశల్. మాకు ఒక పాప. పేరు అభినయ.

మా చెల్లెలు శాంతిప్రియ. తమిళ, తెలుగు, హిందీల్లో దాదాపు ముప్ఫై చిత్రాలకుపైగా నటిం చింది. తర్వాత పెళ్ళి చేసుకుని ముంబైలో సెటి లైంది. ఆమె భర్త సుశాంత్ రే. ఇద్దరు పిల్లలు. పెద్ద బ్బాయి శుభమ్, చిన్నబ్బాయి శిష్య.

**—కె. హరనాథ్,**

**సెల్:97035 42598**



ఉగాది ప్రత్యేకం

# నిరంతర అధ్యయనమే నా విజయ రహస్యం

## -ఎస్వీసత్యనారాయణ

**తెలంగాణ సాహితీ అగ్నికణం ఎస్వీసత్యనారాయణ. మేధావులను సైతం అబ్బుర పరిచే కవిత్వం రాసి బాలకవిగా వెలుగులోకొచ్చారాయన. కవిత్వాన్ని ఉద్యమంగా నడిపిన సాహితీ తపస్వి. అభ్యుదయవాది, వాగ్ధాటిగల ఉద్యమనేత, నిరంతర అధ్యయన వేత్త. వీధిలైటు కింద చదువుకుని పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి పదవి స్థాయికి చేరుకున్న విజేత. సరికొత్త కార్యక్రమాలతో విశ్వవిద్యాలయాన్ని కొత్త పుంతలు తొక్కిస్తున్న కార్యసాధకుడు. పిల్లలు ఉభయభాషా భ్రష్టుత్వం పట్టకుండా తల్లిదండ్రులు జాగ్రత్తపడాలని, తెలుగు భాషకు పెద్దపీట వేయాలని కోరుతున్న ఎస్వీసత్యనారాయణ ఇంటర్వ్యూ ఈ వారం....**

మా అమ్మ రాధాబాయి. నాన్న విఠల్‌రావు. నిజాం పాలనాకాలంలో మెదక్ జిల్లా, జాలి గ్రామం నుండి హైదరాబాద్ పాతనగరానికి వలస వచ్చారు నాన్న. 1954 ఆగస్టు 16వ తేదీన పుట్టాను. మాది పెద్ద కుటుంబం. ఐదుగురు ఆడపిల్లలు, ఏడుగురు మగపిల్లలు. నేను అయిదో సంతానం.

ఎలాంటి ఆదర్శాలు, ఆశయాలు లేకుండా గంపెడు సంతానానికి అన్నం పెట్టడమే జీవిత లక్ష్యంగా బతికాడు మా నాన్న. నీతి నిజాయితీ, స్థిర సంకల్పం, క్రమశిక్షణ ఊపిరిగా జీవించాడు. వాటినే మాకు వారసత్వంగా పంచిపెట్టాడు.

వందలాది శతక పద్యాలు అలవోకగా చెప్పే మా నాన్న, ఉపాధ్యాయుడు కాదగిన ఓ గొప్ప ప్రతిభా శాలి. ఏ అవకాశాలూ, గుర్తింపూ లేకుండా ప్రభుత్వ సారాయి దుకాణంలో కూలీగా అస్తమించాడు. అలాంటిచోట కూలీగా చేయాలంటే ఎంతో సహనం, మానసిక స్థిరత్వం, ధైర్యం కావాలి. ఆ స్థిర సంకల్పం మా బాపులో ఉండేది.

### విద్యాప్రస్థానం, ఆచార్యవృత్తి

లాల్‌దర్వాజాలోని వెంకట్రావు స్మారకోన్నత పాఠశాలలో పదవతరగతి వరకు చదివాను. నాంపల్లి ప్రభుత్వ కాలేజీలో బైపిసి, ప్రభుత్వ సిటీ కాలేజీలో బిఎస్సీ, ఉస్మానియాలో ఎం.ఎ, ఎంఫిల్, తెలుగులో పిహెచ్‌డి, ఎం.ఎ ఇంగ్లీష్ పూర్తి చేశాను. హైదరాబాద్ బి.ఆర్. అంబేద్కర్ కళాశాలలో 1981 నుండి పన్నెండేళ్ళు తెలుగు అధ్యాపకునిగా, 1991లో ఉస్మానియాలో అధ్యాపకునిగా పనిచేశాను. ఆచార్యునిగా, పాఠ్యప్రణాళికా సంఘం అధ్యక్షునిగా, తెలుగుశాఖాధ్యక్షునిగా, ఆర్ట్స్ విభాగం డీన్‌గా, ఆర్ట్స్ కళాశాల ప్రధానాచార్యునిగా, కేంద్ర సాహిత్య అకాడమీ జనరల్ కౌన్సిల్ సభ్యునిగా పరిపాలనానుభవం సంపాదించాను. తెలుగు విశ్వవిద్యాలయం అకడమిక్ సెనేట్ సభ్యుడిగా దాదాపు దశాబ్దకాలం ప్రత్యక్ష అనుబంధంవల్ల కోర్సులు, వాటి విశిష్టత, లోటు పాట్లపై సమ్యక్ అవగాహన ఏర్పడింది.

### అభ్యుదయ భావజాలం

ఆరో తరగతిలో ఉండగా ఆర్.ఎస్.ఎస్. ప్రచారకుడు ద్వారకాచారి ప్రభావంతో బాలశిక్షకుడిగా వ్యవహరించాను. ఆలే నరేంద్ర తరుణ శిక్షకుడిగా ఉండేవాడు. ప్రముఖ కథా రచయిత శ్రీపతి (పుల్లట చలపతిరావు) ఎనిమిదో తరగతిలో మా ఆంగ్లోపాధ్యాయుడు. రోజూ శ్రీశ్రీ కవితలు చదివేవాడు. నేను వాగ్వాదానికి దిగాను. నాలోని ఫైర్ గుర్తించి చిరునవ్వుతో నా భుజం తట్టి తన గదికి తీసుకెళ్ళారు. అక్కడ జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, వరవరరావు, ఆర్టిస్ట్ చంద్రలాంటి గొప్ప వ్యక్తుల్ని పరిచయం చేశారు మాస్టారు. ఆ మొగ్గదశలో ఆ పరిచయాలు నాకు గర్వంగా అనిపించాయి.

### మేధావులను అబ్బురపరిచిన తొలి కవిత

మాస్టారు గోర్కీ 'అమ్మ' నవల చదివించడంతో నా మెదడును అలుముకున్న సంప్రదాయ భావజాలం బూజంతా వదలడం ప్రారంభమైంది. తర్వాత మహాప్రస్థానం, రక్తాక్షరాలు, ఉక్కుపాదం, చెంగిజ్ ఖాన్ గ్రంథాల పఠన పరంపర ఆరంభించి తొమ్మిదో తరగతిలో 'రక్షించుకుందాం' కవిత రాశాను. 'విద్యుల్లత' సాహిత్య మాసపత్రికలో ప్రచురితమై మేధావులను సైతం అబ్బురపరిచింది. నాటి జ్వాల పత్రిక సంపాదకీయం నా కవితా ప్రతిభను ప్రశంసించింది.

1973లో ప్రపంచ యువజనోత్సవ కవితల పోటీల్లో సినీనటి కాంచన చేతులమీదుగా రజత పతకం స్వీకరించాను. కల్తీసారా విజృంభణ, ప్రజా సమస్యలపై నిరంతర పోరాటాలు చేసేవాణ్ణి.

### అరసం నేతగా అరుదైన రికార్డు

బంగ్లా విముక్తి ఉద్యమం స్ఫూర్తితో ఆనాటి కవితా గానాల్లో పాల్గొనేవాణ్ణి. డెబ్బయ్యవ దశకంలో ఒకవైపు విప్లవ రచయితల సంఘం, యువభారతి కార్యక్రమాలు మరోవైపు, అభ్యుదయ రచయితల సంఘం (అరసం) పునరుద్ధరణ సమావేశం ఇంకో వైపు జరుగుతున్న తరుణంలో, కమ్యూనిస్టు ఉద్యమనేత ఎ. పుల్లారెడ్డి పాతనగరం రచయితలకు అరసంతో సంబంధాలేర్పరిచారు. అప్పటికే ఏటుకూరి ప్రసాద్, కందిమళ్ళ ప్రతాపరెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, గజ్జెల మల్లారెడ్డి మొదలైన వారంతా మాతో సాహిత్య ఆత్మీయానుబంధం కొనసాగించారు. 'అరసం' హైదరాబాద్ నగరసమితి సభ్యుడుగా ప్రారంభించి 1992లో అరసం రాష్ట్ర ప్రధానకార్యదర్శి, 1996లో అధ్యక్షుడి స్థాయినుంచి 1999–2004లో అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం జాతీయ ప్రధాన కార్య

## అధ్యాపకుణ్ణి ఉపకులపతిని చేసిన కొంటె విద్యార్థి సవాల్!

నేను అధ్యాపకునిగా ఉన్న సమయంలో ఒక కొంటె విద్యార్థి నన్ను సవాల్ చేశాడు. ఆ సవాలే నన్నొక విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ స్థాయికి ఎదిగేలా నాలో స్ఫూర్తి రగిలించింది. గడచిన మూడు దశాబ్దాలుగా నిరంతరం శ్రమించి ఉపకులపతి స్థాయికి ఎదిగాను. అదెలాగంటే...

అధ్యాపకునిగా ఒకసారి నాకు విద్యార్థుల భవిష్యత్ లక్ష్యాలేమిటో తెలుసుకోవాలనిపించింది. ఒక్కొక్కరినీ ప్రశ్నించడం ప్రారంభించాను. ఒక్కొక్క విద్యార్థి తన భవిష్యత్ లక్ష్యం ఏమిటో చెబుతున్నాడు. వెనుక బెంచీలో ఒక కొంటె విద్యార్థి కూర్చున్నాడు. అతన్ని ప్రశ్నించాను. అతను కాలుమీద కాలువేసుకుని కాళ్ళు ఊపుతూ, 'అసలు నువ్వేం కావాలనుకుంటున్నావ్ సార్?' అని ఎదురు ప్రశ్నించాడు. 'నేను వైస్ ఛాన్సలర్ కావాలనుకుంటున్నాను' అన్నాను. ఇక అప్పటినుండి వైస్ ఛాన్సలర్ కావాలంటే ఏం చెయ్యాలని నా తోటి అధ్యాపకులనందరినీ ప్రశ్నించాను. తలో సలహా ఇచ్చారు. మనబోటివారికి అందని ద్రాక్ష పండే అన్నారింకొందరు. ఇక అప్పటి నుండి నిరంతర అధ్యయనం ప్రారంభించి వరుస పిహెచ్‌డిలు చేశాను. ఆ విధంగా 2016 జూలై 26న తెలుగు విశ్వవిద్యాలయం పదవ ఉపకులపతిగా పదవి స్వీకరించాను.

నన్ను ప్రశ్నించిన ఆ కొంటె విద్యార్థి సి.హెచ్. వేణుగోపాలరెడ్డి. ఇబ్రహీంపట్నంలో భారత్ విద్యా సంస్థల అధినేత. జీవితంలో అతడూ ఎదిగాడు. ఇప్పుడతను నాకు పుత్రసమానుడు.



ప్రణాళికా సంఘం మాజీ ఉపాధ్యక్షుడు అహ్లువాలియా నుంచి జీవన సాఫల్య పురస్కారం అందుకుంటూ

దర్శి పదవికి చేరాను. దక్షిణ భారతదేశం నుండి అలా ఎదిగినవాణ్ణి నేనే. ఇదొక అరుదైన రికార్డు. 2004-12లో 'అరసం' జాతీయ అధ్యక్షవర్గ సభ్యుడిగా బాధ్యతలు నిర్వర్తించాను.

### సోవియట్ పర్యటన

1998లో మాస్కో విశ్వవిద్యాలయంలో 'మల్టీ కల్చరల్ లాంగ్వేజ్ కమ్యూనికేషన్ సదస్సులో 'భాష-పాత్ర'పై పరిశోధనా పత్రం సమర్పించడంతో ఆర్నెల్లు విదేశీ పర్యటన చేశాను. ఉత్తమ అధ్యాపక పురస్కారం, శ్రీశ్రీ శతజయంతి స్వర్ణపతక పురస్కారాలు పొందాను.

### పిహెచ్‌డిల కుటుంబం

నా జీవితభాగస్వామి కందిమళ్ళ భారతి. 1982లో కులాంతర వివాహం చేసుకున్నాను. రామోజీరావు సహా అనేకమంది ప్రముఖుల సమక్షంలో మూడు వేలమంది మధ్య జరిగిన, పురోహితులు, మంత్రాలు, విందులు లేని ఆదర్శ వివాహం మాది. నా సాహిత్యం, వ్యక్తిత్వం, విధినిర్వహణ రూపకల్పనలో భారతి నా భాగస్వామి. భార్యాభర్తలుగానే కాకుండా మేం ఉత్తమ స్నేహితులం, ఉద్యమ సహచరులం. ఆమె గ్రంథాలయశాస్త్రంలో పిహెచ్‌డి చేసి మూడు స్వర్ణ పతకాలు సాధించారు. ఉస్మానియా గ్రంథాలయ శాఖలో అసిస్టెంట్ ప్రొఫెసర్. మా అమ్మాయిలిద్దరూ పిహెచ్‌డిలు చేశారు. అలా మాది పిహెచ్‌డిల కుటుంబం. పెద్దమ్మాయి సృజన నేత్రవైద్యంలో పిహెచ్‌డి చేసింది. పెద్దల్లుడు శివ చీకోటి. ఆస్ట్రేలియా మెల్‌బోర్న్ నగరంలో బ్యాంక్ మేనేజర్. మాకో మనవడు. పేరు నైతిక్. రెండో అమ్మాయి శృతి. బయోమెడికల్ ఇంజనీరింగ్‌లో పిహెచ్‌డి చేసింది.

### వీధిరౌడీనయ్యేవాణ్ణేమో!

పుస్తక పఠనమే జీవితంలో నన్ను పైకి ఎదిగేలా చేసింది. నిరంతర అధ్యయనం, నిర్విరామకృషి ఈ రెండే నా విజయానికి సోపానాలు. ఈ తరానికి నేను చెప్పేదిదే. కవి, రచయిత ఎవరికైనా సమాజ అధ్యయనం కావాలి. చదువుకోలేకపోయి ఉంటే, పుస్తకంపై ప్రేమ పెంచుకోలేకపోయి ఉంటే, నిరంతర పుస్తక పఠనం, అధ్యయనం లేకపోయివుంటే హైదరాబాద్ పాతనగరంలో ఈపాటికి నేను ఒక వీధిరౌడీగా మారేవాణ్ణేమో!

### ఉభయ భాషా భ్రష్టత్వం

తెలుగు రాష్ట్రాల్లో ప్రాథమిక స్థాయిలో తెలుగు తప్పనిసరి చేయాలని ప్రభుత్వాలను కోరుతున్నాం. తెలుగు పాఠ్యాంశం చదివిన విద్యార్థులకు ఉద్యోగాల్లో కొంత వెయిటేజ్ మార్కులు ఇచ్చి ప్రోత్సహించాలి. తద్వారా తెలుగు చదివేవారి సంఖ్య పెరుగుతుంది.

కేవలం ఐదు శాతం కార్పొరేట్ సంస్థల ఉద్యోగాలకోసం ఆంగ్లమాధ్యమమే సర్వస్వంగా భావించకూడదు. ఆ భ్రమ నుండి తల్లిదండ్రులు బైట పడాలి. తల్లిదండ్రుల ముచ్చట కారణంగా పిల్లలు అటు ఆంగ్లం, ఇటు తెలుగు తెలియక ఉభయ భ్రష్టత్వం పడుతున్నారు.

### లక్ష పదాలతో నిఘంటువు

నా హయాంలో విశ్వవిద్యాలయాన్ని కొత్త పుంతలు తొక్కిస్తున్నాం. ప్రతి రెండు వారాలకో విలక్షణ కార్యక్రమంతో విశ్వవిద్యాలయం పరుగులు తీస్తోంది. హలో విద్యార్థి చలో క్లాస్‌రూమ్, ప్రజల వద్దకు విశ్వవిద్యాలయం, విదేశీ విద్యార్థులకు తెలుగు బోధన, జానపద గిరిజన అధ్యయనాలకు పెద్దపీట... వంటి కార్యక్రమాలు చేపట్టాం.

### ఉగాది సమ్మేళనం:కథకు ప్రోత్సాహం

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం సమన్వయంతో, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం చరిత్రలో మొదటిసారి మార్చి 29న ఉగాది సమ్మేళనం చేస్తున్నాం. విస్మరించబడిన సాహిత్యవేత్తలను గౌరవించడం, కొత్తగా రాస్తున్న రచయితల్ని ప్రోత్సహించడం ద్వారా తెలుగు సాహిత్య వికాసానికి మా వంతు కృషి చేస్తున్నాం. స్వయంగా ఎంపిక చేసిన పుస్తకాల ముద్రణతోపాటు ఔత్సాహిక రచయితలు, పరిశోధకులకు పుస్తక ప్రచురణకు ఆర్థిక సహకారం అందిస్తున్నాం.

ఇక నుండి కథను ప్రోత్సహిస్తాం. ఏడాది కాలంలో వివిధ పత్రికల్లో వచ్చిన కథలు, సంకలనాలు, సంపుటుల్లో వచ్చిన ఉత్తమ కథలు ఎంపిక చేసి ప్రతి ఏడాదీ ఒక కథా సంకలనం ప్రచురించాలనే ఆలోచన ఉంది.

త్వరలో ఆవుల సాంబశివరావు శతజయంతికి స్మారక పురస్కారం ఇస్తాం. లక్ష తెలంగాణ పదాలతో నిఘంటు నిర్మాణానికి శ్రీకారం చుట్టాం. జిల్లాలవారీగా విజ్ఞాన సర్వస్వాలు, రాష్ట్ర చరిత్ర, తయారుచేస్తాం.

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో ఒక అపురూపమైన, అద్భుత గ్రంథాలయం ఉంది. మెకంజీ కైఫియత్తుల ఒరిజినల్ ప్రతులు, తాళపత్ర గ్రంథాలు, రాగిరేకుల గ్రంథాలు, పురాతన పత్రికా సంచికలు, శాసనాలు, అతి ప్రాచీన గ్రంథాలున్నాయి. అందరికీ జ్ఞానాన్నిచ్చే విజ్ఞాన భాండాగారమిది.

—రామ్మోహన్



భార్యాపిల్లలతో..

## ఉగాది ప్రత్యేకం




ప్రయాణిస్తున్నంతసేపూ
చిన్నారి
కనురెప్పలపైన
తడి తడి హృదయం
పరచుకుని
వుంది
దేన్లోనో లీనమవుతూ
దేన్నో జ్ఞాపకం చేసుకుంటూ
ఇద్దరం
చెరో దిక్కులో
కూర్చున్నాం
ఒకే నావలో



ఒకే తీరం వైపు సాగుతున్నాం
.....
కారాగారం
ఇంత మంది మనుషుల్లో,
మనుషుల ముఖాల్లో
ఒక్క మిణుగురైనా ఎగరట్లేదు
ఒక్క మాటను
దయతో కళ్ళకొత్తుకుని
ప్రాణం పోస్తారని
ఎదురుచూస్తున్నాం
ఒట్టి ఎదురుచూపే
మిగులుతుంది

సరే
అంతా గాయపడినట్టుంది
తెలియని వెలితి ఏదో
అందరిలోనూ
గుమికూడినట్టుంది
అంతా తెరిపినిస్తున్నట్టే వుండి
మబ్బులు
ముసురుకుంటున్నాయి
.....
నల్లని దారులగుండా ప్రయాణం
చేస్తూ
ఎలాగో గమ్యం చేరాం
దేశాన్ని

## ఒకే స్వప్నం కింద

యుద్ధభూమిగా
యుద్ధభూమిని
దేశంగా
భావించే
వీరుణ్ణి కలిసింతర్వాత
చిన్నారి హృదయంలో
తడిగా తడితడిగా, లేలేత
పచ్చికబయళ్లా
దేశమే
చిగురించటం
మొదలుపెట్టింది
.....
తిరుగుప్రయాణంలో
చిన్నారి, నేను
ఒకే స్వప్నాన్ని మోసుకెళ్తున్నాం


–బాలసుధాకర్ మౌళి
సెల్: 9676493680





## సుధామ పదగారడి-307

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | ❖ | 4 | | 5 | |
| ❖ | h | ❖ | | ❖ | | ❖ | h | ❖ |
| 6 | | 7 | ❖ | 8 | ❖ | 9 | | 10 |
| | ❖ | 11 | | | | ❖ | ❖ | |
| 12 | 11 | | ❖ | ❖ | ❖ | 13 | | h |
| | ❖ | 15 ❖ | 14 | 15 h | | h | ❖ | |
| 16 | 17 | | ❖ | | ❖ | 18 | 19 h | |
| ❖ h | | ❖ | 20 | ❖ | 21 | ❖ | h | ❖ |
| 22 | | | | ❖ | 23 | | | |

### ఆధారాలు

**అడ్డం**

1. దుర్ముఖి తరువాతి తెలుగు సంవత్సరం (4)
4. ఏడాది మొదలు (4)
6. బంగారం (3)
9. ఇది దిగజారితే విలువ దిగజారినట్లేనా! (3)
11. ఏనుగు (4)
12. సుకుమార వనిత అనే! (3)
13. ఆలోచన (3)
14. మామిడి, విశాలము కాదు (4)
16. పెద్ద అల, కెరటం (3)
18. విటుడు (3)
22. కోకిల (4)
23. తిథి వారనక్షత్రాదులపై తిరగేసేది (4)

**నిలువు**

2. వండడం ఒక ఎత్తు ఆప్యాయంగా ఇది చేయడం ఒక ఎత్తు (3)
3. శిశువు (2)
4. కాంతి, కన్నెకాదు (2)
5. మేషాదులన్నీ (3)
6. గుర్రం జాషువా గారికి గల బిరుదు (5)
7. నగలు చేయు వృత్తికారుడు (3)
8. దూది (2)
10. ప్రియుడు అనే (5)
13. తాంబూలం (3)
15. వ్యవసాయం (2)
17. రహస్యం చెదిరిపోయింది (3)
19. మాత్ర (3)
20. నీరు తోడేది ఏ మతం లో వుంది! (2)
21. విల్లు (2)

### పదగారడి-306 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ర | చ | 2 న | ■ | 3 స | త్సం | 4 గం | ■ | 5 కు |
| స | ■ | గ | ■ | ఖి | ■ | గా | ■ | శ |
| 6 ప | రి | ణ | యం | ■ | 7 ఆ | న | వా | లు |
| ట్టు | ■ | ము | ■ | 8 సం | ■ | ది | ■ | డు |
| ■ | 9 కా | ■ | 10 ప్ర | త | మ్ | ■ | 11 ఈ | ■ |
| 12 ప్ర | సా | దం | ■ | సం | ■ | 13 వి | శా | ఖ |
| ■ | రం | ■ | 14 షి | ■ | 15 తా | ■ | న్యం | ■ |
| 16 ర | ■ | 17 ద | యా | 18 భీ | ష్మ | ■ | ■ | 19 తా |
| 20 సిం | సా | రి | ■ | తు | ■ | 21 చె | క్క | లి |


Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**